# తుకారా...

(శ్రీకృష్ణదేవరాయల చారిత్రక మహాకావ్యము)

కృతిస్వామిని

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి




గ్రంథకర్త :

## విద్వాన్ ఊర్పిడి ప్రసన్నకవి



వినుకొండ

8—4—78





మూల్యము : Rs. 5-00

# పీఠిక

విశ్వనాథ సత్యనారాయణ

ఈ గ్రంథకర్త పేరు బీర్నీడు ప్రసన్న. ఇతడు పూర్వము పృథ్వీ భాగవతమన్న మహాగ్రంథమును వ్రాసెను. అతని కథాకల్పనకు, నతని శైలికి, నతని సొగసైన కల్పనలకు మక్కువపడి నేనా గ్రంథము నంకితము తీసికొన్నాను. ఆగ్రంథము పఠించినవారికీ సంగతి తెలియును.

ఇప్పుడు "తుకారా" యన్న యీ ప్రబంధమును రచించెను. ఇందులోని కథ ప్రసిద్ధమైనది. శ్రీకృష్ణదేవరాయలు గజపతి మీదకి దండెత్తి పోవుటయు తిమ్మరుసు గజపతి యొక్క పదునార్గుర మహా సేనానులను విరుచుటయు గజపతి నిస్సహాయుఁడై రాయలుతో సంధి చేసికొని తనకూఁతును రాయలకిచ్చి పెండ్లి చేయుటయు రాయలు నిద్ర పోవుచుండగా నామె తానుదాచిన ఖడ్గముతో రాయలు రొమ్ములో కత్తి దిగవేయుటయు మొదలైన కథ చాలమందికిఁ దెలియును.

ఆ గజపతి కుమార్తె పేరు "తుకారా" ఈకవి యీకథలో నౌచిత్యముకొఱకు కొన్నిమార్పులుచేసెను. ఈ తుకారా బొమ్మను చిత్రకారి యొకర్తె వ్రాసి రాయలునకు చూపించెను. ఆ సౌందర్యమునకు రాయలు ముగ్ధుఁడై యామెకొఱకే గజపతిపై దండెత్తెను.

ఈ చిత్రకారిణి కథ కూడ పూర్వమెవరో వ్రాసినట్లు జ్ఞాపకము.

ఈ చిత్రకారిణి పలుచిత్రములు వ్రాసి రాయలునకు చూపించెను. ఇతడు చేసిన మార్పేమనగా నాచిత్రకారిణి లిఖించిన చిత్రములు భవభూతి యుత్తర రామచరిత్రలోని ప్రథమాంకములోని బొమ్మల వంటివి. భవభూతి తనప్రథమాంకమున నా చిత్ర పట ప్రదర్శనము రానున్న సీతా వియోగమును సూచించుటకు చేసెను. ఆ ప్రయోజనము కొఱకే యీతడును చేసెను. రాయలు తుకారాను వదలి పెట్టలేదు గదా?

అసలు కథలో నీ తుకారా తుమ్మెదల మీద కొన్ని శ్లోకములు వ్రాయుటయు నడవికివెళ్ళిన రాయలు తచ్ఛ్లోకములను చదివి తుకారాను స్వీకరించుటయు ప్రచలితమైన కథ. ఈ గ్రంథములో నాకథ లేదు. ఈతడు వేఱే కల్పించెను.

ఈతని కథలో తుకారా రాయలును కత్తితో పొడుచుట లేదు. తిమ్మరుసు రాయలుకు బదులు రాయలువంటి బొమ్మను ప్రక్కమీద పండ పెట్టుటయులేదు. ఆబొమ్మ గుండెలో తిమ్మరుసు తేనెపోసి నెత్తురనుకొని యాతేనియను తుకారాత్రావి యింత తియ్యగా నున్న నెత్తురు కల రాజెంత మహాత్ముఁడో యని దిగులుపడుట లేదు. ఇది కొంత యనౌచిత్యము. ఒక పురుషుఁడొక స్త్రీని మిక్కిలిగా ప్రేమించి యామెతో కలసికొనెడి ప్రథమ రాత్రమునందు నామెకొఱకు ఎదురు చూచునా? నిద్రపోవునా? అందుచేత నీకవి దానిని తొలఁగించెను. ఆమె యొడ్డాణమే ఖడ్గము. తొందర పడుచున్న రాయలును తన యొక నియమముచేత నారేయి వలదని నివారించి రాయలు పరధ్యానముగా నున్నపుడు తుకారా యొడ్డాణము తీసి యితనిని వధింప బోయెను. అపుడు తిమ్మరుసు హఠాత్తుగా వచ్చియామె పన్నాగమును తెలియఁ జెప్పుటయు రాయలామెను వధింపఁ బూఁనుటయు తిమ్మరుసు వారించుటయు నామె యడవికి బోవుటయుగా నీకవి కల్పించెను.

ఈమె యడవిలో విరహ మనుభవించుచు తపస్సుచేయుచు నచ్చట నొక మహా నగరమును నిర్మించి తాను సన్యాసిని యయ్యెను. రాజ్యము చేసినట్లు కల్పింప బడినది. ఆమె రాజ్యమెట్లు చేసెనో యీ గ్రంథము నందు వర్ణింప బడినది. నిజమైనరాజు ప్రజలనెట్లు పాలింప వలయునో యితడు చతుర్థాశ్వాసములో కొన్ని పద్యములను వ్రాసెను.

రాజు వేటకు వెళ్ళెను. ఆయన వేటకు వెళ్ళిన యడవికిని, తుకారా నిర్మించిన పట్టణమునకు నడవిలో పెద్దకొండ యడ్డముగానున్నది. అందుచేత వేట సంగతివారికి తెలియదు. అందుచేత తుకారా నిర్మించిన పట్టణము సంగతి రాజునకు తెలియదు.

వారిద్దఱు వేఱొక పద్ధతిలో కలసికొనిరి. ఆపట్టణమునకు రాయలు వేటకు వెళ్ళిన యరణ్యమునకు నడుమ నొకకొండ యున్నదని వర్ణించుట కవియొక్క యౌచిత్య జ్ఞానమునకు నిదర్శనము.

కథాంతమున మరియొక చమత్కారము కలదు. కావ్యము మొదటనే చిత్రకారిణి బొమ్మలుగీసి తుకారామీద రాయలునకు ప్రేమ కల్పించినదో చిట్టచివర కాయమయే తుకారా రాయలులకు సంయోగమును కల్పించినది.

కథానిర్మాణము నందిది యొకనేర్పు కంటిని చెఱువు కథకూడ నిందులో నున్నది.

ఇప్పుడిది పద్యాత్మకమైన గ్రంథము. ఒక చిన్న వచనము కూడ లేదు. ఇత డాధునిక కవికాదు. పద్యాత్మకమైన గ్రంథములో కవి యొక్క గొప్పదనము వాని పద్యరచనా నిర్మాణ శక్తిమీద నాధారపడి యుండును.

పూర్వ మహాకవులు, మహాకవులుగా నిలిచి పోవుటకు వారి పద్య రచనా నిర్మాణ శిల్పశక్తి ప్రధాన కారణము. ఆశక్తి తక్కువయైన కవులు మన సారస్వతమున తక్కువ రకపు కవులైరి. ఇదియొక రహస్యము. ఆరీతిగా నూహించలేని వారికి తెలియదు.

ఈ గ్రంథము నందాఱాశ్వాసములు కలవు. మొదటి మూడా శ్వాసము లొకయెత్తు. చివరి మూడాశ్వాసము లొకయెత్తు. మొదటి మూడాశ్వాసములు కూడ తక్కువవి కావు. కాని చివర మూడాశ్వాసముల మూలముగా నీతని గ్రంథము తెలుగు సారస్వతమున చిరస్థాయిగా నుండ గలదు. పారిజాతాప హరణమున మొదటి యాశ్వాసము, మనుచరిత్రిన మొదటి మూడా శ్వాసములు నా మహాకావ్యములు నిలుచట కెక్కువ హేతువులు గదా? వానినే యధిక జనులు చదువుదురు గదా? ఆముక్త మాల్యదలో చిట్టచివరి మాలదాసరికథ కావ్యమునకు మకుట ప్రాయముగా లేదా? అట్లే యీతని ఈగ్రంథములో చివరి మూడాశ్వాసములు తెలుఁగు సారస్వతమున బహు పాఠక పఠన యోగ్యములుగా నున్నది.

కవితాశక్తిచేత వారికితడు తక్కువవాడుకాదు. పదముల కూర్పు చేత నుంతయెక్కువ వాడైన కావచ్చును. వారు సంస్కృతమున మహా పండితులు.

తెలుఁగులో నితని శబ్దజాలము చాల సమృద్ధిగా నున్నది. కాని కొన్నికొన్ని చోట్ల సంశయ గ్రస్తముగా నల్పాల్పములైన తెలుగు వ్యాకరణ దోషములు కలదిగా కనిపించును. అయినను నవి యంతగా చెప్పుకోఁ దగినవికావు.

కొందఱి పాఠకులకు దోషములే ప్రధానములు కవియొక్క యనంత కవితాశక్తి వారికి పట్టదు. ఎవరి ప్రకృతి వారిది. మహా భావుకునకు దోషములు కనిపించవు. అతఁడు వానిని లెక్క పెట్టడు.

ప్రధానముగా కవియన నేమి? పద్యము వ్రాసిన వాఁడేకవి. తక్కినవాడు కవికాడు. కవిత్వములో గుణములు నలంకారములు ధ్వనులు మొదలైనవి ప్రధానములు కదా? ఛందస్సు లేక పోయినను నట్టివి కలిగినచో నది నిస్సందేహముగా కవిత్వము. పద్యములు వ్రాసి చప్పగా వ్రాసెడి వానికన్న నెన్నో యర్థములు పెట్టి వచనము వ్రాసెడివాడు గొప్ప కవియన్నచో నిజమువలె కన్పించును. కానీకాదు. ఎందుచేతననగా మనుష్యుఁడున్నాడు. అతనికి ముక్కు మొగము కాళ్ళు చేతులు నొక రకముగా నుండును. అట్లున్నవాడే మనుష్యుఁడు. కృతజ్ఞత, శౌర్యము మొదలైన సద్గుణములు కలిగినచో మహాపురుషుడు. ఈ గుణములు జంతువుల యందుండ వచ్చును. వానిని మానవు లనము. ఇది ప్రధానభేదము. మరియొక పోలిక చెప్పెదను. అరటి ముక్కలు, పొట్లముక్కలు, వంకాయ ముక్కలు, తమల పాకులు మొదలైన వానితో తెలుగు నిండ్లలో బజ్జీలు చేసుకొందురు. సెనగ పిండితో చేయుదురు. పచ్చి మిరపకాయలు వేయుదురు. నూనె మరగగాచి దానిలో వేయుదురు. బయటకు తీయగా బజ్జీలగును. పట్టి సెనగ పిండిలో పచ్చిమిరపకాయలు వేసి యుడక పెట్టుదురు. తరువాత తిరుగమూత వేసెదరు. దానిని పాతోళీ యందురు. పదార్థము నదియు నిదియు నొకటే! గుణము కూడ నొకటియేమో! తెలియదు. కాని యీ పాతోళి బజ్జీలుకావు. వానిని సిద్ధ పరచు పద్ధతివేఱు. రుచివేఱు. పండుగులకు బజ్జీలను భక్ష్యములుగా చేయుదురు. పాతోళీని నెవ్వరు పిండి వంటగ పరిగణించరు. ఇట్లే పద్యము వ్రాసిననే కవిత్వము. తక్కినది కానేరదు. కాని యీబజ్జీలు

చేయుటలో నూనె సరిగా మరుగకాగవలెను. పచ్చిమిరపకాయలు తగినన్ని పడవలయును. బజ్జీలు చక్కగా నుడికవలయును. ఒక వైపున నుడికి మరియొకవైపు తెల్లగా నున్నచో నవి మంచి బజ్జీలుగా రుచినీయవు. అట్లే పద్యము వ్రాయునపుడు కూడ పరమేశ్వర దత్తమైన యొకశక్తి కవి కుండవలయును. లేనిచో బజ్జీలు పచ్చివెచ్చిగా నున్నట్లే పద్యము పచ్చి వెచ్చిగా నుండును. సెనగపిండిలేక బియ్యపు పిండితో చేయవచ్చును. కమ్మగా నుండ వచ్చును. మినప పిండితో చేయవచ్చును. అవిగారెలకు దగ్గఱగా నుండును. ఆరీతిగా పద్యము పద్యమే.

పద్యములో నేమగును? గణయతి ప్రాసలచేత వాక్య విన్యాసము వేఱుగా నుండును. అర్థవిస్పష్టత యేర్పడును.

నాటకములలో నటకులు వచనములను పద్యములను చదువుదురు కదా? చాల భాగమువారి వచనములు వారి పద్యములు సామాజికులకర్థ మగుచునే యుండును. అట్టి రచనకు వేష ధారణము సంగీతము సుష్ఠు పాఠకము సాంగికాభినయము నివియన్నియు దేనికి? నాటకము చదువు చున్నచో మనకు తెలియును గదా?

ఇది యొక కళ. ఆ భావములోని రమ్యత హృదయంగమముగా నుండుటకు రసానుభూతి కలుగుటకు నివియన్నియు దోహదములు. మనస్సునకు దెలియుటవేఱు ఆభావము హృదయమును స్పృశించుటవేఱు.

కవిత్వములో ఛందస్సు శైలిపాకము వృత్తి యివి యన్నియు భావనా రసస్ఫోరకమగుటకు చేసెడి ప్రయత్నములు.

ఇట్టి దానిని విద్యయందురు. కవిత్వము విద్య.

కవులయొక్క ప్రతిభా విశేషములచేత నీ విద్య యొకప్పుడు సామాన్యముగా నుండును. ఒకప్పుడులోకాతిశాయిగా నుండును. భావము లెవ్వరును క్రొత్తవి కల్పించలేరు. లోకము నుండి భిన్నములైన యార్థిక పరిస్థితుల నుండి, లౌకిక జీవితము, పారలౌకిక జీవితము మొదలైన వానిని గురించి పూర్వము కొందఱాలోచించి గ్రంథములుగా వ్రాసిరి. ఇతరులు వానిని పట్టుకొని తైలక్క లాడుదురు.

ఆ పూర్వు లాలోచించిరనగా వారి మనస్సులోని చుఱుకుదనమును పట్టి యాలోచింతురు. మొద్దున కాలోచన తట్టదు. ఆ మొద్దునకు తట్టె డాలోచన మొకటియే. తాను వృక్షము. తక్కిన వృక్షములన్నియు మొద్దులు. భావుకత్వము విమర్శ సాహిత్యము మొదలైన మహా వివేక సముద్రములైన విషయము లిటువంటి మొద్దులపాలైనచో దేశమెట్లుండునో చెప్పనక్కఱలేదు గదా!

పద్య రచనలో కైలాసము నంటుకొన్న మహాప్రభువులు కలరు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పెద్దన్న, తెనాలి రామకృష్ణయ్య మొదలైన వారు. వారే మహాకవులుగా నిలిచిపోయిరి. చాలమంది విస్మృతకవులు విస్మరింపబడిరి. ఎందుచేత? ఆ మహాశక్తి వారికిలేదు కనుక నీవు వారి నందఱిని త్రవ్వి తలకెత్తుకొనుము. ఎవ్వరు వలదన్నారు?

ఈపైనచెప్పిన మహాకవులలో ఎవరి రచనా శిల్పకౌశలము వారిదే. భగవద్దత్తమైన శక్తి యొక్కడనున్నది. ఇంగ్లీషు భాషలో షేక్సుపియ రంత వానిని కొందఱు విమర్శకులు మిల్టన్ ముందర కవికాదన్నారు. మరికొందఱు షేక్సుపియరును సమర్థించినారు. ఆ సమర్థన యెట్టిది? మహాకవియొక్క శక్తి రెండు విధములు. మొదటిది భగవద్దత్తమైనది.

రెండవది కవి తన యభ్యాసముచేత, పాండిత్యముచేత, మెలకువచేత సాధించినది. మొదటివాడు కవి. రెండవవాడు శిల్పి. ఈ భేదము మిల్టన్, షేక్సుపియరుల మధ్యనున్నది. భవభూతి, కాళిదాసులమధ్యనున్నది. నన్నయ, తిక్కనల మధ్యనున్నది.

ప్రస్తుత మీ గ్రంథకర్త రెండవజాతికే చెందినవాడు. మాటలు మెలపుగా కూర్చి సంధానించి కల్పనలు భావములు క్రొత్తక్రొత్తగా నున్నట్లుచేసి పద్యరచన చేయుటలో నితడు సిద్ధహస్తులలో నొకడు.

ఇతడు హరిజనుడని, మహాకవియని మొదటనే చెప్పితిని. ఇతని కింతశక్తి వట్టి భగవత్ప్రసాదముగా కనిపించుచున్నది. ఇది యభ్యాసము చేత వచ్చునంటివి గదా? మరల భగవత్ప్రసాదమందు వేమి? యని యడుగ వచ్చును.

ఒకడు లాటరీలో లక్ష రూపాయలు సంపాదించును. ఒకడు జీవితములో శ్రమించి చివరకు లక్షరూపాయలు సంపాదించును. రెండవ వానిది కూడ భగవత్ప్రసాదితమే. ప్రారబ్ధములు ఫలించుటలో మార్గములు వేఱు.

పూర్వము సర్వభారత దేశకవియని ప్రఖ్యాతి గాంచిన రవీంద్రనాథ టాగూరు రామాయణములోని యూర్మిళను గుఱించి మాటాడుచు నామె నొకయుపేక్షిత పాత్రయనినాడట. ఆ రవీంద్రుని యుపదేశముచేతనే శ్రీమైథిలీ శరణ గుప్తగారు సాకేతమన్న మహాగ్రంథము రచించినారని విన్నాను. సాకేతమును నే చదివినాను. మైథిలీ శరణగారి హిందీశైలి కండ చక్కెర వంటిది. తులసీదాసులోని కొన్నిభాగములు చదివిన

ఠయివాత సాకేతమే రుచించును. కాని యూర్మిళను మైథిలీ శరణగారు కథలోపెట్టి పెంచిరిగాని యామె గొప్పదనమును మనకు నచ్చునట్లు చెప్ప లేదని నాయనుమానము.

ఆపని యీ తీర్చిడు ప్రసన్న కవి చేసినాడు. ఈ కావ్యనాయిక పేరు తుకారా. భర్తృపరిత్యక్త ఊర్మిళవలెనే. ఈ తుకారాకు లక్ష్మణుని భార్య యూర్మిళ లక్ష్యభూతురాలు. ఈ గ్రంథములోని నాల్గవ ఆశ్వాసములో నీ తీర్చిడు ప్రసన్నకవి పండ్రెండవ పద్యము మొదలు ఇరువది యేడవ పద్యము వఱకు నూర్మిళ గుఱించి వ్రాసెను. ఈ రీతిగా నూర్మిళ గుఱించి వ్రాసినవాడు పూర్వము లేడు. శలవిధాల నికముందుండడు.

ఇతని కల్పనకు పేపే సాటలేదు. తుకారా శ్రీకృష్ణరాయల వియోగమునను భవించుచున్నది. కొన్ని యేండ్లు గడుచుచున్నవి. ప్రతి యేడాది యాఱుఋతువులు వచ్చుచున్నవి. అవి యాఱు సీసపద్యములలో వ్రాసెను. అతఁడెన్నుకున్న మాటలు. కూర్చినకూర్పు చాల విచిత్రము. మహాద్భుతము.

అతఁడొక్కొక్కచోట నొక యుత్ప్రేక్ష చేయును. అది యెట్లు సాధ్యమైనదో మనము గ్రహించలేము.

కృష్ణరాయలు చిట్టచివరకు వియోగినీ రూపములో నున్న తుకారాను చూచెను. తక్కిన పద్యము లట్లుంచి

*"భూదేవి లేనవ్వు మొలకలై యడుగులు
నడచినచోటి కందములు దిద్ద"

* 4వ ఆశ్వాసములో 46 పద్యము

అనఁగా నామె భూమిమీద నడచుచున్నది. ఆమె కాలి గుర్తులు భూమిమీద పడుచున్నవి. ఆ కాలి గుర్తులు భూదేవి నవ్వి నట్లున్నవట.

మొగలిపూల తావితో నిండిన గాలులు దోసిళ్ళతోఁ దాగుటకు వీలుగా నున్నవియన్న వాల్మీకి యూహకు దగ్గరగా నున్నదీయూహ. ఇతని కల్పనలు కూర్పు లెన్నియైన జెప్పవచ్చును.

పాఠకుఁడోపికతో మూడశ్వాసములు చదివి చివరి మూడశ్వాసముల వద్దకు పోవలయును.

కథా నిర్మాణశక్తి యెచట పెంచవలయునో యెచ్చట తగ్గించవలయునో! కల్పన లెట్లు చేయవలయునో! కావ్యము యొక్క పరమార్థ మేమి, యా కవియొక్క పద్యరచనలోని విలక్షణమైన శిల్ప మెట్టిది మొదలైన విషయములు చూడకుండ నిక్కడ నీ వ్యాకరణపు తప్పు యక్కడ నీవ్యాకరణపు తప్పు అనియెడు వాడు మహాకావ్యము చదువుటకు యోగ్యుఁడు కాడు.

అందుచేత నెన్నితప్పులైన వ్రాయవచ్చునని నేననుటలేదు. మహాశిల్పియైన కవియొక్క కవిత్వమునందు స్వల్పదోషములు పట్టుట బాపు కత్వము కాదని మనవిచేయుచున్నాను. ఈవ్యాకరణదోషములు పట్టువారికి సంపూర్ణముగా వ్యాకరణదోషములు తెలియునాయన్న సందేహము నాకు కలదు.

ఈ పీఠికను నేనేదో యభిమానమును పురస్కరించుకొని వ్రాసినచో నేను పోవలసిన లోకములకు నేను పోదును. అట్టి దుర్వ్యాఖ్యానము నెవరైన చేసినచో వారు పోయేడిలోకములకు వారు పోదురు.

(సం) కవిసమ్రాట్ డాక్టరు విశ్వనాథసత్యనారాయణ
3—8—75

# పరిచయము

## డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, M. A . ఆనర్సు

కవి వతంసులు శ్రీ విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారు రచించిన తుకారా ప్రబంధము నా దృష్టిపైఁ బఠించి యమందమైన యానందము నొందితి. వారిదివఱకు రచించిన పృథ్వీభాగవతము కేతన దశకుమార చరిత్ర ముభయకవి మిత్రునివలె కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథుల మెప్పించుటయేకాక వలచి వలపించుకొన్న దన వారి కవితా కళా కౌశల మును గూర్చి వేరుగా చెప్పవలసిన యవసరములేదు. భావగాంభీర్య మున పదప్రయోగ సౌష్ఠవమున కథాకథనమున రసపాత్ర పోషణమున వారి కావ్య ముత్తమోత్తర పరిపాక విరాజమానమై యద్వితీయ సౌందర్య మందిరమై విరాజిల్లుచున్నది. ఈకాలమున సలక్షణమైన భాషలో పద్యములు వ్రాయువారి సంఖ్యయే పరిమితమై పోయినది. అందును రస పాత్ర పోషణ ప్రాగల్భ్యముతోడను సముచిత పద్యన సౌందర్యము తోడను గూడిన మహాకావ్యమును మధుర మంజులముగ వెలయించు మహనీ య కవిపుంగవులసంఖ్య మఱీంత పరిమితమైపోయినది. అట్టి యీకాల మున శ్రీ ప్రసన్నగారు రచించిన సుందర కావ్యమును పఠించుతఱి దరి లేని మరుభూమిని బయనించుచు నొయ సిస్సును గాంచిన సార్థవాహుని మనస్సువలె నా మనస్సపారమైన యాహ్లాదము ననుభవించినది. శ్రీ ప్రసన్నగారికివే నా హృదయపూర్వకాభి వందనములు.

సాహితీ సమరాంగణ సార్వభౌముఁడు శ్రీ కృష్ణదేవరాయలు గజ

పతి కూఁతురైన తుకారాను ప్రేమించి మాతృ దురుపదేశముచేఁ బ్రాణముల హరింప నెంచినయామె ఔదార్యమున నింటినుండి పంపివైచి దైవవశమున పశ్చాత్తాప ప్రక్షాళిత పాపపంకమైన నామె నానందమునఁ బరిణయమాడిన వృత్తాంత మిందలి వస్తువు. చిత్రకారిణి ప్రదర్శించిన చిత్రములలో తుకారా చిత్రమును జూడఁగనే రాయల మనస్సామెయందు లగ్నమయ్యెను. తిమ్మరుసు వలదనన్నను వినక యాతఁడు గజపతిపై దండు వెడలెను. పోరు తలమున్కలై పరాజయము ప్రాప్తించునేమోయని యాతఁడు భయమందు సమయమున తిమ్మరుసు పన్నినపన్నాగ మాతనికి విజయలక్ష్మిని కైవసమొనరించెను. గజపతి సంధికొడంబడి తనకూఁతును రాయలకు పట్టమహిషిగా నిచ్చుట కంగీకరించెను. రాయలాభిజాత్యహీనుఁడను తలంపున గజపతిభార్య యందులకు సమ్మతింపకపోయెను. గజపతి సంధినియమముల ననుసరించి కూఁతును రాయలకిచ్చుటకే నిశ్చయించెను. తిమ్మరుసు రాయలకోరికపై భటవేషమును ధరించిన యాతనికి తుకారాను జూపించెను. తిమ్మరుసు సూచన ననుసరించి గజపతి వివాహము జరిపి తలఁబ్రాలు ఖడ్గమునకే పోయించెను. తుకారా రాయల సౌధమున కరుదెంచెను. ఆమె తల్లి ప్రేరణమున మేఖలారూపమున నమర్పబడిన ఆయుధముతో రాయలను నిద్రించునప్పుడు చంప సాహసించెను. ఒక పరిచారిక వలన నీ రహస్యము నెఱింగి తిమ్మరుసు తుకారా యొడ్డాణమునకు శిల్పిచేఁ బ్రతిసృష్టి చేయించి యామె సాహసమున కొడిగట్టుతఱి చేయొడ్డి యాపద తప్పించెను. రాయలు కుపితుఁడయ్యు నామెను తీవ్రముగా శిక్షింపక తిమ్మరుసు నుపదేశమున నింటినుండి పంపివైచెను. తుకారా యడవికేగి పశ్చాత్తాపమునకు గుఱియై రాయలవారి కుత్తరమువ్రాసెను. తిమ్మరుసు ప్రేరణమున రాయ లుచితపరివారముతో నామెకు రత్నరాసులు పంపించెను. తుకారా యచట నాదర్శనగరమును నిర్మింపజేసి పతినే ధ్యానించుచు

వియోగవేదనతో కాలము పుచ్చుచుండెను. చిత్రకారిణియే వెంచెతయై మఱి కొందఱు వనచరులతో నేగి రాయలను వేటకు రమ్మని యాహ్వానించెను. వేటకైనపిమ్మట రాయలును పరివారమును తుకారా నిర్మించిన నగరమునకు చెంత నున్న మైదానముననే శయనించిరి. రాయలు చూడు లేడిని జంపనున్న వ్యాఘ్రమును సంహరింపనేగి యోగినీ వేషమున నున్న తుకారా నామెకుఁ గనపడకుండనే వెంబడించి యామె సౌందర్యమున కచ్చెరువడి పరివారము తనకై వెదకుకొనునేమోయని మైదానమున కల్లసాని పెద్దనతోఁ దిరిగివచ్చెను. మఱునాడు తిమ్మరుసు మున్నగువారితో నతఁడు తుకారానగరమునకేగెను. తుకారా వారికి స్వాగతమొసంగెను. ఆమెకు రాయలయెడఁ గలప్రేమకు పెక్కునిదర్శనములు చూపెట్టెను. రాయలామె నానవాలుపట్టి తనవలపు వెలిపుచ్చెను. ఇంతలో చిత్రకారిణి యోగినీవేషమున నచ్చటి కరుదెంచి తుకారా శ్రీకృష్ణదేవరాయలకు మరల వైభవముతో వివాహోత్సవము నిర్వహింప వలెనని కోరెను. క్షణములో సన్నాహము చేయఁబడెను వివాహము వైభవముగా జరిగెను. దురదృష్టవశమున కళంకితమైన వలపు పశ్చాత్తాపముచే అగ్నితప్తమైన బంగారమువలె మాలిన్యశ్యామికను వొఱంగి పరిశుద్ధమయ్యెను.

కథా కథనమునఁ గవిగారు ప్రదర్శించిన నేర్పు ప్రశంసనీయమై యున్నది. తొలుతనే చిత్రకారిణి తుకారా చిత్రమును జూపి రాయలకామెయందు ప్రేమ కలిగించుటయు తిమ్మరుసు కలలో రాయల యాహ్వానము నాలించివేచి పదునార్గురు పాత్రులకు నుత్తరములతో కానుకలపంపి గజపతికి భయమును రాయలకు జయమును కలిచించుటయు. భటవేషమును ధరించిన రాయల కాతఁడు తుకారాను దర్శించు నవకాశమును గల్పించుటయు తమయాచారమని తెల్పి యాతడు గజపతిచే ఖడ్గమునకే తలఁబ్రాలు పోయించు విధానమ నంగీకరింప జేయుటయు రాణి ప్రేరణ

చే రాయలను జంపుట కరుదెంచు యోధులు రాకముందే యతని రాజ భవనము దాటించుటయు నొడ్డాణమునకు ప్రతిసృష్టిచేయించి తుకారా రాయలఁ జంప సాహసించు సమయమున చేయొడ్డి యాతని రక్షించుటయు తుకారా వ్రాసిన యుత్తరమును జూచిన పిమ్మట రాయల కామెపై ననుకంప గలిగించుటయు నీ కావ్యమున కథా గమనమున కెన్నియో విధములఁ దోడ్పడినవి. తుకారా యమర పట్టణమును బోలిన సుందర నగరము నడవిలో నిర్మింపఁజేసిన వృత్తాంత మద్భుతముగా నున్నది. ఉప్పరిది గండి నాపుటకై కొడుకును బలియిచ్చిన సన్నివేశము ప్రధాన కథా సంబంధి కాకపోయినను తుకారా హింసావైముఖ్యము నెఱుంగుట కుపయోగ పడుచున్నది. చిత్రకారిణి చెంచెతయు యోగినియునై కథాగమనమునకు చాల దోహద మొనరించినది. వేట వృత్తాంతము రాయలు తుకారాను జూచుటకును మరల వారిరువురును సమాగము పొందుటకును అవకాశము కలిగించినది. ఈవిధముగా కావ్యమునందలి సన్నివేశములన్నియు పరస్పర సంబద్ధములై కథకు సౌష్ఠవమును బిగువును జేకూర్చినవి.

ఈ కావ్యమున పతితల కపారానందమును కలిగించునది తుకారా పశ్చాత్తాప వృత్తాంతము రాయలను నిద్రించుచుండగా చంప సాహసించు వఱకు నామె తల్లియుపదేశమునే యనుసరించినది. పిమ్మట నామెమనస్సు మారినది. అడవికి రాఁగనే క్షమాభిక్ష నర్థించుచు నామె రాయల కుత్తరము వ్రాసినది. రాయలు పత్రాదులు పంపుట యామె కాశ్చర్యము కలిగించెను. పిమ్మటనామె యోగినియై విరహవేదన ననుభవించినది. ఆమె రాయల యనురాగామృతమునకై యువ్విళులూరినది. నగరమును నిర్మించి యామెయందలి ప్రజల నలరించిన విధ మపూర్వము. అమితమైన పశ్చాత్తాపముచే నఘమంతయు పటాపంచలుకాగా నామె భర్తృ సమాగమ మున కర్హురాలైనది. ఆమె శీలమునఁ గలిగిన యాపతివర్తనమును చిత్రిం

ఘటలోఁ గవిగారు చూపించిన నేర్పసాధారణమైనది. తుకారా తన్నుఁ జంప యత్నించుట కన్నులారఁ గాంచియు రాయలామె యెడ ననురాగ లేశమును వహించుట యామె యదృష్టము.

కవిగారిందుఁ గావించిన వర్ణనములు నాతి దీర్ఘములును భావ బంధురములునై యొంపు నింపుచున్నవి. కొన్నిచోట్ల వారి వర్ణనలు కథా సంబద్ధములై మనోహరముగా నున్నవి. అందుకు కావ్యమునందలి చివరి పద్యము తార్కాణము. చిత్రకారిణి తుకారా చిత్రమును రాయలకుఁ దెల్పుచు "పద్మజుని నగిషీ పనితనంబంతయుఁ బ్రత్యవయవమునఁ బ్రబ్బజేసి" యను పద్యమున నామె యపూర్వ సౌందర్య విశేషమును వెల్లడించెను. ప్రథమ భాగాంతమునఁగల నిశాప్రాతర్వర్ణనమును రాయల విరహ వర్ణనమును అతడు తుకారాను తనతో మాటాడు మని వేడుచు చేసిన శృంగార ప్రసంశమును చిత్రకారిణి చెంచెతయు యోగినియు నైనప్పటి వర్ణనమును తుకారా విరాగిణీ రూపవర్ణనమును తుదిభాగము నందలి కుంకుమచ్ఛవిఁ జిమ్ముకొంచు ప్రాగ్గగన మండలమున కెక్కుచున్నాఁ డినుండిత్యాదిగాఁగల ప్రాతఃకాల వర్ణనమును వేట వర్ణనమును కవిగారి లోక పరిశీలనమును ఔచిత్యజ్ఞను జాటుచున్నవి. గజపతి భయగ్రస్తుడై యడవిఁ జొచ్చునప్పుడు చీఁకటి యాతని నాహ్వానించు సందర్భమున కవిగారు కావించిన చీఁకటి వర్ణన మపార భావనా పాటవముతో గూడి యద్భుతముగా నున్నది.

తుకారా యడవిలో వియోగబాధ ననుభవించు సందర్భమున నామెకు లక్ష్మణుని భార్యయైన ఊర్మిళ స్మృతికి వచ్చెను. వియోగ బాధానుభవమున్న వారికిఁ జాల సామ్యమున్నది. ఇప్పుడామె యూర్మిళ నుద్దేశించి పల్కిన పల్కులు కరుణ రసమున కాలవాలమునై రాతిగుండె కలవారిని

గూడ ద్రవింపఁ జేయుసు. ప్రథమ భాగమున రాముఁడు రావణు వధా నంతరము పుష్పకముపై సీతతో నయోధ్య కరుగుచు వివిధ దృశ్యములను సీతకు వర్ణించి చెప్పిన సందర్భమున్నది. ఈవర్ణన కాళిదాసు భావములను చక్కఁగా వెల్లడించుచు ప్రౌఢ సుందరముగా నున్నది. ఇది చిత్రకారిణి చిత్రకళా నైపుణితో పాటు కవిగారి వర్ణన పై శారద్యమునుగూడ చక్కఁగ ప్రదర్శించుచున్నది. కాని యీవర్ణనమిచ్చటఁ గొంత దీర్ఘతరముగా నున్నదని నేనను కొంటిని. దానికిని కథా భాగమునకును నిబిడమైన సంద ర్భము లేకపోవుటయే యందుకుఁ గారణము.

ఈ కావ్యమునఁ బ్రధాన రసము శృంగారము. అది కొంత రసా భాస రూపముననుు, కొంత విప్రలంభ రూపముననుు కొంత సంభోగ రూపముననుు గోచరించును. రాయలు తుకారాను గాఢముగా ప్రేమిం చెను. కాని యామె తల్లి బోధనమూలమున నాతని ప్రేమింపకపోవుటయే కాక చంపుటకుఁగూడ సాహసించెను. ఇచ్చట ననురాగ మేకత్రమాత్ర నిష్ఠమైయున్నది. తరువాత తుకారా హృదయమున పరివర్తనము జరిగి నది. అప్పటినుండి శృంగారము విప్రలంభరూపము దాల్చినది. పంచమా శ్వాసము చివర నామె ఋతుషట్కమును వియోగవేదనాభారముతోఁ గడి పిన వృత్తాంతము నిపుణముగా వర్ణింపఁబడినది. ఇచ్చటి సీసములొకవంక నామె వియోగనైశిత్యమును వేఱొకవంక నాఋఋతువుల స్వరూపమును విశదముగా వ్యక్తమొనరించుచున్నవి. తరువాత తుకారా భగవంతు నుద్దే శించి కావించిన ప్రార్థన యామె హృదయవేదనను విప్పిచెప్పుచున్నది. ఆమె పతియే దైవంబని దైవంబే పతియని యనుపమభక్తిన్ దనపతి రూపములో దేవుని దేవునిలోఁ దనపతిని జూడఁజాలెను. ఆమె యోగినీ వేశము వియోగమెత్తిన స్త్రీరూపమువలె గోచరించును. కావ్యాంతమున

సంభోగరూపము నొసంగినవి. గజపతి పాత్రల ననుమానించి రణ ప్రయత్నముమాని వనమున కరగునెడను తుకారా రాయల యంతఃపుర మునుండి యడవికిఁ బంపఁబడినపుడును కరుణరసము గోచరించును. తుకారా రాయలను జంపబోవునపుడు తిమ్మరుసు చేయొడ్డి యాతని రక్షించిన సందర్భమును రాయలు యోగినియే తుకారాయని గుర్తించిన సందర్భమును అద్భుతమున కాలవాలములు. ఇట్లే కవిగారు వీరరౌద్ర శాంతరసములను గూడ నాయాసందర్భములందు చక్కఁగా పోషించియుండిరి.

పాత్రపోషణమున వారు ప్రదర్శించిన నేర్పు కడుంగడు ప్రశంసనీయము. తిమ్మరుసు రాజభక్తి ప్రతిభావిశేషములను రాయలవారి కళాతత్పరతా, రసికతా, దయాౌదార్యములను వారు పోషించినతీరు మెచ్చఁదగియున్నది. తుకారా తొలుత తల్లి దురుపదేశమునకు గురియై యమాయకమైన సాహసమున కొడిగట్టినను తరువాత పరివర్తముఁజెంది పరమౌదాత్త్యమును బ్రకటించినది. పశ్చాత్తాపమామెను పవిత్రురాలి నొనరించినది. నగరమునిర్మించి యందామె ప్రజల నలరించిన విధ మాదర్శప్రాయమైనది. గజపతిభార్య యాభిజాత్యప్రీతిగలది. ఆమె యాభిజాత్యమునకై యనుఁగు కూఁతు కాపురమునే మంటగల్ప సాహసించినది. గజపతి వీరుఁడయ్యు తిమ్మరుసు పన్నాగమును గ్రహింపలేకపోయెను. మొదట నాతఁడు యుద్ధమున నుత్సాహము చూపినను తరువాత భయమును ప్రదర్శించెను. రాయలు దాసీపుత్రుఁడు కాడనియు నల్పకారణమున నాతని కట్టి యపప్రథ కల్గెననియు నాతఁడు సమర్థించెను. భార్యయు బంధువులును రాయలతోడి సంబంధము నంగీకరింపకపోయినను ఆతఁడు తన నిశ్చయమును విడువలేదు. చిత్రకారిణి చెంచెతయై యోగినియై కథాగమనమునకుఁ దోడ్పడెను. ఆమె చిత్రకళాకౌశలమును కావ్యకరణ సామర్థ్యమును ప్రశంసాపాత్ర

ములు. ఉప్పరిదిచేసిన త్యాగమును ఆమెకొడుకు కంబఁడొనర్చిన సాహస మును అద్భుతములు. పెద్దనాదులు రాయలతో వేటకుఁగూడ వచ్చుట రాయలవారి కవితాప్రీతిని సూచించును.

కవిగారీకావ్యమున నాయాసందర్భములందుఁ బ్రకటించిన భావము లుదాత్తములును చమత్కార సంభృతములునై వారి ప్రతిభాపాటవమును ప్రకటించుచున్నవి. "ఎపుడో భాగవతమ్ము వ్రాసి చనిపోయెన్ వ్యాసుఁడు" ౧-83; "అతిరహస్యమె బట్టబయలగుచునుండ" ౨-6; "ఎఱుఁగనెఱుఁగ వీరస్వర్గ మెంతటిఱుకు ౨-13: రాజారాకకుఁ బరమనీరజములు ౪-70 మున్నగు పద్యము లిందుకుఁ దార్కాణములు, వారి సీసములన్నియు భావ భరితములై యపూర్వమైన వారి భావనాపటిమను జాటుచున్నవి. "తనగెల్పు బావుటా తళుకు రేయింబవళ్ళుదయాద్రిమీఁది సూర్యోదయమ్ము 11-10 పిట్టగుడ్లను బోతుపెంటిగాఁ గల్పించు జంటలోఁగలుగు సంసారిగుట్టు- ౨-138," ఝుంకారరుతిని మాషట్పదుండీనాఁడు మాధురీనవపద్మ మధువు గ్రోలు. ౪-61; "ఉదయాస్తమయ వినూత్నోరుపత్రిభలలో నఁతని మృదు లారుణాననమునరసి ౫-130; మున్నగునవి యందుకుఁ గొన్ని దృష్టాంత ములు. తుకారాతో వచ్చిన పరిచారికలయు రాయల యంతఃపుర పరిచారి కలయు సంభాషణము వ్యంగచమత్కార భాసురమై కవిగారికి పూర్వ ప్రబంధములతోగల గాఢపరిచయమును ప్రకటించుచున్నవి. వారిపద్య ములు కొన్ని వసుచరిత్రయందలి పద్యములవలె నత్యంత హృద్యములుగా నున్నవి. రాయల విరహోత్కంఠను సూచించు "భానుని కౌఁగింటిలో వింకను గరిగి, పోవదే మపర సంధ్యావధూటి" ౪-57 మున్నగు పద్య ములు విరాట పర్వమునందలి కీచకుని విరహవేగమును దలపించుచున్నవి. "వరనాథా! మిమువంటితేండ్లకెడమై నాయయ్య నాతమ్ముడున్" ౧-27;- శాశత పతివ్రతాశి ఖంభచ్చరిత్రయందు ప్రథిత నూత్నాధ్యాయమై

రచింప విలిఖింపకుండఁడు నీ పవిత్రకథను సుప్రసన్నుఁడౌ నే సుకీ సుకవియేని ౬-76; మున్నగు పద్యములు కవిగారి యాత్మీయతను వ్యక్తముచేయుచున్నవి. ఇందలి సుప్రసన్నుఁడౌ సుధీకవి విద్వాన్ సుప్రసన్నగారె।

కవిగారి పద్యములన్నియు కవితామయములై యొప్పారుచున్నవి. ప్రత్యేక పద్యము లేదోయొక చమత్కారమునకో? అపూర్వ భావనకో? భావనా సౌందర్యమునకో నిధానములై వారి ప్రతిభా ప్రౌఢిమలను చాటుచున్నవి. "మూడు తరములు తిరిగె నాముసురుపట్టి ఒక గయాళితుఫానైన దుండి యుండి" ౧-2 ముసురుండియుండి తుఫానైనయట్లు విజయనగర గజపతులమధ్య వైరముండియుండి యుపద్రవకరముగా పరిణమించెననిభావము. "కాని గజపతిమాత్రము కట్టుఁగొయ్య కందకున్నాడు రాయల కదియె చింత" ౧-10, అనుచోట గజపతి కట్టుగొయ్య యను పదములెంతో భావగంభీరములై యున్నవి. ఏనుఁగుల నాలానములకుఁ గట్టుదురుకదా? "జిలిబిలి గాలికింగదలు చిక్కని చక్కని కోరమీనముల్" ౧-70; అను పద్యమున కళానిధి పదప్రయోగము సాభిప్రాయమై యున్నది. "ఊబిందింపి వధింపు మిగ్గజవరేణ్యున్ రాజ కంఠీరవా।" అనుచో ప్రతిపదమును సార్థకమై యింపునింపుచున్నది. "విచ్చుకత్తుల పారాల బిచ్చలించు......" ఆవనిత యసూర్యంపశ్య నీవు రాజసూర్యుఁడవు నీవెటుల నామెఁ జూడ నగును ౨-97. అను పద్యమున అసూర్యంపశ్యా రాజసూర్య పదములప్రయోగమందలి యౌచిత్య మత్యంతానంద దాయకముగానున్నది. ఈవిధముగ నీకావ్యమున నుత్తమ కవిత్వమునకు లక్ష్యములు కాదగిన పద్యములెన్నో యున్నవి.

ఇంక కవిగారి శైలినిగూర్చి రెండు మాటలుచెప్పి విరమింతును. ఈ కావ్యమంతయు జాతీయములకు లోకోక్తులకు చక్కని నుడికార

ములకు నిధానములై తెలుఁగుదనమును గుమ్మరించుచున్నవి. పద్యము లన్నియు ధారాశుద్ధి శోభితములై భావగంభీరములై కవిగారి అభ్యాసవిశేషమును ప్రకటించుచున్నవి. పద్యముల యెత్తుగడలు నూత్నములై మిక్కిలి హృద్యములుఁగనున్నవి. "తలాయించున్" "తటాయించెడిన్" మున్నగు క్రియాపదము లాయాపద్యములకు సహజతనేకాక శక్తిమత్తనుగూడ సమకూర్చుచున్నవి. కవిగారెచ్చటను అనవసరముగా బదాడంబరమునకై యత్నించి యుండలేదు. వారి యలంకారములు పెక్కు ప్రయత్నసిద్ధములు. "అనుచు నేనాడుహితవున కాన్పుపుండు- ఉరుముధ్వనివిన్న పింఛ మయూరమగుచు" ౧-82 మున్నగునవి వారి సరసోపమా రచనా వైచక్షణ్యమునకు నిదర్శనములు. వారు పెక్కుచోట్ల రమ్యములైన అర్థాంతరన్యాసములు వాడియుండిరి. అవి సందర్భశుద్ధి శోభితములై వారి లోకజ్ఞతను చాటుచున్నవి.' గెల్పులోటములు దైవాధీనముల్ గూఢముల్ ౨-130; నాతులకు సాటివృత్తియే లగ్గగున్ 3-117; "ఆ దిత్యేందుద్వయి యెవ్వరెత్తుకొన ద్యోతించున్ దివారాత్రముల్" ౪-13 మున్నగునవి యాదృచ్ఛికముగా నెన్నిన యుధాహరణములు. ఇంక నీగ్రంథమునఁగల జాతీయోక్తు లసంఖ్యాకములు. అవి కావ్యమునందంతటఁ బ్రత్యక్షములగుచు దానికెనలేని తెనుగుదనమును గల్పించినవి. ముట్టినది ముత్యయ పట్టిన దంత పైఁడిగా-ఏటి జిల కందకులేనిదె కత్తిపీటకున్; దంపినమ్మకు బొక్కినదే కూలి;- మూకుళ్ళుండును కుండమూయగ జగమ్మున్ మూయగా మండనే? ౨-24; నిండుగా మునిగినన్ జలిలేదు ౩-34 సొమ్ముదిని రొమ్మునగుద్దితి రేమిసేయుదున్? మున్నగునవి నిదర్శనములు కైజారు కైజారునో! ౧-88 వంటి శాబ్దిక చమత్కారములుగూడ నెడనెడ గోచరించుచు కవిగారి పాండితీ ప్రయోగపాటవములను బ్రకటించుచున్నవి. మొత్తముమీద కావ్యమంతయు రసవంతమై తెనుఁగుదనమునకు నిలయ

మై భావగాంభీర్యమున కాటపట్టై చదివినకొలంది చదువవలెనను నభిలాష కలిగించుచున్నది. సరసప్రౌఢములైన యిట్టికావ్యము లిటీవలి రచనలలో నెక్కో కానరావు. ఇందెడనెడ వ్యాకరణాది స్ఖాలిత్యములు కొన్ని దొర్లినవి. వానిని సవరించుటంత క్లేశకరముకాదు. విద్వాన్ బి. ప్రసన్నగారు కవివంశ కరీరములు. వారింకను రసవన్మనోజ్ఞములైన కావ్యములు కల్పించి ఆంధ్ర శారద కభినవాలంకృతులును, ఆంధ్ర రసికుల కబ్బురపు టామెతలను అందింతురుగాక?

(సం.) డాక్టరు దివాకర్ల వేంకటావధాని, యం. ఎ., ఆనర్సు
హైదరాబాదు 20—6—74

# అభిప్రాయము

## యం. ఆర్. అప్పారావు,

యం. ఎ.,—యం. యల్. ఎ.
వైస్ - చాన్స్‌లర్
ఆంధ్ర యూనివరిసిటి, విశాఖపట్నం 530003
(ఎ. పి.)

విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారి రచన "తుకారా" ప్రబంధం సుమనో మనోరంజకంగా ఉంది. దీనిలోని ఇతివృత్తం చారిత్రికమైనది. చారిత్రక కావ్యాల్లో చారిత్రికకు ఎంతతావు ఉంటుందో కపోలకల్పనకూ అంత అవకాశం ఉంటుంది.

తుకారాలో చారిత్రికాంశాలూ, ఐతిహ్యాలూ, కవికల్పనలు ముప్పేటగా పెనవేసుకొన్నాయి. అయితే అవన్నీ మనోజ్ఞంగా మలచబడ్డాయి.

శ్రీ ప్రసన్నకవి సమర్థుడైన కవి అని కావ్యపరిశీలన స్పష్టం చేస్తుంది. ప్రసన్నగారిది సుప్రసన్నమైన రచన నిరాఘాటమైన పద్యధార, సుందరమైన వర్ణనలలో, సరసములైన సంభాషణలు, కావ్యానికి ప్రాణం పోశాయి. సామెతలు. నుడికారాలు అన్నిచోట్ల చక్కగా అతికినట్లు కవి వాడారు. అన్నిటినీ మించి సజీవపాత్రలు కావ్యలోకంలో సాక్షాత్కరిస్తాయి.

ఇన్ని గుణాలు ఒకచోట కుదురుకోబట్టే సుమారు ఎనిమిది వందల పద్యాలుగల ఈకావ్యం ఒక్కబిడిని చదవడం సాధ్యపడింది.

సలక్షణమైన గ్రంథం. హృదయామోద యోగ్యమైన కావ్యం. కవిగారి కలంనుండి మరిన్ని చక్కనికావ్యాలు రావాలని ఆశిస్తున్నాను.

(సం.) యం. ఆర్. అప్పారావు, యం. ఎ., యం. యల్. ఎ.
విశాఖపట్నం 11—5—75

# కృతిసమర్పణ




శ్రీహరి ! యుపకారీ! యని
సౌహిత్యము నడిగికొనిన సాయపడు మహో
త్సాహి మదీయాంధ్రోర్వీ
"సాహిత్యాకాడమికి'' ప్రసన్నుండగుతన్!

ప్రత్యంశంబును జూచి దీని వెలయింపన్ ముద్రణార్థంబు స
న్నుత్యర్హంబుగ తత్క్షణమ్మె పదియార్నూర్లన్ గటాక్షించి న
న్నత్యంతాదర సంపదన్ గను మదీయాంధ్ర ప్రదేశాచ్ఛ "సా
హిత్యాకాడమి'' కిచ్చుచుంటిఁ గృతిగా ఈనా తుకారాకృతిన్!

*   *   *   *

రకరకమ్ముల నూత్నరచనలు దీపింపఁ
గృతికల్పకులఁ బ్రోత్సహించు కొనుచు
జీర్ణించి పోనున్న శ్రేష్ఠంబులగు పూర్వ
కృతిజాలముల నుద్ధరించు కొనుచు
బ్రతుకెల్ల వెచ్చించి వడిపెద్ద భాషా వి
శిష్టులంబ్రీతిఁ బోషించుకొనుచు
ననుబోలి యజ్ఞాతమునఁ గుందు కవుల న
న్వేషించి కృపను బింబించు కొనుచు

ఆంధ్రభోజుల భోజుల నధిగమించి
వేయి కన్నులఁ గరముల విలసనమున
హైదరాబాదు నాంధ్ర సింహాసనమున
నెసఁగుచున్న అకాడమి కెవ్వరీడు?

ఈ యకాడమిన్ నాతుకారాయుఁ "బృథివి
భాగవతము" మాతండ్రి కావ్యంబు పారిజ
నాభ్యుదయ మచ్చయినవి, యియ్యాంధ్ర ధాత్రి
నింత కన్నను దాతలింకెందుఁ గలరు?

* * * *

బీర్నీడివారి కావ్య
స్వర్ణతుకారా! ప్రసిద్ధ సాహిత్య గభీ
రార్ణవ మీవు చనువది: య
హర్నిశ లచట సుయశమున నలరారఁ గదే!

గ్రంథకర్త
8—4—78.

# కృతజ్ఞత

నేను వ్రాసిన ప్రతికృతియు మహారసజ్ఞుల యాదరములకు నోచికొనను
సకలాంధ్ర సుకవుల జాబితాలో నేను స్థిరయశానకుఁ జోటుచేసికొనను
ఉండగుడిసెయైనఁ బండఁ జాపైన మిన్నైతున నేను తలెత్తుకొనను
"కవులకు బీర్నీడి కాణాచి" యన్న నా వంశప్రతిష్ఠఁ గాపాడుకొనను

అనవరతము దోహదకారులగుచునుండు
ప్రథిత బెజవాడ-దేవులపల్లి-మేక-
విశ్వనాథ-దివాకర్ల - పింగ - శంత్రి -
వావిలాల-మద్దులపల్లి వంశ దుగ్ధ
వాదినిధి శరచ్చందులఁ బ్రస్తుతింతు!

ఏ కవుగింట మిట్టిపడియెన్ గవితా లలితాంగి గాన వి
ద్యా కలశాబ్ధినీదె నెవఁడట్టి విశేషమనీషి నాంధ్ర భా
షా కవితాకళార్చనకుఁ జక్కఁగ ముర్వరమమ్మఁ గన్న మో
షేకవి నన్గఁ దల్లియగు శ్రీమతి సంతసమున్ నుతించెదన్.

అవసరముల నెఱుఁగుచు నన్నాదుకొనెడి
బీ. బి. ఫ్రాంక్లిను - టి, డి. ప్రసాద్బాబు "సిని" ర
చయిత మోదుకూర్ జాన్సన్ల సద్యశమ్ము
వ్యాపనీయంబగుత దిగ్దిగంతములకు

సత్కవిగనన్ను నావీట సత్కరించి
నాకు పుష్పాభిషేకంబొనర్చెఁ గరుణ;
మంచికంటి త్ర్యయంబక రాడ్వరించి సూరి
ఆయనను గొనియాడెద నహరహంబు

ఆంధ్రభాషా మహోబ్ధిఁ గట్టులరాయ సీదులాడిన గజయీతగాండ్రు
సారస్వత సభలమై మఱువంగ మచ్చుజల్లెడు జగామాంత్రి కుండ్రు
విద్వత్తుతో వీరవిఖ్యాతిఁ నలరారు నద్భుతంబగుతెల్గు నందగాండ్రు
సాహిత్య సేవలో జరయు శ్రమంబును గుర్తెఱుంగని లేఁత కణ్ణవాండ్రు

ప్రథిత విబ్వనాథవారు-దివాకర్ల
వారు నాలుతుకు నభమున కర్క
చంద్రులైనవారు - చాలదీజన్మ మా
ఘనుల ఋణము దీర్చుకొనను నాకు!

గురువు శిష్యులన్న గురులఘు భావంబుఁ
గలిగెయుండివారు - కలుగనీరు
గురువుశిష్యులన్న గురులఘుభావంబుఁ
బ్రీతినిన్నుఁ గనికరిందు పట్ల!

పసుపులేటి కులజు శ్రీనివాసరావు
సరస గుణరాశి నర్సరాట్పుర నివాసి
ఈతుకారాను ముద్రించి యిచ్చెశ్రద్ధ
నీ నెనరునిఁ బోచుత! శ్రీశు శ్రీనివాసు!

కుసుమ దళముల మృదులంబుఁ దొసగనీక
మధురిమలఁ గోలు పూవుఁ దిమ్మరుల పగిది
మెలఁకువగ కావ్యసుమములఁ గల రసముల
ననుభవించెడి రసికాళి నభి మతింతు!

---

# విజ్ఞప్తి

భాషాపోషణమెందులేక పరభూభర్తృ ప్రభుత్వంబుతో
దోషధ్వాంతములేలు కాలములయందుంబుట్టి యస్పృశ్యతా
ద్వేషజాలలఁ గ్రాగిపోయిన జగా విన్కొండ వాస్తవ్యులౌ
మోషే జోసపు జామువాకపుల తోఁ బుట్టున్ ప్రసన్నాభిధున్

కొందఱింకను నిప్పుడెందుకీ ప్రాఁదెల్గుఁ బెగకై తలని న్యక్కృతింతుదనుట
తొంటివ్యాకరణఛందోబద్ధ కవనంబు సర్పపరిష్వంగ సరణిదనుట
అల్పాల్పవచన పద్యమ్ముల నవలల కథగాథలకె యిదికాలమగుట
నేటి పాఠక మహనీయులు సుకుమారు లూరకే రసమానఁ గోరుచుంట

ఇవుడు కృతులందు కొనువారె మృగ్యులగుట
నేను నెఱుఁగుదు లెస్సగానైన నొకటి
ప్రబల హేత్వవసరములఁ బట్టికాదె
చేయవలె నెప్పుడెవ్వరే చేఁతలైన?

పాఠ్యంబులకుఁ బ్రభుత్వంబిట్టి కవితలనుండియే గ్రహియించు చుంటఁగతన
విద్వత్కవీంద్రు లీవిధ కావ్యములనే "ఓహో" యెంచు శ్లాఘించు చుంటఁ
గతన
తెలుఁగుభాషకు వన్నెఁదెచ్చిన కృష్ణరాయావనీంద్రుని గాథయగుటఁ గతన
మాతండ్రిచే రచింపమొదలై సాగిపోకింటఁబడి వృథగానుంటఁ గతన

పూజ్యనన్నయాది పూర్వకవీంద్రుల
కై(తలొంటనింక( గాలమెట్టి
తీరువైన సీతుకారా ప్రబంధమున్
వ్రాయవలసి వచ్చివ్రాసినాడ ।

తొల్లి వ్యాకరణ ఛందోబద్ధముగ యతిప్రాసల తోనే ప్రబంధములను
రెండుమూడర్థంబులుండ నొకకథలో రెండుమూడుకథలు తాండవింప
తమపాండితీ పాటవముల( దీటుకొనుచు పూర్వులువ్రాసి. రమోఘ ఫణితి
ఇపుడెందఱెందఱెన్నెన్ని యర్థములతో నుద్గ్రంథముల (వ్రాయుచున్నవారు?

నాటి కట్టుబాట్లు త్యజించి నవ్యులిపుడు
భాషకొనరించుచున్న విశేషమేమి?
కాలమెదుగుచున్నకొల(ది నోలిభాష
యు నెదుగవలెనా? తఱుగు చుండవలెన?

పొ(డి పాడిద్యాది పదములందరసున్న యున్నను లేకున్న నొక్కటౌన?
సీలు నీర్వాదుల నెఱి పదమ్ములలోని, ఱ, రలకు భేదంబు వరలవలద?
ఒను, వను - ఉను, వును, - లనుళను లొకటైన భాషావిశిష్టత భంగపోద?
"దేశభాషలయందు( దెలు(గెలె"స్సను సు(ప్రతిష్ఠను నిలుపుకో దివిరవలద?

నీవునకుమాఱు "నువ్వ"న- నీవువచ్చి
నావనను "నువొచ్చా" వన నాగరికత
కా? స్తుతికి? శ్లేషకా? యలంకారమునక?
ఎందుకో యీతిరస్కృతు లెఱుకపడవు!

తెలుఁగుఁ కవిత్వమున్ చిత్తుల దీరగ నన్నయభట్టు తొల్లి ప్రా
సలు గణముల్ యతుల్ గలుగ సాంద్రముగా బిగియించినాడు, వా
గ్భలులగు పండిత ప్రభులె పాదము సాగక మొత్తుకొందు ర
య్యలఘులె యట్టులైన నిఁక నన్యులసంగతిచె ప్పశక్యమా?

గాలులకె కొట్టుకొనిపోవు తేలికైన
పొట్టువంటివిస్వాతంత్ర్యపుంగ వితలు
ఎట్టువెంతకుఁ జెడిపోని కుట్టిమముల
చందమవి శాస్త్రలక్షణ సత్కవితలు

ఈరకమగు ఫక్కినె మాయూరి సుకవి
గబ్బిలమ్ములనే వ్రాసి కనక సలిల
వృష్టి మునిఁగినా! దేనుఁగు నెక్కినాడు
జబురుకొన్నాడు సాంద్ర శశ్వద్యశమ్ము!

తనదులక్ష్మినుండి నిరుపేదలకుఁ బైస
దానమీన్ ప్రబుద్ధుండు తనదు వాణిఁ
బలుచ పఱచి యెల్లర కందఁబంచు; వాణి
యెంత గాలిదైన దకటా! యీతరాన?

ప్రజల కోసమంచు భాషను దిగజార్చి
యాఱుమూడుసేయ నర్థమున్నె
భాషకొఱకె ప్రజలపైకిఁ దీసికొనిన
అన్నివిధముల శుభ మగునుగాదె!

నేను హృదిఁ జీల్చి చెప్పుకో లేనదేమొ
ప్రీతినముఁ గన్న నాతెల్గు కైత తల్లి
వాలకము తరిగి కట్టుబాట్లు తొఱఁగి
తిరుగుచుండిన నాగుండె లెరియుచుండు।

కట్టుబాట్లులేని కైత; యాకృతిలేని
పంచదారపాకు వంటిదగును।
కట్టుబాటులున్న కైఁత యచ్చొత్తిన
పంచదారపాకు వంటిదగును।

సొంతగుఱి బెట్టుకొని మింటి చుక్కలిలకు
నేయఁజాలిన విలుకాని దేటిప్రజ్ఞ?
ఒరులుచెప్పిన గుఱుతుల నొప్పులొలుకఁ
గొట్టు విలుకానిదగుఁగాదె గొప్పప్రజ్ఞ?

ఇతరదేశములం దిప్పుడిట్లెయంచు
స్వేచ్ఛమాతృభాష నటులె సలుపనగున?
అచటి నొకనిభార్య నొకనిహస్తమందు
నటులె యిచ్చైననోర్చునే హైందవంబు?

ఎదియో చెప్పఁదలంచి చెప్పితినీ యట్లేయంత కెట్లయ్యెడిన్?
బదిమందాడెడి మాట పాటియయి యొప్పారున్ నిజంబైన నె
క్క దొకండాడెడిమాట యంచనియెదన్। నానన్న న। గాదన్న
య్యది మీయిష్టము నాయదృష్టము పునీతాంధ్రమ్మ శ్రేష్ఠత్వమున్।

గ్రంథకర్త

# తుకారా

## ప్రథమాశ్వాసము

దిగ్గండుండగు కృష్ణరాయల సముద్దీప్త ప్రతాపాగ్నికిన్
గగ్గోలెత్తెను దిక్కరుల్; గజపతిక్ష్మావల్లభుం డొక్కఁడే
మ్రగ్గం డాసెగలో రిపుప్రళయపద్మవ్యూహముల్ పన్నకే
తగ్గం డీపరరాజభైరవుఁ డనిద్రస్పర్ధులై రిద్దఱున్. 1

విజయనగరాధిపతులకు గజపతులకు
నడచువైరంబు నిన్నమొన్నటిది గాదు;
మూడుతరములు తిరిగె నాపుసురుపట్టి;
యొక గయాళితుఫానైన దుండి యుండి. 2

తనవంగడమ్ము పెద్దలు నిల్పునైశ్వర్య కనక పీఠిక పాముగదలనీక,
పరరాజ్యములకు పెంపరలాడు పగలకు జిట్టెడునేల చేఁజిక్కనీక
క్రొవ్వాడిపిడిబాకు కొనతో నొసట దిద్దువీరకుంకుమరేఖ జాఱనీక
వప్పుఁ బువ్వుల జీవనారామములమీదఁ బారతంత్ర్యము గాలి బాఱనీక

కటకము ప్రధాననగరిగా గజపతీంద్రుఁ
డుత్కళమ్మని పేర్వడ్డ యోఢ్రదేశ
మేలుకొనుచుండెఁ దనదాక కెదురులేక
ఎక్కరాలేదు వాని ముం దెంతవాఁడు. 3

లొంగు ఘటంబుగాదు త్వరలో గజరాజతఁ డాపుమెండు ఆ
పొంగణగించికాని తనపూనిక మానఁడు రాయ లింతకున్
సింగపుఁబిల్ల తోడుజగజెట్టిదొరల్ గల రందు నిందు లత్
సంగరభీతిమై సగము సచ్చిన వెన్నొ సమీపరాజ్యముల్. 4

దేవగురూత్తమున్ పరువుదీసి బజారునఁబెట్టజాలు ప్రి
జ్ఞా విభవుండు మంత్రిమణి సాళువతిమ్మరు సొపులించినన్
జీవులలెక్కపెట్టి రిపువీరుల నెత్తురుతోడ కృష్ణరా
జ్యావరుఁ దొప్ప నుట్టినది మృత్యము పట్టిన దంతపైఁడిగా. 5

కమ్మనిరోజులెల్ల వెనుకంబడి వీర నృసింహరాజు మం
చమ్మునబట్టి; కృష్ణుఁడొక చాలని సోదర బిడ్డ; సర్వ రా
జ్యమ్మును కుమ్ము దుమ్ములున ధప్పుడు రాయలవారియింటికిన్
తిమ్మరుసయ్యతప్పే అసలు దీపము పెట్టిన దార్వ్రిచిత్తుఁడై. 6

రారాజులను నీరుద్రావించి ధర్మమ్ము గెలిపించు కొన్న శ్రీకృష్ణ లీల
కపటనందుల యాట గట్టించి రాజ నందముని రక్షించు చాణక్యదీక్ష
ఢిల్లీనవాబు గుండెలుదీసి ప్రభువును తిరిగితెచ్చిన యుగంధరుని యుక్తి
అరిచేతఁజడిన రాజ్యమ్ము గ్రమ్మఱ తేని యరచేత నిడిన తిక్కన పటిమ

ఒక్కచేమిటి తెలుఁగు నల్దిక్కులేలు
కృష్ణరాయని నభ్యుద్ధరించు శక్తి
అన్నియును గూడి తిమ్మరు సయ్యొ గాక
వట్టితిమ్మని కెచటి దా పాటి తెల్వి? 7

ఏదో మొక్కసు వాటి పైదొలఁగి పోయెన్ సింహారాణ్మౌళిః దా
యాదుల్ విప్పుల వానలన్ గురిసి నా రామంత్రి బంగారపుం
బాదుందీపి జలమ్ము పోసి యొక కల్పక్ష్మాజమున్ జేసెఁ ద
త్పాదచ్ఛాయల నాశ్రయించె నపు డాంధ్రిస్వర్గసర్వస్వమున్. 8

క్రిమతన్ దేహము వీడి పౌరుషము పొంగన్ పిల్లతుండేలు సిం
గముతోడన్ గసరత్తు సేసిన ఘురానాభూమిలోఁ బుట్టి వీ
రమహేంద్ర ప్రభ లారవోసికొను శ్రీరాయక్షమాజాని సా
ర్వ్యమునన్ నిల్పిరి వాడు దిగ్విజయ రంభల్ మోహ సంరంభలై. 9

తనగెల్పు బావుటా తళుకు రేయింబవళ్ళు దయాద్రిమీద సూర్యోదయమ్ము
తనకాహళా ప్రతిధ్వానమ్ము వినుకొండ శత్రుసంతానమ్ము చావుకబురు
తనఖడ్గధార రాల్చిన ముక్క పుప్పొడి కొండవీటికి పిడుగుం దుఫాను
తనయశ్వ ఖురశిరేపిన ధూళ్ళు దేవగిరి రాజు సేవించు పిటికిమందు
తన కనుల సంజకెంజాయ తగిలి తగుల
బడిన విందెన్నొ పరిసర పట్టణములు
కాని గజపతిమాత్రము కట్టు గొయ్య
కందకున్నాడు రాయల కదియ చింత. 10

ప్రజనుతపాలనన్ విజయరంభల కౌఁగిటఁబట్టి యాజిలో
నజితుఁడు కృష్ణరాయ లపుడా యను విక్రమ సుప్రతిష్ఠితం
బుజనముఁ బట్టుకొన్న గ్రహముం బలె నుండి కలంచునట్టి యా
గజపతిరాజు రాయ లతిగాఢపుగ వంపఁ దలంపు చుండఁగన్ 11

మొనపున దాసి దాకొని ప్రభూ! యెవరో చెలియోర్తు చిత్రికా
రిణియట చిత్రియంట తమరిన్ దరిసింప హజారమందు నుం
డిన దనిచెప్పుచుండఁగనె సేవ ననుజ్ఞనుగొన్న యట్లె చి
త్రిణి వెసఁజేరె సత్కళధురీణులు స్వేచ్ఛలు నిర్భయుల్ గదా! 12

చేరిన చిత్రికారిణి విశేషవిలాస వినూత్నమూర్తికిన్
బోయిన స్వాంతమందలి యనుజ్ఞ గ్రహించిన యట్లె సన్నిధిన్
జేరిన జ్ఞానచాతురికి నిర్మలనిశ్చలచిత్తశుద్ధికిన్
స్వైరవిహారధీరతకు క్ష్మారమణుం డరుదందుచుండఁగన్ 13

శరదిందు ప్రభలొల్కు మీప్రతిభ శశ్వచ్ఛ్రీకి జోహారు సుం
దరతన్ శోభిలు మీతెలుంగు సరదా దర్జాకు జోహారు స
చ్చరితార్థం బగు మీకళాదరణ భాస్వద్దీకి జోహారు మా
యురె! మీచల్లన పాలనంబునకు వేయున్నూర్లజోహార్లివే. 14

తెలుఁగున్ వెల్గులు దిగ్దిగంతములకున్ దీపించుచున్ దేశభా
షల నన్నింటను దెగ్గె లెస్సయని సంశ్లాఘించి కొంగ్రొత్త కై
తలకై చేతులఁ జాచుచున్ గవులఁ జేతఃప్రీతులన్ జేయు వి
ద్యల సంరక్షక! వీర రాట్తిలక! ఉద్యత్కృష్ణ భూపాలకా! 15

వింటిన్ దిక్కుల మారుమ్రోసెడి భవద్విఖ్యాతి నిక్వాణమున్
గంటిన్ స్వర్గము నోటుపుచ్చెడి భవత్కల్యాణ సంస్థానమున్
గొంటిన్ నెమ్మెయిఁ బుల్కరింపు లొలయన్ గొండంత హర్షంబు న
ప్పింటిన్ సంస్తవయోగ్యముల్ సుగుణరాశీ! మీచరిత్రాంశముల్. 16

వాఁడిమి గృష్ణరాయనృపభానుని బోలు నృపాలుఁ డెందునున్
లేఁ డనిపించు కీర్తి ధవళీకృత కౌముది గ్గై తెనుంగు పూ
వాడలు దాటి దిక్కు లెగఁబ్రాకిన మీ విల సచ్చరిత్ర వే
యేడులు తల్లక్రిందయి తపించిన మాటల కందివచ్చునే ? 17

అను చా చిత్రిణి పల్కు పల్కునకు నుద్యద్రత్న తాటంకముల్
గునిసాడన్ బ్రియ మాటు దానిపలుకుల్ క్రొందక్కులై పల్కు ప
ల్కునకున్ బుట్టెడు మెచ్చుకోళ్ళ హృదయాంతర్యాలకున్ బోలి య
ల్లన పేల్ గల్కితురాయి నెత్తిపయి నల్లాడన్ నృపుం డర్మిలిన్ 18

ఎట నున్నావు తెలుంగుఁ బల్కుజెలి ! యే యేకాంత కాంతార సం
కటపుం జీఁకటి లోయలందుఁ బడి నా కందోయిఁ దప్పింప క
క్కట ! యిన్నాళలనుండి నీవు ? నిను నేఁ గన్నార నల్లంతఁ జూ
చుటతో గల్గె నెవో గతాను జనితానేకాను రాగస్మృతుల్ 19

అయయో ! యేమిటి యట్లు నిల్వఁ బడి నా వా రత్నపీఠంబునన్
గయి సేయంగదె ! సత్కళా కరులనంగా నా కతిప్రీతి వా
రియెడన్ నాకొక యింతలేదు పురుష స్త్రీ భేద వంబు, నే
వ్యయమున్ జేతు ను పేర్చు వారికి దృణప్రాయంబుగా బ్రాణమున్ 20

ఏదేశంబున సత్కళల్ విరివిగా నింపొంది పెంపొందునో
యాదేశంబు విరించిదేవుని సుధా హస్తాబ్జ జీవంపు బొ
మ్మై దీర్ఘాయువు వోసికొంచు నెపుడష్టైశ్వర్య సంపత్తితో
మోదానన్ దులదూగు చుండును మరుత్ప్రాజ్య పత్రికా భాసమై 21

కళ లన జన్మతో సరులు గాంచిన దైవవరాలు వానిలో
పల నవి దుగ్ధ సమ్మిళిత వారిగ నుండు కళాక్షహీనులై
తెలియక దేవులాడెదరు దేవున కర్చనలీయ మోరకుల్;
కళలను గౌరవించుట జగత్ప్రభు గొల్చుట గాదె సోదరీ! 22

కళలన్ భాసిలు నాపరాత్పరుని సాక్షాత్కారమౌనే సుధీ
బలులౌ వారికె కాక యన్యులకు; గుప్తం బైన క్షీరంబులో
గల నీరమ్ము గ్రహింప హంసలకు శక్యంబయ్యెడిన్ గాని గ్ర
ద్దలకున్ క్షుద్రపుఁ గాక ఘూకముల కర్థంబౌనె యావంతయున్? 23

పరమ భగవదన్వేషణా భావనంబె
కళల ప్రస్తావన యగును గాదె? ఇసుక
పాత రయిన యీ జోలి త్రవ్వంగ నేల?
ప్రస్తుతాంశంబు గలదు కావలసినంత 24

కనులకు సొంపు వీనులకుఁ గమ్మని విందు దుఱంగలింప నీ
నునుజిగురాకు పాదములు నొచ్చగ నా పరిపాలనంబు పా
వన మొనరింప వచ్చిన శుభ ప్రదవార్తఁ గ్రమక్రమంబుగా
ననుము సహోదరీ! వినెద హాయిగ జన్మ తరించి పోవఁగన్ 25

అనఁ దమ కెంత కళారా
ధన? మెంత కళాళ? యెంత దాక్షిణ్యం? బి
ట్టి నిరతిశయ విద్యా పో
షణము కనంబడదు నేటి క్ష్మా స్థలి వెచటన్ 26

నరనాథా! మీమువంటి ఱేండ్ల కెడమై నాయయ్యా నాతమ్ముఁడున్
బరువంపు జిగి జానుతెన్గు కృతులన్ వర్షించు భాషా పయో
ధరు లాభీల దరిద్రి గహ్వరములన్ దైన్యమ్మునన్ మాసి పో
యిరి యాధారములేని పుష్పలత పెల్లెన్నాళ్ళు జీవించెడిన్? 27

అని తనవారి దైన్యమున కయ్యేడి నశ్రులఁ దైట కద్దు కొం
చు నటిటు చూచి రాణి! యని సూక్ష్మ కరధ్వని చేసినన్ హాహా!
యను చట నెక్కడున్నదియొ! యప్పటి దాకను; బాల యొర్తు వ
చ్చిన దపరించి పేటికను జేకొని మబ్బుల మించు పోలికన్ 28

ఎట నున్నావే నీవి
ప్పటి దను? కని పేటికఁగొని వచ్చిన బాలన్
దటుకునఁ గూర్చుండ వినిచి
పుటపుట పేటికను దెఱచి భూమీ పతితో 29

అనిశము విశ్వనాథుని కృపావరషుల్ నను నావరించి యుం
డ నెఱక లున్న యట్టుల హాటాహూటి నేటగు పెద్దపెద్ద ప
ట్టణముల కేగి యాయయి యెడన్ గల వింతలఁజూచి యందు న
చ్చిన రసచారు లన్నిటిని జిత్రపటంబుల కెత్తి తెచ్చితిన్ 30

లోకో భిన్నరుచియగున్
నాకౌశలము మిము నె ట్లానర్చిడినో యే
మో కద? విమర్శన కళా
రాకేందుబు తాము; తా మరయవలె దీనిన్ 31

రావణు నాజి, గూల్చి రఘు రాముఁడు జైత్ర రథంబులో జగ
త్పావని సీతతో నుడు పదాల నయోధ్యకు నేగుదెంచు చా
త్రోవల నౌ పురా ప్రకృతి రూప విలాస మరంద దృశ్యముల్
భావ పటంబునన్ మెదలఁ బల్కుచునున్న విచిత్ర ఘట్టముల్ 32

దృశ్య దృశ్యంబునకుఁ గుంచె యింద్ర ధనువు
నుండి వలయు వన్నెలతోడఁ దాండవింప
కాళిదాస మహాకవి కవిత ననుస
రించి రామ వాక్కులనె చిత్రించినాను 33

వెతలుపడి సత్కళా కరుల్ వెలువరించు
నంత నేమయ్యెడిని? వాని ననుభవించు
చూపరులకు శ్రోతలకు నో భూపతీంద్ర!
కావలయుఁగాదె కళ లాను కనులు చెవులు? 34

"ఘనతర కళేక్షణము గ
ల్గిన తా మిదె దీనిని, దిలకింపుడు భూపా!"
యని చిత్ర పటపు సంపుట
మును జిత్రి వసుంధరా విభున కందింపన్ 35

మనము విమానయానమున మౌక్తిక రాసులు ముగ్గుదీర్చు నీ
వననిధి తీరభూములకు వచ్చితి మట్లొకమా టొయారముల్
తొణికెడి చూపు త్రిప్పుము సుదూరముగాఁ గనుపించు నంబు ధీ
శుని యొడినుండి జారిపడు చున్నటు లీవన భూమి కాంతులున్ 36

ఆదిగో! సముద్రతీర మలయానిల వీచి మరందమూరు నీ
పెదవి కవుంగలింతలకు వేగి నగల్ ధరియించు నంతలో
నొదవెడి కాలయాపనము నోర్వని నాస్థితిఁ జూచినట్లు నీ
వదన మలంకరించెడి సువాసిని! కేతకి పైడి పుప్పొడిన్ 37

చల్లగ మెల్లగాఁ దుడువసాగిన వెండకుఁ గందు నీ సము
త్ఫుల్ల ముఖారవిందమునఁ బుట్టిన చెమ్మట గాంగ వీచితో
నుల్లస మాడి యింద్రగజ మూనిన కమ్మని దాన ధారతో
వెల్లువలెత్తు వాసనలు పేరిన మబ్బుల మీఁది గాడుపుల్ 38

ఓసి ప్రచండకోపిని! అదో కిటికీకడ వాప బడ్డ నీ
యా సుకుమార హస్తమున కంటిన నల్లని మబ్బు విచ్చి శో
భా సుమనోజ్ఞ మై మెఱపు వంపులు వార వినూత్న కంకణ
న్యాసము చేయు చున్నటు కనంబడుచున్నది నీకు లీలగా! 39

చెదిరిన చూపుతో దిగులు చిట్టెము గట్టిన గుండెతో నినున్
వెదకుచు నున్న నాకు కనిపించిన దో ప్రియురాల! యీడ నీ
పదమున నుండి జాఱి పడి బాధగ మౌనముగాఁ దపించు చు
న్నదొ! యనునట్లు నీ పయిడి యందియ నా బ్రతు కంతఁ గ్రుంగఁగాన్ 40

మును పమరారి నిన్ను గొనిపోయిన మార్గము లీలతా వికా
సిను లరవ్రాలులేఁ జిగురు చేతుల ముందుకు సాచి నాకుఁ జూ
పినవి; మనస్సులో బరువు వేదన మాటలఁదెల్పలేని రీ
తిని భయశాలివీ! యిట గతించిన ఘట్టము లెంత యార్ద్రముల్! 41

మేయుచు నున్న లేగటీక మేత లటే పడవేసి నన్ను నా
ప్యాయముగాఁ గనుంగొని మృగాంగన లిచ్చట తెప్పలెత్తి లో
లాయత లోచనాంచలము లల్లన దక్షిణ దిక్కు ద్రిప్పి నీ
పోయిన పోకడల్ తెలిపె పూర్వము నాకుఁ బ్రియా వియోగికిన్ 42

ఈగిరి మాల్యవంతము ప్రియేశ్వరి! యెత్తగు దీనినెత్తమం
దాగిన నీలనీరద మొకప్పుడు దీర్ఘ వియోగదుఃఖ బా
ధాగత బాష్పముల్ కురియు నట్టి ననున్ గని నిల్వనీరుగా
వాగులు వాగులే యభినవాంబు కణంబులు రాల్చె నావలెన్ 43

నెమ్మన మంత నీకొఱకె నీ నులివెచ్చని కౌఁగలింత కే
యమ్ముడువోయి నట్లయిన దప్పుడు వర్షజలాహతమ్ములౌ
కమ్మని పల్వలమ్ముల సుగంధము పూల యొయారముల్ మయూ
రమ్ముల యాటపాటలు చిరాకున కైనవి నీవు లేనిచో! 44

కొండ గుహల్ ప్రతిధ్వనుల గుబ్బటిలన్ బయనించు మేఘ ను
ద్దండ తరార్భటుల్ ననుఁ గదల్పఁగలే దొకనాఁటిరేయి నీ
గుండెల మీఁద వ్రాలి కనుఁగూర్కిన సౌఖ్యపు జ్ఞాపకాలతోఁ
గండెలువారు నామనసు కానక పోయె బహిఃప్రపంచమున్ 45

కనుపించీ కనుపించనట్లు పయిపైఁ గంపించు క్రొందామరల్
తనరన్ మంజుల మంజులోపవన సౌందర్యమ్ము ముద్దాడు చుం
డిన పంపానది వంకఁ జూడుమదే! తన్వీ దూరదూరాలు దా
టిన నాచూపు విషణ్ణమై యిచట నీటిన్ ద్రావునట్లున్నదే! 46

నీ చను గుబ్బలట్లు రమణీయములైన ప్రసూన గుచ్ఛముల్
పూచిన యీ యశోకలత మోహముమైఁ గవుగింటఁ జేర్చుకోఁ
జూచితి నీవు నా యెడఁద సోలిన యట్లయి నా విచిత్ర భా
వోచితిఁ గాంచి తమ్ముఁడు హతాశుని నన్ను మరల్చె వెన్కకున్ 47

అలసట వాలిపోయెడి యొయారపు సన్నని కౌను వంచి న
వ్వులు కురియించుచున్ బసిఁడి బుంగల నీరము వోసి నీవు వ
త్సలతఁ దలిర్పఁ బెంచిన రసాలము లున్ముఖ కృష్ణసారముల్
గల మన పూర్వ పంచవటిఁ గాంచు మిదే మది కింపు గూర్చెడిన్ 48

మన కను సన్నలన్ జను విమానపు సందులలోన వ్రాలు కాం
చన మణి కింకిణీ ఝణ ఝణం ఝణ మంజుల మాధురీధ్వనుల్
వినుచు సఖండ గౌతమిఁ జలించెడి హంసలు నేడు నిన్నెదు
ర్కొన నరుదెంచు నట్టు లవిగో! వినువీధికి లేచు ప్రేయసీ! 49

అని తన హృదయేశ్వరితో
నిన కులసోముఁ డనుచున్న మృదు మధురవచో
నినదములు రూపులద్దు కొ
నిన య ప్పుటపుటకు గుండె నీరగుచుండన్ 50

తడిసిన యట్టు లున్న కను దమ్ముల ప్రేవుల నద్దుకొంచు నే
వడువున నేర్చితో మృదుల వాక్కుల కల్లన బొమ్మకట్టి చూ
పెడి రచనా చమత్కృతి వివేకవతీ! యిటువంటి చిత్రముల్
పుడమి కమూల్య రత్నములు పుష్ప శరాసన మోహనాకృతుల్ 51

ఏమి దృశ్యంబు లేమి యాకృతు లహోహ !
నీవు చిత్ర కళా దేవతా వతంసి
వగుదు కాకున్న మర్త్య కన్యలకు నెట్లు
కలుగు నిట్టిస జీవత్కళా కౌశలంబు ? 52

అని ప్రశంసించుచు దదేక మనసుతోడ
జిత్రములఁ జూచు నాతేని చేత నున్న
సంపుటముఁ బుచ్చుకొని దాని సరిదిపెట్టి
వీనిఁ గొనుఁడంచు మఱికొన్ని వెలికిఁ దీసి 53

ఆరయుఁడు కృష్ణరాయ వసుధాధిప ! యియ్యది ఘూర్జరీ మనో
హారి; బురతా నడంగి స్వజనాళికిఁ గా కితరప్రజాళి కె
త్తఱిఁ గనరాదు దీని వ్రత తథ్య మనోజ్ఞము; నారికేళ పా
కరచన యల్ల ప్రాజ్ఞులకుఁ గాక మఱొక్కరి కంతుగానటుల్ 54

ఇది పదారు కళలఁ బొదలు చంద్రునియట్లు
నిండు జవ్వనమున నివ్వటిలెడి
పాండురాజ పుత్రి భానుమతీకన్య
గాయనీమణి రసికాగ్ర రమణి 55

ఇది కాశ్మీర మహీధపు
నిదుహిత రాధ; యమృతమును నెఱి గుబ్బలనే
పొదుపుకొని ధరకు ముదమున్
బొదవింపఁగ వచ్చిన నవమోహిని యధిపా ! 56

పడతులమిన్న యీ బిడె యవంతి ధరాపతి పుత్రి గొప్ప పే
ర్వడసిన నాట్యకర్త్రి యెలప్రాయపు టంపులు కుట్మలింపఁగా
నెడఁద నితంబముల్ బలసి యించుక యుండియులేని మధ్యమున్
బిడికిట కౌగ్గ జేసినవి పేదల కెప్పు డవస్థలే కదా ! 57

ఇది ప్రతాప రుద్ర గజ పతీంద్ర తనయ
శుద్ధ గుణవతి మిక్కిలి సొబగులాడి
కళల నలరారు రెండవ వలుకుఁ జేదె
నరవరా ! "తుకారా" వరనామధేయ 58

ఏమిటి ప్రభూ ! విశేషించి యీ పటంబు
నంతగా ననిమేషులై యరయుచుంటి
రో ! దమ యనిమేషేక్షణ కర్ధ మున్న
దీ యువిదఁ గానఁ గావలె వేయి కనులు 59

పద్మజుని నగిషీ పనితనం బంతయుఁ బ్రత్యవయవమునఁ బ్రబ్బఁజేసి
మెఱపు తీగలలోని మిసిమినిగ్గులప్రోవు దేహ వల్లరియందు చిమ్మరించి
కులపర్వతములలోఁ గూర్కొన్న బిగువును కులుకుగుబ్బలలోనఁ గుస్తరించి
నెరతుమ్మెదలవంటి నీలికుంతలముల గొన నితంబములకు గునియఁ జార్చి

బుగ్గలకు గులాబీ వన్నెపూఁత పెట్టి
తీయదొండ పండ్లెఱుపు వాతెఱకు నలఁది
యత్తుకారాకు మఱియే మహా మనోజ్ఞ
మీయదు ప్రభూ ! పదారేండ్ల యీడు వచ్చి ! 60

చెలఁగి ఝషాంకుఁ డెక్కిడిన చెల్వొల్ప నీలి ధనుస్సు బోలు న
వ్వెలఁదుక పిన్న కన్బొమల వెల్వడి సోకిన చూపుఁదూపు క
ట్టలఁతికె గింగరాల్ దిరిగి హా! యని యార్చుచు బిల్లబీటు కా
వలసినదే పరాశరుల వంటి జితేంద్రియులేనియుం బ్రభూ! 61

ముసురు లసన్నృపాళులకుఁ బూచిన సంపెఁగి యాముఁ గ్రొంజిగిన్
మిసమిస లాడు యౌవనము మేకొను మన్మథ మోహనాస్త్రమై
యసమ విలాస వైఖరుల నల్ల తిలోత్తమ రంభలన్ సుఘీ
షమత సుశీలతన్ గెలిచి స్వర్గము నాంధ్రికిఁ గ్రిందుచేసిడిన్ 62

కనుగొన లేదు తాము రసిక ప్రభు! యయ్యెడ! యేమిసెప్ప నేఁ
జని యెవరెవ్వరిన్ గనను? జవ్వను లేరిక లేవి యాఱ పం
డిన సరిక్రొత్త సౌరులఁ దటిల్లెడి నాకపకేంద్రు నందనన్
గవ సరియాడుదాన నగు నాకె జనించు నవేవో! కోరికల్ 63

ఏరాచ యెమెలమావి కెసఁగునో! యామాధవీలతాలింగన విభ్రమంబు
ఏన్నృపార్కుని చేతి కెసఁగునో! యక్కన్నె ప్రాగ్గిరి స్వర్ణ కుంభముల స్పర్శ
నేరాచిలుక నోటి కెసఁగునో యాయింతి పెందీపి వాతెఱ బింబఫలము
ఏరాచ తుమ్మెద కెసఁగునో! యాసౌరి పరువంపు సుమసుధా స్వాదనంబు

వానిదే జన్మ వానిదే పౌరుషంబు
వానిదే సిరి వానిదే వాసి యనుచు
నా నెలఁతఁ గన్న కవిసూరిమాన్యస్యములు
గుసగుసలు వోవుచుండు నో వసుమతీశ! 64

ఆశఫరాక్షి యాశుభద యాసుమ పేశలగాత్రి యాప్రసూ
నాశుగముఖ్య యాసుమధురాధర యాసుమనశ్చరిత్ర యా
దాశిత సూత్నరత్న తనవాల్గను తూపుల నేరసజ్ఞతూ
ఘీశుని సున్నితంపు మతిమెత్తని గుండెలలోనఁ గ్రుచ్చునో ! 65

"గ్రుచ్చునో !" యని చిత్ర వాక్రుచ్చినట్టి
పలుకులో నేమి వాఢిమి గలదొ కాని
హృదయమున గ్రుచ్చుకొన్నట్లు కృష్ణరాయ
లో ! యనుచు సొమ్మసిలి వ్రాలి పోయినాఁడు 66

తన యౌదార్యము గాంచవచ్చి యమితోత్సాహంపుఁ జిత్రప్రద
ర్శనమున్ జాటిన చిత్ర యే ఘన కనత్సన్మాన సత్కారముల్
గాసెనో ! యేమయి పోయెనో తెలియ కేలోకాననో మున్గి యు
న్న నృపాలుం డొయనొయ్య మేలు కొనియెన్ దాసీ ప్రబోధంబునన్ 67

గజపతిరాజరాజ్యరమఁ గైకొను కోరికకన్నఁ జెచ్చెఱన్
గజపతి రాజ గర్భరమఁ గైకొను కోర్కె బలీయమై హృదిన్
గజబిజిసేయ ముందువెనుకల్ గనకే యని దూక నుండె రా
యజన వరుండు భావజు సుమాస్త్రము లెంత ప్రకర్కశమ్ములో 68

ఆపాషాణములోని యుగ్ర నరసింహస్వామి వాల్గన్నులన్
గోపాగ్నిచ్చట పుట్టి భగ్గున రగుల్కొన్నట్లు విద్యాపురిన్
దీపమ్ముల్ మిడియెండగాయు నొకరాత్రిన్ గృష్ణరాయండు తీ
ల్గా పీఠమ్మునఁ గూరుచుండె నెలతాలన్ దీరుసౌధమ్ముపై 69

జిలిబిలి గాలికిం గదలు చిక్కని చక్కని కోరమీసముల్
తెలుఁగుఁదనమ్ము తీవి సరిదిద్దు కొనెన్ చెలి కప్పురమ్ముతో
గలిగిన తమ్ములంపు జిగి క్రమ్మిన కమ్మని మోవి యంచునన్
బలుచని నవ్వువెన్నెలలు పండెఁ గళానిధి రాయ లద్దిరా! 70

రాయలకుఁ జేరువఁ జిరత్న రత్నరంజి
తాసనమున మహామంత్రి యధి వసించె
నున్నతాలోచనా రేఖ లొరసి యొరసి
నెన్నుదుట బ్రహ్మ వర్చస్సు నిండిపోవ 71

ఇది యొక కొండ బోటు నృపతీ! పరువెత్తుచుఁ బాలుఁద్రావఁ జూ
చెద వపుఁగాని యిందుఁగల చిక్కులు లెక్కలువేసి కూడు కా
మ్మెదిరి బలమ్ము ముందు మన మెంతకుఁ మాఁగుదు మన్న ప్రశ్నకున్
బదులు లభింపకే బయలు ప్రాకుట చేతుల నొప్పికే సుమీ! 72

గజపతి రాజుతో మనము కయ్యము సేసెడు మాట కప్పుడే
గుజగుజ బైలుదేరి ప్రతికూలురకుం గబురందియుండు నీ
విజయ కథా పరంపరలు వీనులుదాఁకి యసూయఁజెందు భూ
భుజులను గూడఁగట్టుకొని పొంచెడినో కటకేంద్రుఁ డింతకున్ 73

ఆదుర్యోధను తోడు దొంగలు కుమారా! పల్వురున్నారు వా
రేదో గూడు పుఠాణి సేయకయ పోరీయెత్తునన్ యుద్ధమున్
సాదాగాఁ గడతేర నీ రెపు దదృష్టమ్మొక్క నీచేతిపై
కే చూకెత్తదు సుమ్మొకప్పుడు తలాయించున్ బరాధీనమై 74

మొయెలు బయళ్ళలోని మెఱపుంటలె వట్టి ఖిలాడి దన్న యీ
జయరమ; లేవు వావివరుసల్ తన కెవ్వరి ప్రక్కఁ జేరునో
పయనము ఒక్క చొక్క నెల పైచిలు కోపిక పట్టియుండు నే
మయనభ పన్ని యా దురభి మానుల బొమ్మలక్రిందఁ ద్రిప్పెదన్ 75

పెడసరపు కట్టెలై మోపు వడిన రిపుల
ఓలఁదీయక చేయి చేసి కొనరాదు;
దండ నీతియు విజయ సాధనమె కాని
యన్ని వేళలు మనవి గా వాంధ్ర భోజ । 76

నీది సుదర్శనాయుధము నీతెగ పండిన వీరకీర్తికిన్
గాదెలు గంపలైనవి దిగంతము లన్నియు గుర్తులేక పో
లే దది నాకు వైరులు త్రిలింగులకున్ సరిరారు గాని నే
డేదో । మనస్సులోన నలు కేర్పడె కృష్ణ ధరాతలేశ్వరా । 77

ఏ బె ట్టెక్కడ నొక్కెనన్ దిరుగునో । యీ శత్రు రాజ్యాంగ మా
ప్రాబల్య మ్మెటువంటిదో । తెలిసి కర్తవ్యమ్ము నూహింత ము
క్వే బింబాధరి నిన్నుఁగాక యెవనిం బ్రేషించు నెంపాదిగా
సూదిన్ దింపి వధింపు మిగ్గజవరేణ్యున్ రాజ కంఠీరవా । 78

అని గజపతితోఁ గాఁగల
రణమునకగు కష్ట నిష్ఠురమ్ములు విజ్ఞా
పన సేయుచున్న సచి వా
గ్రణితో శ్రీకృష్ణ దేవరాయలు పలికెన్ 79

ధీరగ్రామణి వయ్య తిమ్మరుసు మంత్రీ! యెంతలోఁ దీసినా
"వారా" సాళువడేగ వింటికు త్వదీయప్రజ్ఞ చిక్కానిగా
నారాజ్యమ్మను నౌకకున్ గుపరకున్నన్ శాస్త్ర వాంభోధి హుం
కారంబుల్ విని దారి దప్పుదునో! నాకై జారు కైజారునో! 80

మనసైన్యము సాపరు ఖ
ర్చునకై నం జాలి రాదుసుమి! యుత్కళ ధా
రుణి మీఁద వచ్చు "నాదా"
మనసు పడితి నొక గజేంద్రు మదమున్ దులుపన్ 81

ఎప్పుడు సాగఁద్రోలితివో! యీ నరసింహుని కోడెదూడ నీ
చెప్పిన మాటకున్ దిరుగు సేయనులేదు పెడంకె వేయలే
దిప్పటి కేడదో మసలి యెద్దయి రై బుసకొట్టుచుండె లే
విప్పము కట్టుతాళ్ళిదు! నిలఁబెట్టుట కొప్పదు తప్ప దాలసున్ 82

ఎపుడో భాగవతమ్ము చెప్పె సనె మౌనీంద్రుండు వ్యాసుండు నే
రుపుతోఁ నాతని కృష్ణభక్తిని గజేంద్రుండందు కొన్నాడు నాఁ
డిపు డీ వింత గజమ్ము కృష్ణుఁ డనుపే రెత్తన్ మదగ్రస్తమై
యపమార్గమ్ములు త్రొక్కు దీని తలలో నా భక్తిఁ జొప్పించెదన్ 83

వాఁడొక పిండ్దెయ్యమై పేటికి పందల నల్వురఁ జేర్చి బొమ్మ లా
టాడుచు నున్నవాఁడు పయి కందరు జోదులె తోతుపాతులన్
జూడవలెన్ జూమీ! అయిన జోగియు జోగియు రాసుకొన్నచో
బూడిద రాలు; వారి మొకమ్ముల్; మనఘాటికిఁ దట్టుకొందుమే? 84

కేవల మొక్క యీగొడుగుక్రిందికి రావలె వేఱు పద్దచోఁ
జావవలెన్ గజేంద్రుఁడో ! గజా సురుఁడో ! అతఁడాంధ్ర ఖడ్గపుం
జేవలు సచ్చెనే భయము సెప్పెను నీ ప్రతిభా మహార్ణవ
మ్మావిరియైన నాఁటికిఁ గదా దిగు లీనవరత్నహారికిన్ ! 85

ఓ డొక ప్రక్కఁ బెట్టుకొని యోడ బలే ! సొగసైన దండువా,
యా డవుడే గణయ్య సచివాగ్రణి ! యుత్కళరాజు కాలు చే
యాడక "హా జితోస్మి" యని యానత మస్తకుఁడైననాఁడు స
మూర్ధ్ని డభిషేక మిమ్మనము ! రాయలకుం ప్రమదాశ్రు ధారలన్ 86

సమరభక్త్యా నిక్వణమునఁ దెల్గుంగత్తి వదల కుండదు గదా నిదురసొక్కు
ఆంధ్రరాడ్దంతి ఘంటా స్ఫాలనమునఁ గ్రక్కదల కుండదు గదా కటకనగరి
సమరశాత్రవశిరశ్చట పిండిఁపడ బంతి తిరుగకుండదు గదా తెలుఁగుదండు
వీర త్రిలింగ దోస్సార సారస్వంబు తెలియ కుండదు గదా గెలుపుసాని

ఏల ముసుగుమ్మ ? సేనఁ బోనిమ్మ పగఱ
దాఁకి మఱి తేల్చుకొని వత్తుఁ దాడో పేడో !
తాఁటి యాకు చప్పుళ్ళకుఁ దలలు వంచు
పిఱికి కుందేళ్ళ మనసేలఁ బెరుగలేదు 87

స్కంధావార మమాంత ముత్కళము వంకం ద్రిప్పి సంగ్రామపుం
గ్రంథంబుల్ నడిపింతు నంత కది భారమ్మైనచో మీ భుజ
స్కంధం బున్నది నాకు మీ రిచట రాజ్యప్రక్రియల్ చూచుచున్
సంధింపుం డొక చూపు నాదెసను సాక్షాద్రక్ష నాకయ్యెడిన్ 88

అనుచుఁ గోపశిఖీ శిఖా రుణిత నేత్రాంభోజుఁ డై రాజు ప
ల్కినపట్ల య్యోడి వజ్రపుంబలుకు పొల్కిం దోచి తద్భిన్న వా
దన మింకం బని సేయ దన్న తలపోఁతఁ మంత్రి దీవించె రా
యని సంకల్పిత సాంపరాయని జయోస్తంచుఁ ధృతోత్సాహుఁ డై 89

అవనిపు శౌర్యదీక్ష దృఢ మై ప్రభుభక్తి ప్రధానలక్ష్య మై
చివరకు మాటమాట కలసెన్ గెలిచెన్ సమ రైకనిర్ణయ
మ్మవమతి నందు నింకఁ గటకాధిపుఁ డిట్లను కీతి నీరస
చ్ఛవిని నభస్సునుండి దిగఁజారె నొకానొక యుల్క చప్పునన్ 90

"రే పీపాటికి నాంధ్ర సైన్యము రణోద్రేకమ్ము మై నొక్క యూ
పూపున్ మంత్రి మహేంద్ర! తత్కటక రాజ్యోపాంత దేశమ్ములన్
నో పంతమ్మునకున్ క్షమింపుఁ" డని యాంధ్రస్వామి శయ్యాస్థలిన్
బ్రాపించెన్; సచివేశుఁడున్ సెలవుగొన్నా డంత విశ్రాంతికై 91

కమ్మని చందమామ బిగి కౌఁగిలిలోనఁ గరంగ రేయి ప్రా
యమ్ము సగానఁ బడ్డది సుధాసవ వాహిక లైన వెన్నెలల్
గొమ్మసిలెన్ వయస్సు చెయిసోకిఁ గుముద్వతి నవ్వె పద్మ పై
న్యమ్మన; కౌళ్ళు పై తెలియునా? పయి పై వల పున్నవారికిన్? 92

రెప్పల మీఁదికిన్ నిదుర రేకలు రాకలు సేయు నంతలో
నుప్పెనవోలె లేచి మది నుజ్జటరేపు రణప్రసక్తితో
విన్పులు రేఁగ మూఁత పడనేపడ నా కను లంత గెల్పెటుల్
దప్ప దటన్న చల్లని తలంపులు జోలలు పాడు వేనికిన్ 93

నెలపొడిచినట్లు మనసున
జిలిబిలిగా గెలుపుఁదలఁపు సెలరేఁగి యదే
కలగాఁ గలగా పులగపు
కలఁత లెడసి తెల్లఁగుర్రాళ్లు కన్నుమొగిడ్చెన్ 94

తలఁపి వెన్నెల భూమికి ధారవోసి
మనసు చల్లని చంద్రభామ చనిపోయె
మంచు చినుకులు మాత్రము మాటిమాటి
కతని బ్రతుకున కానవా కైనవపుడు 95

కాలపురుషుని రొమ్మున వ్రాలి సోలి
తూలిపడు రేయిజవరాలి నీలినీలి
వాలు జడనుండి చిఱుమల్లె పూలువోలె
జాలి కిరవౌచు చుక్కలు రాలిపోయె ! 96

ఆఱన లేని లేఁగలువ లందపు గోల్పడి వాడివత్తలై
వ్రాలెను సాంధ్యరాగములు పండిన పూర్వదిశాముఖమ్ము తాం
బాల రసమ్ముతోఁ దడసిపోయిన తీయని కన్నెమోవికిన్
బోలికయైన దిం కెవని ఘుంచునొ ! య్యాపయిపై సరాగముల్ ! 97

# తుకారా

## ద్వితీయాశ్వాసము

పూరింపంబడె యుద్ధ శంఖము నభోభూకంప మై యాంధ్ర రా
ద్వీరవ్యూహ విశృంఖల ప్రళయకేళీ నృత్యవేళా పదత్
ఘోరారావ కఠోరతా ఘటితదిక్ కుంభీంద్ర కర్ణజ్వర
స్ఫారత్కార తరస్వర ప్రకర మై సుప్తప్రజోత్తేజ మై 1

అని కుర్వాడించుచున్నటుల గాలిక వరాహపతాక రెపరెపలాడుచుండ
గజతురంగముల ఘీంకార హేషారవంబులకు దిక్కులు మాఱుమ్రోయుచుండ
చతురంగ బలముల చరణ ఘట్టనలకు పృథ్వీస్థలము దద్దరిలుచు నుండ
బలముల పదఘట్టనలకు రేఁగు రజమ్ము రవిబింబమును మాపఁ గప్పుచుండ

ఒక్కొక సమరయోధుఁ డొక్కొక్క క్రొత్త
పెండ్లికొడుకట్టులఁ బరిఢవిల్లుచుండఁ
గృష్ణరాయలు గజపతి క్షితిపుపైకి
దండు గదలించె భండనోద్దండుఁ డగుచు 3

కాల్బలము కొల్బలములవెన్క హయ గజ ర
థాది బలములు పడీవడి నరుగుచుండ
నలలగుంపున గలగల నార్చుకొనుచుఁ
గదలిఁ గవజేరు నదులట్లు గానుపించె 4

అనుకొన సేన వాహినుల కర్దమొకం డగుపెట్టు? లెట్టు లో
ప్పును? వరుసన్ గ్రమంబువడి బోరనఁబోరన కేఁగుసేన లె
ప్పనధికి స్రోతలన్ జనెడి వాహినులట్లు రహించుచుండు వా
హిను లన సేనలొట కిదియే మహితార్థము సార్థకంబగున్ 5

కృష్ణరాయలు తన మీఁది కెత్తివచ్చు
ప్రథనవార్త లప్పుడె గజపతికిఁ జేరె;
అతి రహస్యమే బట్టబై లగుచు నుండ
నాజి విషయంబు బట్టబై లగుట యరుదె? 6

తన సామంతుల కీ హఠాత్ సమర వృత్తాంతంబు నద్దానిఁదత్
క్షణ కర్తవ్య విశేషముల్ గజపతిక్ష్మాజాని వేర్వేరుగా
ననుశాసించిన నా పదార్గురును రోషావేశులై తెప్ప నా
ర్పని కంటన్ గనుచుండి రప్పగల జీల్చన్ యుద్ధ సన్నద్ధులై 7

ధ్వాంతము తోడ రాత్రి ధరపైఁ బడవచ్చెడునట్లు కృష్ణ భూ
కాంతుఁడు దండుతోడ దమ క్ష్మాపతిపైఁ బడ వచ్చుచుంట న
ల్లంతనఁ జూచి షోడశ కళాన్విత చంద్రుని య ట్లెసంగి సా
మంతులు వేగ నాఱుఁ బదిమందియు నొక్కటిగా రహించుచున్ 8

వచ్చెడి కృష్ణ రాయ రణ వాహినులన్ గిరు లడ్డుకొన్న య
ట్లచ్చట నుండి యొక్క యడుగైనను ముందుకు వేయనీక వేల్
లచ్చల కెక్కు సంగరబలంబులతో నెదిరింప దూదికిన్
జిచ్చిడి నట్టులయ్యె నిరుసేనలవారికిఁ గయ్య మొయ్యనన్ 9

ఇరు పక్షంబులవారు పౌరుషములఁ జృంభించి యన్యోన్య సం
హరణా కాంక్షలఁ బోరుచుండ నతి రౌద్రావేశముల్ పూని సా
గరముల్ సాగరముల్ గిరుల్ గిరులు కక్షంబోరు చున్నట్లు సం
గర రంగస్థలి గాంచ గుండె లవియఁ గన్పట్టె నుగ్రాకృతిఁ 10

గుఱ్ఱపువీపులం బరవి కో ! యని యార్చెడి కత్తివ్రేట్లకున్
బుఱ్ఱలు పుట్టలే యెగిరిపోవుచు నున్నవి తుండె మొండిమల్
వఱ్ఱలు వఱ్ఱలౌచు ధర పైఁ బడుచున్నవి వీరఘోషతో
వెఱ్ఱి సముద్రమైనది మహీతల మంతయుఁ బాఱు నెత్తుటన్ 11

ఘనఘనంబు లిల కౌగ్గినటులున్నవి వల్లదురపు టవని రేఁగు దుమ్ముగుములు
మెఱపులు మెఱసిన కరణి నున్న వసుల రాపిళ్ళ కగు నిప్పు రవల బేర్లు
ఉరుములునురిమి న ట్లున్నవి కత్తులఁ గత్తులు ఢీకొను-ఘర్షణములు
అరుణంపు జడివాన కురియు చున్నట్లుండె రణవీరుల కవోష్ణరక్తవృష్టి

అపర దేవదానవుల ఘోరాహవంబొ !
రామరావణుల భయంకరాహవంబొ !
ప్రబల భయద కురుక్షేత్ర భండనంబొ !
తల్లిఁ పరాకుష్ణ దా ష్ట్రివిదారణంబు 12

ఎఱుఁగ నెఱుఁగ వీరస్వర్గ మెంత దూరకు
ద్వారములవొ ! యూరుపు లూడ్చిఁ బఱులు చీలి
తలలు దెగిపోవ నిజనిజఁ తనువు కొనుచు
మాపిరులు వీడ్చుచున్నారు యోధవరులు 13

"ఇది యొక కొండబోటు నృపతీ! పరువెత్తుచుఁబాలు ద్రావఁ జూ
పెద వప్పుఁగాని యిందుఁ గల చిక్కులు లెక్కలువేసి కూడు కొ
మ్మదిరి బలంబుముందు మన మెంతకుఁదూగుదు మన్నప్రశ్నకున్
బదులు లభింపకే బయలుప్రాకుట చేతులనొప్పికే సుమీ! 14

గజపతిరాజుతో మనము కయ్యముచేసెడిమాట కవ్వడే
గుజగుజ బైలుదేరి ప్రతికూలురకున్ గబు రందియుండు నీ
విజయ కథాపరంపరలు వీనులఁదాఁకి యసూయఁజెందు భూ
భుజులను గూడఁగట్టుకొని పొంచెడినో! కటకేంద్రుఁ డింతకున్. 15

ఆదుర్యోధను తోడుదొంగలు కుమారా; పల్వురున్నారు వా
రేదో గూడుపుఠాణి సేయకయె పో రీయెత్తునన్ యుద్ధమున్
సాదాగాఁ గడతేరనీ రెపు డదృష్ట మ్మొక్క నీచేతిపై
కే మాకెత్తదు సు మ్మొకప్పుడు తలాయింపన్ పరాధీనమై! 16

మొయిలు బయళ్ళలోని మెఱపుంబలె వట్టిఖిలాడి దన్న యీ
జయరమ లేవు వావివరసల్ తన కెవ్వరిప్రక్కఁ జేరునో
వయనము చిక్కఁ దొక్క నెలపై చిలు కోపిక పట్టియుండు నే
మయసభపన్ని యాదురభిమానుల బొమ్మలకింద్రఁ ద్రిప్పెదన్. 17

పెడసరపుకట్టెలై మోపువడిన రిపుల
పీలఁదీయక చేయి చేసికొనరాదు;
దండనీతియు విజయసాధనమె కాని
యన్నివేళలు మనవి కా వాంధ్రభోజ" 18

అనుచు నేఁ బోరునకు వచ్చు నపుడు తెలియ
నీవు పల్కినచెవి వట్టిపోవలేదు
ఋక్కలేనయ్య నీ వాడువాక్కు లెల్ల;
నహహా! యెంత చక్కనిజోస్య మయ్య నీది? 19

చనవల దన్న నీ యనుఁగు సమ్మతమున్ వినుపించుకోక నే
నని కరుదెంచి నందులకు నన్నివిధంబుల దానిదుష్ఫలం
బు ననుభవించుచుంటి నిటఁ బూజ్యుఁడ! పెద్దలమాట చద్దియూ
టని బుధులాడుమాట యకటా! వికటంబుగఁ బోవు నెట్లగున్? 20

వెత లిటు గ్రమ్మ నాపడెడి వేగిరపాటున కాగ్రహించుటల్
గతజలసేతుబంధనముగా గ్రహియించి క్షమించి వచ్చి యీ
ధృతిసెడియున్న కృష్ణుఁ గని యెల్లబలంబులకన్న నొక్క స
మ్మతిబల మెక్కు డన్న మహిమామృతమున్ బ్రకటించుకొ మ్మిటన్.

ఏమో యంచుఁ దలంచి వచ్చితినిగాని యిట్టు లౌనంచు నే
నేమాత్రంబు నెఱుంగనైతి నని నేమీ వీనియొక్కొక్క యీ
సామంతుండు మహేశుఁడై యొకొకరాజ్యం బేలుపో! యీ మహా
సామంతుల్ పదునార్వు రుండిరి జిగీషావేశ సంరంభులై. 22

నేలే యీనుచున్నదో! యనికి నేనే నేను నేనంచు ము
న్నాలానన్ మృతులైన యెల్లరును రౌద్రావేశముల్ పూని యా
ఖీలారావములన్ బొనర్చుకొనుచున్ విచ్చేయుచున్నారొ యన్
శీలన్ గోట్లకు నుండి రీయరు లెటుల్ వీలౌను దూటాడఁగన్; 23

పెదతల్లి తిప్పాంబ పేరీసున నను విషాన్నమ్ముతో జంపనున్నాఁడు
వ్యాధిఁబడ్డ నరసింహవిభుఁడు నాకనుగుఁబిడ్డ నారసి చావగోరునాఁడు
పరులకు నాయున్కి ప్రాణగొడ్డంబైన ననుగంటనిడుకొంచు మనుపునాఁడు
వరుసగా నొక్కొక్క పొరుగురాజులగెల్చి గెలుపుజెండా లెత్తి కెలయునాఁడు

నొలికిన దయాభిమానంబు లొక్కయెత్తు
నొలక నుండిన విప్పటి వొక్కయెత్తు;
ఆలసింతువా యిఁకఁ జెప్పు టేల వేతె?
యీనఁగాచి నక్కల కిచ్చుటొను గాదె?" 24

అని తనను దనన్నృపుఁడు ర
మ్మని తొందరపెట్టుచున్నయట్టుల నిదురన్
గనుచో "కృష్ణా! కృష్ణా!"
యని డిగ్గున లేచి దెసల నారసి భీతిన్.

అది కలయంచు గ్రహించియుఁ
గదనమ్మున నుండి వచ్చు కాని కబురులే
నిదురన నా కిట్లైనవి
తుది నేఁబోయి యట నేమి తూటాడఁగలన్ 25

ధీరోదాత్తుడు కృష్ణభూరమణుఁడే దీనస్థితిన్ నైజ గం
భీరోద్ధృత్తిని వీఁడఁబోఁడు పగతుల్ వేల్ లక్ష లొక్కుమ్మడిన్
హోరాహోరిగఁ బోర మారుకొనినన్ హుమ్మంచుఁ బోరాడుఁగా
నీ రానొల్లడు వెన్నుసూపి; యెపుడిట్లేయైన నింకేమగున్? 26

వల దన్నన్ క్షణియించి యుద్ధమునకే వాంఛించి ఖడ్గంబు బ
ట్టి లడాయిన్ దలఁదూర్చె నబ్బలుల నోడింపన్ దరంబా? కటా!
బలవంతం బగు భీకరోరగమె కావచ్చున్ బ్రతాపించి య
చ్చలిచీమల్ గుములౌచు మార్కొనిన నేచక్కిన్ దటాయించెడిన్. 27

అని శ్రీకృష్ణ ధరాధవుండు తన సాహ్వానించుచున్నట్లు రే
పిన స్వప్నంబు దలంచి తిమ్మరుసు భావిన్ భావికర్తవ్యమున్
దనలోఁదాను పదేపదే యిటునటుల్ తర్కించి తర్కించి తో
చిన వ్యూహంబు మనస్సునూపఁ దొడఁగన్ శీఘ్రంబు తా నిట్టులన్ 28

"ఓ సామంత నృపాలులార! మిము మీ యుర్వీధవుం డెంతగా
గాసింబెట్టెడివాఁడొ! మా రణపు ఢంకామ్రోతకే లొంగి మా
కా సమ్రాట్టును బట్టియిచ్చుటకు మీకై మీరు బాసాడఁ గం
టే సొంతమ్ముగ నర్థమయ్యె సుమనష్టికాప్రబంధంబటుల్ 29

తుంతుర్వంబుగఁగాక యేక ఝరి మాతో మీ పదార్కంది సా
మంతుల్ చేరి పరిగాఢ సఖ్యమున సంబంధించుచుండంగ న
శ్రాంతంబున్ బరిపూర్ణ షోడశ కళాచంద్రుండె మా యాంధ్రికిన్
గాంతింజిమ్ముచు నున్నయట్టు లడరెన్ ధ్వాంతంబ లేకుండఁగన్. 30

అచలస్వాంతుల రై యయాచితముగా నైక్యంబు వాంఛించి మా
కుచితఖ్యాతిని మీ పదార్గుతౌకలై యుద్యజ్జయశ్రీనిఁ గూ
ర్చుచు గర్వోగ్రవిరోధిరాడ్గజపతిక్షోణీధవుం బట్టి యి
ప్పుచు నున్నందులకండలై యెపుడు పొల్చున్ మీకు మా బాహువుల్? 31

అనుకొన్నట్లు చరింపకుండుటకు జిహ్వల్ మీకు రెండేసి యుం
డెనె వ్యాళాలకుఁబోలె ? నైన మఱి యేఁడీ ! పట్టి యీ రేమి ? యా !
సనఘక్ష్మాపతితోడ సైనపని యౌనా యింత శీఘ్రమ్ములో !
ఘనకార్యంబులకే కదా యెపుడు విఘ్నంబుల్ తటస్థించెడిన్ ? 32

జాగేయయ్యెడు నైన నేమి యిఁక మీ సఖ్యంబు సాగన్ బయా
నాగా నీ కనకంబరాల మణులన్ బంపించు చున్నాము మీ
వాగర్థంబులు మాకు చొప్పడిన పై మీ పదార్మందికిన్
జాగీర్లిత్తుము సుప్రసిద్ధముగ సన్మానింతు మొక్కుమ్మడిన్ 33

అతఁడొకండు మీరు పదునార్గుఱు మీపదియార్గు రేకమై
చేతులు చేతులుఁ గలపి చేయఁదలంచినఁ గాని దేది ? యీ
రాతిరికే ముగించి రుచిరస్థిరవాగ్ధరణీశు లన్న వి
ఖ్యాతినిఁ గొండు క్ష్మాస్థలిని ఖ్యాతికె సజ్జన జన్మసంగతుల్ ! 34

అని పేర్వేరుగ గజపతి
జనవిభుని పదాఱుమంది సామంతుల క
ల్లన లిఖియించి లిఖిం
చిన లేఖలతోడఁ గనక చేలములు మణుల్ 35

పదియాఱు పేటికలలోఁ
బదిల పఱచి యయ్యవి గజపతి రాడ్భటులే
చెదరక పట్టుకొను పగిది
పదియార్గుఱు భటులచేతఁ బంపించెఁ దుర్తిటిఁ 36

ఆమందసపు బదార్గు అ
సామాన్యులగుట కతన గజపతీశ భట
స్తోమములకె పట్టు వడిరి
సామంతులఁ జేరఁ జనకె మసుచున్నయటుల్ 37

పట్టువడిన వారినిఁ బడి
నట్టులె రాడ్పటులు పెట్టియలతోఁ దమ ప
మాత్రిట్టుని యెదుటను నిలువం
బెట్టిన నప్పట్టపుదొర బెట్టిదవుఁ ద్వరన్ 38

పెట్టెల బీగములఁ బగుల
గొట్టించి తెఱచి విలువగు గొప్ప మణుల హారం
బుట్టముల నారసి తనను
బట్టించెడు లేఖలఁ గవి భయకంపితుఁడై 39

ననుఁ బట్టించుట కిన్నియిన్ని మణులా? నా చావు కిన్నిన్ని ప
చ్చని హారంబుట్టములా? యొకప్పుడును నాస్వప్నంబులోనైన నే మ
న్ననుకోనైతిని నేఁటి నా బ్రతుకు మూల్యం బింత దౌనంచు బే
లనె? చిక్కింతునె వారి కింతటి యమూల్యంబైన ప్రాణమ్ములన్ 40

నా సామంతులె నా విరోధులకు నన్ బట్టించుటా! యక్కటా!
యీ సంసృష్టి జగమ్ము నల్గడల మున్నెందైనఁ గన్పించెనే?
త్మసర్వస్వము మోసకారి యగునే? సాక్షాత్తుగా నీశ్వరుం
డే సంకల్ప మొనర్చి నట్టులుగ నయ్యెన్ నే భరాయింతునా? 41

పరరాజన్యులు కృష్ణభూవరులు నాపై రేఁచి నా రాజ్యముం
హరియింపన్ దొరకొంట యద్ది సబబే నా తెక్కలం బ్రక్కలం
జిరకాలంబుననుండి నా యనుమతిన్ జీవించు సామంతు లి
క్కరణిన్ జీలిరి వీడనన్; సకలమున్ గన్నీరుగా దోఁచెడిన్ 42

స్వాంతము విచ్చి సొంత నెర నంతుగ నా పదియాఱుమంది సా
మంతులఁ బెంతుఁగాని దయమాలిన మానిసిదిండులంచుఁ బ్రా
ణాంతకు లంచు దుగ్ధముల నాని స్తనంబుల గ్రుద్దు ధూర్తులం
చెంత కెఱుంగనైతి నిపు డిట్లగుదాక నమాయకుండనై 43

అకటా వానిని ఆపికంబు వని యావంతేని గుర్తింపఁ జా
లక ప్రీతిన్ దన గ్రుడ్లుగాఁ బొదుగుఁ బిల్లల్ జేయుఁ బోషించి పెం
చుకొనున్ వాయస; మవ్వి నిక్కి పెరవై చూపట్టె నిస్సీ! యమా
యకులౌ వారి పరిశ్రమంబు ఫల శూన్యంబై నదే యౌఁ గదా! 44

కలవారున్ బర్వులైనవారు నొకపై ఖడ్గంబులన్ దూసి నన్
బొలియింపన్ బడివచ్చుచుంటఁ గనుచున్ మూర్ఖంబుగాఁ జిక్కి కొం
దలపుంజావున కొగ్గు చెందులకు? మేనం బ్రాణమే యుండినన్
బలుసాకైన భుజించుచున్ బ్రతుకఁగా వచ్చున్ వనీసీమలన్! 45

అని తాఁ గానలకుం బలాయనము గానైయున్న భీరుత్వమం
తన వృత్తాంతము నంతరాత్మ యణుమాత్రం బొప్పుకో కుండి యో
జననాథా! వలదన్న యట్లయినఁ బజ్జన్ నిల్చి యెవ్వారలో
తనపై రెత్తి హసించుచున్న యటు లత్యంతాగ్రహోదగ్రుఁడై 46

నేనే పోవుచు నుంటినా వనులకున్ నేఁడీగతిన్ ! కాదు కా
దేనేకా దనివార్య దుష్ట విధిచే నేదో మిషన్ సర్వులున్
లో నైపోవక తప్ప దెప్పటికి మున్ లోకప్రసిద్ధుల్ ధరి
త్రీ నాథాఢ్యులు రామలక్ష్మణులు కౌంతేయుల్ వనుల్ పట్టరే ? 47

అని కటక ధారుణీ ధవుఁ
డని కరుగు జతనము మాని యాక్షణమున నే
యుని కన్య లెఱుఁగ కుండఁగ
వని కరిగెడు నిశ్చయమునఁ ద్వరపడుచుండన్ 48

రార మ్మో కటకావనీ రమణ ! రా ! రా ! నా యెడందన్ నిరా
కారా వ్యాఖ్యగ నెన్నియె న్నసురకాంక్షల్ జారచోరత్వముల్
ఘోరాముల్ గిరి గహ్వరాలు లయమైపోలేదు ? నిన్ దాచుకో
ఖారం బెంతది నాకు ? పెంభరమెకో వార్బిందు వంభోధికిన్ ? 49

సృష్టికి నేనె యాది జగమెల్లను శూన్యము నన్నుఁ జూచి యే
సృష్ట యెవండో నా నలుపుసొరున కోర్వక సూర్యచంద్రులన్
సృష్టి యొనర్చి రూపము నికేదియు లేకయె పోయె నన్నిటన్
భ్రష్టత నొంధఁడే పరుల బాగున కోర్వనివాఁడు భూవరా ! 50

పంతము గొన్నటుల్ పగలు భానుఁడు రాత్రులు చంద్ర తారకల్
వంతులు వేసి కొంచు నను ధ్వంస మొనర్చు కడంక తోవృధా
కాంతులు వ్రెళ్ళ గ్రక్కెదరు గాని తరింపగ జాలిరే ! తగ
గ్లంతగ నెన్ని ఢీకొనివ నింపుక కొండ చలింపఁ గల్గునే ! 51

కసలి జగాలు గాలిచెడి కల్వల దాయను లోకబాంధవుం
డని నుతియింతు రాతని సహస్ర కరాలకు లేని వింత ర
క్షణ మొకవింత సౌఖ్యమును జల్లదనంబు నొసంగు నా ప్రయో
జనము నెఱుంగ కుండెదరు క్ష్మాస్థలి మంచికి మంచియున్నదే ? 52

కలదు నా జగదధికారంబు నారాయణస్వామి దేహ వర్ణంబులోన
కలదు నా ప్రతిలేని కమ్మందనములెస్స బ్రబ్బఁ బండిన ద్రాక్షపండ్లలోన
కలదు నా దాతృత్వ గరిమంబు గర్జించి కురిసెడి కార్మబ్బు గుములలోన
కలదు నా కడుసోయగము వంపులు తిరిగి సిరులొల్కు జవరాండ్ర కురులలోన

నే ననున దింక నీకు సందేహమైనఁ
గమ్మ కస్తురి తిలకంపు కలికి నడుగు
కజ్జలపు సోగరేకల గరిత నడుగు
కాళికాంబ నడుగు ! నీలకంఠు నడుగు 53

అని గజపతిని దనలోన నునుచుకొనను
రమ్ము రమ్మని పిలిచెడి రహిని దనరి
నల్లనల్లన బలియుచు నల్లనల్లన
భూనభంబులఁ జీఁకటి ముంచివేసె ! 54

ఎంత చల్లనితల్లి యీయిరుల తల్లి !
నావలన మన్నసామంత నరపతులకు
నూరని కృప లూరఁ బిలుచుచున్నది నను
ప్రతికృతి ప్రతి ఫలమడుగని బాంధవికద ? 55

ఎఱిఁగియు నవివేకస్ముగా నరులచేతఁ
జిక్కి చికిలించు కంటెనుఁ జిక్కకుండ
వెళ్ళి వెక్కిరించుటె లెస్స వేగ నిపుడ
యిరులలో దూరి యడవుల కేఁగుదు నని 56

ఆ రెయికి రేయి తగు పరి
వార మనుగ మించుచుండ స్వకుటుంబముతో
నారాజు రహోరణ్యముఁ
జేరె, మరణభీతి యేమి చేయింపదొకో! 57

పెగలు పొగలుగా దినములు ముగిసిపోయి
గడియలంబడి వారంబు గడువనున్నఁ
ప్రజ్వరిలుచునే యున్నది ప్రధనభూమి
కణకణన మండు రావణు కాష్ఠ మట్లు 58

మీ దేమున్నది నా పరాక్రమపు గాంభీర్యంబు నీక్షింపఁ డో
జోదుంబ్రిల్లదులార! యన్నయటు లస్తోకాంబుధిశ్రేణులన్
ప్రాదుర్భావమునంది ఫెళఫెళఫెళ ధ్వానంబులన్ రేఁగుచున్
మోదెన్ ఝంఝు జలంబులందు భువనంబుల్ మున్గితేలాడఁగన్ 59

ఎంతకు యుద్ధభూమి దిశకే తమ యేలిక రాకయుంట నం
తంతకుఁ బోరు ఘోరమగు చాత్మ బలంబులు గ్రుంగుచుంట నా
వంత ప్రయోజనంబు గల భావి కనంబడకుంట నెల్ల సా
మంతు లొకళ్ళొకళ్ళ నని మూమకొంటన్ దృఢ నిశ్చితాత్ములై 60

అసలు వసుంధరేశునకె యక్కఱ పట్టని యాజి నూరకే
యసువులు కోలు పుచ్చుకొను నంత ప నేటికి వచ్చె దూలయా ?
నసిమిఁరియా ? యసాధ్య నరనాథు నెదుర్కొను లేనిపోని య
క్కసు మన కేల ? యేటిజిల కందకు లేనిదె కత్తి పీఁటకున్ ? 61

అని యా సామంతులు ఖం
డన ఘూస్థలి నుండి చనఁదొడఁగిరి యొకరి వె
న్క నొకరుగ ననవసరపుం
బనికి వివేకధనులు తలపడఁ బో రెపుడున్ 62

దెసలు ముంపఁ బట్టి యెసఁగి యెసఁగి ఝంఝ
మలసి మలసి సద్దు మణఁగినట్లు
కృష్ణబలముతోడ జృంభించి జృంభించి
శత్రుసేన లెల్ల సద్దుమణఁగె 63

కర్రిమ్మిన కారుమబ్బులు వికా వికలై చనఁ దొంటి స్వచ్ఛతే
జమ్మునఁ గానవచ్చు జలజాప్తుని కైవడిఁ గ్రమ్మకొన్న పై
న్యమ్ములు విచ్చిపోవఁగ గనం బడుచున్న ప్రధానిశేఖరున్
దిమ్మరుసున్ గనుంగొని మదిన్ బ్రతిలేని ప్రమోదమందుచున్ 64

"అప్పాజీ ! యెటనుండి రాఁకన్ మనరాజ్యంబందు నే క్రొత్తలున్
గొప్పల్ లేవుగ ? యేమిలేవటంచు ననుకొందున్ శాత్రవోత్పాతముల్
తప్పెన్ నిన్నటి నుండి రాఁడొకఁడు యుద్ధంబన్నదే లేదు నేఁ
జెప్పన్ జాల నదే మహత్త్వమొ ! మహాచిత్రంబు యోజింపఁగన్ 65

రణమున గెల్పుల రంభ తిమ్మన పరీరంభంబుఁ గైసేసినా ?
పునరారావము లాశలన్ గెరల గెల్పుంభేరి మ్రోగింతమా ?
ఘన గర్వోగ్ర విరోధిరాట్కరిని చక్కంగట్టి కొంపోదమా ?
తన సామ్రాజ్య హృదున్నతస్థలి జయస్తంభంబు నాటింపగన్ 66

అను భూజానికి మంత్రి తిమ్మరుసు కృష్ణా ! యంతియే కాదు చి
క్కని పప్పన్నము మెక్క యగ్గజపతిక్ష్మా నాథ కన్యామణిన్
మన సామ్రాజ్య వినూత్నపట్టమహిషిన్ గావింపఁ గొంపోద మె
య్యన శ్రీ తిర్పతి వేంకటేశ్వరుని యవ్యాజాను రాగంబునన్ 67

హరు నిప్పు డిప్పుడే యర్చింపఁ జేర నారయుచున్న పర్వతరాజ పుత్రి
పంకజనేత్రున కింకనున్ సురలచే నర్పింపఁబడని క్షీరాబ్ధితనయ
అన్నిహంగులఁదేరి యజునితో నింకను నేకంబుగాని వాణీకుమారి
ఇంకను నొక్కింతయి ఖిక్షు శరాసనుఁ గేలుతగలని రతీలతాంగి 68

ఆయమ సుయశోభ్యున్నతి యాయమసిరి
ఆయమ కళ లామెసొబ గేమని వచింతు
నో మహేశ ! యో శ్రీకృష్ణ ! యో కళా మ
నోహరా ! యోయి నృపలోక మోహనాంగ !

కమలావాణు లొకే మెయిన్ గొనినటుల్ కాంతిల్లు నా స్వచ్ఛ పూ
ర్ణిమ చంద్రానన యాసుమాయువయవి యానెత్తమ్మి నెత్తావియా
పరిమదాంభోనిధి యా సుశీల ఖని యా రమ్యాబ్ధి యా మాధురీ
రమ యా హస్తిపతీంద్రనందన తుకారాకన్య నీకే తగున్ !" 69

అని వచియించెడి తిమ్మరు
సు నడుపు లత్యంత నూత్న చోద్యములగుచున్
గనిన కల దూపు దాలుచు
కొని చేపడినట్లు ముదము గొల్పుచునుండన్ 70

"ఎల్లెట్లో ? యెది యేది యేది యె దెదీ యింకొక్కమా తొక్క మా
టెట్లో ? యేది యె దేది ! నాచెవులు నేఁడేవల్లనో ! వట్టి వ
డ్డట్లుండెన్ దయతో వచింపుము సురేంద్రైరావతశ్రోత్రముల్
తూట్లుంజెందు నటుల్ వచింపుమయ ! విందున్ దివ్య మంత్రీశ్వరా ! 71

అనియేవల్లన నాగిపోయినది ? సఖ్యం బెట్టు ? లెట్లయ్యెఁ జి
క్కని పప్పన్నము మెక్కి యగ్గజపతిక్ష్మా నాధ కన్యామణిన్
మన సామ్రాజ్య వినూత్న పట్ట మహిషిన్ గావింపఁ గొంపోవ నో
య్యన శ్రీ తిర్పతి వేంకటేశ్వరుని యవ్యాజాను రాగంబునన్ ? 72

అబ్బులుఁ డెప్పు డోడె ? మన కా నెటి గుబ్బెత యెట్టు లబ్బె ? కా
ర్యమ్బుల యున్కి లేకె మహిమంబుగ మందు పెడార్లలోనఁ బె
న్నుబ్బులి పుట్టినట్లు విభునొల్లని కన్నియ బిడ్డఁగన్న య
ట్లబ్బుర మౌచు నున్న దిసుమంతయు నూహకునందరాని దై" 73

అనుచున్ బ్రశ్న పరంపర
లను గుప్పెడి కృష్ణరాయలకు తిమ్మరు సో
జన నాథా ! బుద్ధి బలం
బున కెనయగు బలముగలదె పోల్పఁగ నెందున్ ? 74

బెడిదపు గట్టడిన్ వరుసవీడక తప్పక రోజు రోజు కా
అడవిమెకాలఁ జీల్చుకొని యార్వఁగ మెక్కెడి కూళసింగపుం
బెడదను బావిలోఁ బడ గుభిల్మన గూల్చిన ధీసుయుక్తి నొ
ప్పెడి శశకంబు నైతి ! నృపు వీటికిఁ బుచ్చితి ! నుప్పుదెచ్చితిన్ ! 75

ధీరత్వంబున నేను పన్నిన లసద్ధీయుక్తికిన్ బిల్ల పీ
పై రేయిం బగలంచుఁ గానకయె భార్యాపుత్రులన్ గొంచు ను
గ్రారణ్యంబులఁ బడ్డ యాగజపతిక్ష్మా నాథునిన్ జేరి రా
జా ! రానేలిటు ? సంధిచేసికొనఁ బోవా ? యెల్ల కష్టంబులున్ ? 76

ఈ వన్నన్ బడి చచ్చు ప్రేమపున మాకృష్ణక్షమాజాని నీ
తో వియ్యానకె గాని కయ్యమునకున్ చూయండు వాలెన్నఁ డీ
వో వైరంబు వహించి కృష్ణుఁ డన నిప్పుల్ గ్రక్కె దుగ్రుండవై
యేవల్లన్ సమరానఁ గెల్వ నగు నీ కీజన్మలో కృష్ణునిన్ ? 77

నీసామంత నృపాలు రాజు పది మందిన్ బుద్ధిమై నెట్టు లె
ట్లో సాధించి వశంబు చేసికొని నా మో భూవరా ! యెల్లరున్
దాసోహ మ్మని నారు నీవుననకుండన్ దప్పకో సాధ్య మౌ
నే ? సామాన్యముగా వినున్ విడుతుమే నీయంత్యమున్ జూడకే ! 78

పాత్రిముఖ్యార్త శరణ్యుఁ డంచిత గుణా రంభుండు నెయ్యానకున్
స్వామిం బోలెడు వాఁడు మానృపుఁడు నీపైఁ గ్రుద్ధుఁ డైయున్న నే
జామీనుండెదఁ గుత్తు కిచ్చెదను మెచ్చన్ జెప్పెదన్ భూవరా !
నామాటల్ విని సంధిచేసుకొను మా న్యక్కార్యముల్ వీడుమా ! 79

సంధి యనన్ మతేమొ ! యని సందియముంబడఁబోకు నీ యశో
గ్రంథము విస్రుతింప జనకప్రభుఁ డర్క కులప్రభా పయ
స్సింధు శశాంక రాఘునకు సీతమ నిచ్చిన యట్లు నేఁడు నీ
పుం ధృతిఁ గృష్ణరాయలకుఁ బుత్రిక నిచ్చి శుభంబులొందుమా ! 80

ఎక్కలిమి నీవలన మా
కక్కఱయే లేదు కూఁతు నర్పించినఁ జాల్
మక్కువగ; దంపినమ్మకు
జొక్కనదే కూలియని ప్రమోదింతు మయా !" 81

అనుచు నే నాఁడు హితవున కా నృపుండు
హిమకిరణు దీప్తి సోకిన కుముద మగుచు
చినుకు బొట్టు గొన్న కడలిచిప్ప యగుచు
న్నులుముధ్వని విన్న పింఛ మయూర మగుచు 82

"సచివేంద్రా ! యసమాన మానస దయాసాంద్రా ! కృతార్థుండ నీ
వుచితజ్ఞుండవు నీ యనుజ్ఞలకు నే నొక్కింత మాటాడఁ గా
నిచిరాకుల్ విడనాడి న న్ననిశమున్ మీ పేఁడు సత్క్షత్రియ
ప్రచురఖ్యాతినిఁ జూడఁ గోరియెదను నవ్యాజాను రాగంబునన్ 83

అవని గడిచి బ్రతికిన మానవుఁడు లేఁడు;
కష్ట సుఖములు రాత్రింబవళ్ళు తీరు;
శాశ్వతముగ నిలువ దేది; శాశ్వతముగ
మాట యొక్కటే నిలుచు నమాత్యవర్య ! 84

వనుల వెతగొంచు నొకనై వచ్చినట్టి
ప్రాణ బాంధవుఁడవు నీవు వాంఛసేయ
నా తుకారా సుతనె కాదు నా యసువుల
నేనియును ధారవోయుదు నీకునాన" 85

అని వచియించు భూపతికి నంత సమర్థులె యింక నన్ను న
మ్మిన భయమేమి లే దెపుడు మీ పయి నీగను వ్రాలనీయ వ
చ్చిన యటులే రహస్యముగఁ జెప్పెర వీఁటికిఁ బొందు నేను మీ
వెనుకనె యేగుఁదెంచెదను పెండ్లికి మూర్తము నిశ్చయింపగన్ 86

అనుచు నభయ మొసఁగి సంధికైన యన్ని
కట్టు బాట్ల నెక్కడికి నక్కడె బిగించి
చల్లగ సకుటుంబంబుగా సాగనంపి
వచ్చితిని సామంతుల వైన మరయ 87

ఎట్టి సందర్భమున నెప్పు డింకపైన
మన్ను మి న్నేకమైన సామంత నృపులు
గజపతి నృపతి యేకంబు గాని యట్లు
చేయవలయును శాత్రవ శేష మిదియ 88

ఓరాయప్రభు ! కృష్ణదేవ ! కల యేదో వచ్చి ప్రత్యూహ యే
దో రేకెత్త త్వదీయ రక్షకయి ధీయుక్తిన్ స్వతంత్రించి నీ
ధీరోదాత్తత నాజి సాంతముగ నుద్దీపింప నీకుంద నే
ఖేదంబుం బొనరించి నట్లయిన మన్నింపంగ వర్థించెదన్ 89

అని వచియించు మంత్రికి మహాద్భుత మద్భుత మయ్యెరే ! భళీ !
ఘనవిజయంబు పో ! నవ యుగంధర మంత్రి వతంస ! యింక నీ
యనుపమ బుద్ధి నైపుణి బృహస్పతినే నిరసించి పర్వతా
రిని సయితంబు నా ప్రభుతక్రిందికి నీడిచితెచ్చి యిచ్చెడిన్ ! 90

నా రాజత్వ సమస్త సత్త్వమునకున్ దక్షుండవై యుండి న
న్నే రొమ్మం బడనీక నా యభిమతం బీడేర నెగ్గించి నా
ధీరోదాత్తత భంగపోయినటు లార్తిం గుందు దేమీ త్వదీ
యారాధ్య ప్రభుభక్తి మెచ్చుగఁ దరంబౌనే ఫణిస్వామికిన్ ? 91

నే నభివృద్ధి నింతటి మనీషిని బూపతి నైతినన్న నీ
పేని కడాని నెత్తుటి యమేయపుఁ బోఁతయె హేతువందు; నా
కై నెనరుల్ ధ్వనించెడు ననంత కృపాంబుధి! వొండువేడెదన్
గానుగఁలోనిదే యిదియె గంటె డనంగదవయ్య ! యిత్తఱిన్ ! 92

ఇది యభ్యర్థన మనుకొను
మదయ ప్రభు కర్కశాజ్ఞ యనుకొనుము మఱె
య్యదియైన ననుకొనుము నా
ముద మీడేర్చుట యొకటియె ముఖ్యార్థ మగున్ 93

అప్పాజీ ! విను మాఱు మాఱయిన నూఱాఱైనఁ గన్నార నే
నప్పూబోఁణినిఁ జూచితీరవలె నయ్యా ! దాని సౌందర్యపుం
గొప్పల్ చిత్రయుఁ జెప్పె నీవఱకె నీకుంబోలె వర్ణించి; నీ
వెప్పన్నాగము పన్ని నా యభిమతం బీడేర్తువో చెచ్చెరన్ ! 94

అను కృష్ణదేవరాయల
యనుజ్ఞ కొక్క క్షణకాల మాలోచనముం
బొనరించి పుట్టిన యూహకుఁ
దనలోపలఁ దా నగుకొని తలయూచు బొగిన్ 95

"శ్రీకృష్ణదేవ ! యేలా
నీ కా కన్నెపయి నింత నెనరును త్వరయున్
శ్రీకృష్ణదేవ నామమె
యీ కరణి రసికత గలదెయే యేమొ ! కదా ? 96

విచ్చు కత్తుల పొరాలఁ బిప్పలించు
నగరు మధ్యాంతరాంత రాంతఃపుర మది
యా వనిత యసూర్యంపశ్య నీవు రాజ
మార్యుఁడవు నీ కెటుల నామెఁ జూతనగును ? 97

ఏతాము జలము కోసము
పాతాళమ్మునకు వంగు పగిదిని నీ వా
నాతుక మిన్నను జూచుట
కేతామువు కావలసినదే కృష్ణనృపా ! 98

ఒక నృపుఁడు గుఱాల్ వట్టె మ
ఱొక భూపతి కాడుఁగా నెఁ నొకతేఁ డటవిన్
నకనకలఁ గుడిచె విధిఁ ద
ప్పకొన నెవ్వరి తరము కృష్ణ భూమీనాథా ! 99

ఏవలనన్ నిజాకృతి నొకింత బయల్పడనీక గుట్టుగన్
నీవు గులాము వేషమున నెక్కొని నావెనువెంట రమ్ము ప్ర
స్తావనఁ దెచ్చి పెండ్లికిఁ బ్రధానపుఁదమ్ముల మిచ్చుసాకునన్
దేవిని నీ సమక్షమున నిల్పుదుఁ బొల్పునఁ జూచుకొ మ్మికన్" 100

అనుచుం దిమ్మరుసు వచిం
చినఁ గృష్ణ మహీధవుండు చిఱునగవున నే
మనకుండె నృపతి మౌన
మ్మునె యనుమతిగ మతిని సచివుఁడు వోల్చుకొనెన్ 101

గజపత్యుర్వర నాథు రాజ్యమున ఢంకాగొట్టి గెల్పుం గిటి
ధ్వజమెత్తించి వినమ్రులై వలయుకప్పం బిచ్చి సామంతు లా
రజ మొప్పన్ జయపెట్టి వీడ్కొలుప సర్వస్కంధ సైన్యాలతో
నిజ రాజ్యంబున కేఁగుదెంచిరి ధృతిన్ దిమ్మర్సు నారాయలున్ 102

అప్పాజీ యొనరించినట్టి కిటు కావంతైన గుర్తింప "కా
యప్పాజీ కృపచేతనే మగిడీ రాజ్యంబేలుకోఁ గల్గుశ్రీ
యొప్పెంబో !" యని యాత్మనెంచి గజ పత్యుర్వీశుఁ డర్ధాంగితోఁ
జెప్పెన్ సంధి షరత్తులున్ నిజ సుతశ్రీ నిచ్చు వాగ్దానమున్ 103

చెప్పిన దంతయు విని విని
యిప్పుడు లోకువయితిమని యిటుకొంచెములన్
గొప్పలు కనకే యా మం
త్ర్యప్పయ గుట్టును బట్ట మనెనా మనలన్ ? 104

కప్పు మెంతయైనఁ గట్టలేకుంటిమా ?
కాల మొక్కరీతిఁ గడువఁ గలద ?
కూఁతు నిత్తునంచుఁ గులహీన నృపునితోఁ
జేయిఁగలిపి సంధిచేసి నావె ? 105

ఇదిమొద లానృపు నెత్తకుఁ
డది నా కోర్వంగ రాని దను సతితోఁ జే
డదికాదే యని యెదియో !
కదలుప నున్నంతనె యదికా కేది యగున్ ?

కలదుగదా ! తలంత బలగమ్ము ప్రభూ ! మన కేమి యెందులోఁ
గలసినవాఁడు వాఁడు ? మన కన్నుల వెన్నెల నా యెడారిలోఁ
గలిపెదు దొండపండు జతకా దతికింతువు కాకి ముక్కునం
దెల పయినైన వా రపహసింతురు నీ తలఁగొట్టు బేరమున్ 107

నా కేదో తగఁజెప్పి నా సుతకు నిందా ముద్రితుండైనట్టి ధా
త్రీకాంతున్ మెడఁగట్టఁజూచెదవు సాధ్విన్ నన్నుఁ గాదం చెదో
కాకిన్ గోకిలగా నొనర్చుటకు లోకం బిద్ది యోజింపుమా
మూకు ల్గొన్నవి కుండ మూయఁగ జగంబున్ మూయఁగా నున్నవే ? 108

పరిరాజన్యుల వియ్యముంగల మహాస్వాతంత్ర్య సంతోష వి
స్తర సంబంధముతో బలాతిశయ రాజ్యశ్రీ మదోన్మత్తతన్
బరవళ్యుండగు వానిపొత్తు సమమే ! భ్రాంతిం జొరంబడ్డ యీ
తరహాకాని తలంపునం బెను తగాదా తెచ్చుకో లయ్యెడున్ 109

తోచని పాటుతో దుమికి దూరము సుంగున బుస్సకొట్టు నా
లోచన మింతటన్ గెడపి లోకమునం బరి పూతవంశ కా
ర్యాచరణ ప్రతీతి కడుగంటని త్రోవకు రమ్ము ! గడ్డ కా
ణాఁచియె ? యేలుకో దొరతనంబు లనాది పునాదు లున్న వే ? 110

కృష్ణదేవరాయ లెంతేసి పేరాస
లుబ్బఁ జెప్పుచున్న నురకవద్దు;
కాళ్ళముందు చూపుబో ళ్ళద్రోయకపోదు
కన్ను గలిగి నడచుకొన్న మేలు ! 111

వినుము మనోహరా ! కలయఁబెట్టి తెమల్చిన నాతలంపులన్
జనువున వెల్లడించితిని సైరణ సేయుము బంధువర్గ మే
మని సలహా యొసంగుదురొ ! యంశ మెఱింగినమీఁద మీ మన
స్సున కెటు దోచునో ! యటులఁ జూడుమ బిడ్డసుఖంబుఁ గోరుమా ! 112

ఐనను దెలియక యడిగెద
దానగుణా ! యానికృష్టదాసీ పుత్రుం
డేనాగతి ! సత్క్షత్రియ
భూనాథ సుతులకు గొడ్డు వోయెనె జగముల్ ? 113

సతి పల్కు నిష్ఠురోక్తులు
శ్రుతికిఁ గఠోరమ్ము లై విసువుగల్గిన భూ
పతి సతికి సమాధాన
స్థితి కుదురుంబాటుగా వచింపఁ దొడంగెన్ 114

ఏపాపిష్ఠ నికృష్ట జాతకులె శ్రీకృష్ణక్షమాజాని దా
సీ పుత్రుం డని నీకుఁ జెప్పినది రాజీవాననా ! చెప్పినా
రేవో గిట్టక యెవ్వరో ! వినిన యట్లే నమ్మ నేధర్మమే ?
పాపాపాప విచక్షణల్ వలదచే స్వజ్ఞాన యత్నంబునన్ ! 115

వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె త్వరపడక వివేకపుఁ గర్వం
బునఁ దధిగ దాని సత్య న
వనీతము వొడమఁ దఱచి పై నమ్మవలెన్ 116

వినిన విషయావసరముల విలువఁ బట్టి
యది యలఁతిదైన సత్యంబు నారయుకయె
నమ్మినను నమ్మకున్న నష్టమ్ము లేదు:
ప్రబలమ్మైన దైన బ్రతుకె బ్రద్దలగును 117

తన దుష్టత్వము గప్పిపుచ్చుకొని ధూర్తస్వాంత చిత్రాంగి చె
ప్పినదెల్లన్ విని యోచనా రహిత పృథ్వీనాథు డై రాజరా
జనరేంద్రుండు కటా ! నిజాన్వయశశిన్ సచ్ఛీలు సేకైక పు
త్రున్ని పారంగ దరున్ వధించుకొనఁడే దుఃఖాంబుధిం బ్రుంగఁడే 118

శ్రీకృష్ణ దేవరాయ
క్ష్మకాంతునిఁ గూర్చి హంసగమనా ! మునుసీ
వాకర్ణించిన దాని కొ
హో ! కారణ మయ్యెడి యయి యుండఁగవచ్చున్ ! 119

వినుము కౌసల్య కైకేయియును సుమిత్ర
యను మువురు పత్నులు దశరథునకుఁ బోలె
నోలి తిప్పాంబ నాగాంబ యోబమ యను
మువురు పత్నులు మన కృష్ణ భూపపితకు 120

అతఁడు సమరశాత్రవ హిరణ్య కశిపులకు
పౌరుష నరసింహస్వామి పగిదిఁ బొదలి
విదిత నరసింహరాయల పేరితోడ
నడిమి పత్నినిఁ బ్రేమించు నెడఁదనిండ 121

అది తిప్పాంబకు గుండెలోఁ గుఱకు శల్యంబట్లు బాధింప చుం
డ దివారాత్రము లొక్కచే పగిది నా నాగాంబఁ జిక్కించుకోఁ
బదకం బల్ల దొడంగెఁ దా నొకరి నొంపన్ బెంప భావంబు ల
భ్యుదయం బందదె' మేనపేలు సువిశా లోహో ప్రపంచంబునన్

అక్కయా ! యంచు పిల్వద్ద యప్పుడెల్ల
మఱుసుపోకకుఁ దనతోడ నుత్సవముగఁ
బాచికలనాడ నాగాంబ వచ్చుచుండు
నదియె పీలుగ వంచింప నరయుచుండె 122

అరచుచుండెడి నోరును నాడెడి చెయి
కోమలీ ! యెప్పటికి నూరుకొనవు గాదె !
ఏ మెఱుంగని నాగాంబ యెప్పటట్లు
పాచికల నాడ వచ్చెను వచ్చినంత 123

చుప్పనాతిది కద్రువఁ జూచినావె ?
ధవళ వాలమ్ము నల్లగాఁ దివరఁజేసి
దాసిగ సపత్ని వినతను జేసికొనియె
నేలె తోడి పత్నుల మీఁద నింత యీసు ? 124

అయితి మొకరికే ముగ్గుర మైన నేమి
చిన్న దోఁబాంట యది వట్టి స్నిద్ధ హృదయ
ఇంక నీవా ? యెదుట వచియింప నేల ?
మనకు లేవమ్మ ! 'యన్యోన్య మత్సరములు ! 125

క్షితి ధవుఁడు లేఁడ యేమె నీగేహసీమ ?
నరుగుదెంచితి మట్ట మధ్యాహ్న వేళ ?
నాటకేగా ? యితః పూర్వ మట్లుగాక
నెమ్మి నేఁ డాడవలయుఁ బందెమ్ముఁ జఱచి 126

ముంగురులకుఁ బాపట వేణికిం గుసుమము
నుదుటికిం బొట్టు బిగి గుబ్బ పెదకుఁ బయట
నాలుకకు సత్యవచనంబు నగవు మోవి
కాటకుం బందె మందంబు హంసయాన! 127

చెల్లి ! మనమాడు నేఁటి పాచికలలోన
నేను నీకోడిపోయిన నేను నీకు
నీవు నా కోడిపోయిన నీవు నాకు
వరవుడము చేయవలె నర్ధవత్సరంబు 128

ఇది పంచెమ్మఁగ నాడుకొందము సపత్నీ ! పంచె మీమాత్రమై
న దెదో పాచికలాటకున్ గలుగ కున్నన్ జప్పదై రక్తి క
ట్టదు నే నోడెద నీవు గెల్తు ననుకొంటన్ నీకునున్ నాకు గా
దది యేమందువ ? గెల్పులోటములు దైవాధీనముల్ గూఢముల్ 130

తొలి యంతంతటి కలుమల
నల నైషధరాజుఁ బాండవాగ్రజుఁడును నెం
దుల కొడ్డిరి కేళించిరి?
కలికీ ! జూదమ్మ రక్తి కట్టుటకె గదా ? 131

అనుచున్ నాగమ నట్లాడంబఱచి యాత్మాసూయ తిప్పాంబపై
కి నినాదింపగ నీక దుశ్శకుని యుక్తిన్ గేళి సాగించె వే
సిన యెత్తుల్ ప్రతికూలమై యొకటియుం జేరాక నాగాంబ యొ
య్యన నోడెన్ వనితా ! దురాత్ములకె తోడౌ దైవ మెప్పట్టునన్ ! 132

ఆ యల్ప విషయమునకా?
యా యనఘుని పైన నింత యపవాదు ! కటా !
యే యించుక వీలున్న న
సూయాపరు లేమి సేయఁ జూడరు ఘనులన్ ? 133

తిప్పమాంబకు నాగాంబ యెప్పుడేని
వరవుడము చేసెనో లేదొ :- యెఱుఁగఁ గాని
యాటలో నావిడకు నీవి డాఱునెలలు
దాసిగా నోడె ననుమాట తథ్య మబల! 134

చానా! నీ తలపోఁతముచ్చటలు నా సర్వప్రియత్నంబులన్
నానంబోసీతి వెంత నేర్పరివి ప్రాణత్యాగమున్ జేసియున్
మానంబున్ బరిరక్షసేయుటయె ధర్మం బన్నయార్యోక్తికిన్
న్యూనం బున్ గలిగించినాతలఁపు చిందుంబిందుగాఁ జూతువా? 135

నీనా జన్మంబు లివి జ
గాన నశించినను మన్నుగాని చరితలన్
వేనోళ్ళం జదువంబడు
మానధనంబునకు నుంత మ్రగ్గవదేలా? 136

వెలకమ్మఁబడి ప్రాణవిభునితోఁదుద వసుంధరనేలుకొన్న చంద్రమతియొకతె
మరల పెండ్లిసెపాన మగనిఁ బొంది సుఖైకభోగ మందిన భీమపుత్రి యొకతె
యమునిచేఁ దక్కునాయకునితో సంతాన వృద్ధి లోగొన్న సావిత్రి యొకతె
యగ్గిలోఁబడి సందియము దీర్చి పతితో య శంబుఁజాటిన క్షమాజాతయొకతె

స్త్రీ ప్రపంచంబునందుఁ బ్రతివ్రతా ప్ర
భావ దీపికలన గణింపంబడుదురు;
కడమనాతులు పూరుష కంఠ రజ్జు
లనఁ బరంగుదు రూరుపేరా? నెలంత! 137

పిట్టగుబ్రిడ్లను బోఁతు పెంటిగాఁ గల్పించు జంటలోఁ గలుగు సంసారిగుట్టు
జలములో బలిగుడునరసాలఁ గ్రీడించు మీలజట్టుల కుటుంబాలమట్టు
పూవుఁదిమ్మరులచేఁ బుంస్త్రీస్వభావంబు లెఱిఁగించు తరుల కాపురపుగబ్బి
సమయనిబంధనాచారు లౌ మృగముల వలపువయాళి సమ్మేల మదింపు

చక్కఁగ బిగించి కలరహస్యంబు దాచి
నరులయం దిట్టి మైత్రి గానక విరించి
కామబంధపు టాఱుపగ్గముల వదలె
జిక్కఁకొనఁబోకు మెనలేనిచెఱ నెలరత। 138

అనుచున్ గజపతిరుద్రుం
డనుంగుసతితోడ మాటలాడుచు శ్రీ తి
మ్మనమంత్రిలవా రరు దెం
చినా రను కబురువిని దరిసించుటకుఁ జనెన్. 139



# తుకారా

## తృతీయాశ్వాసము

"కప్పం బానతి మేరకు
తప్పక పంపమె పెస నని దాయలపగిదిన్
దప్పంబలుకుదు రేమిటి
యొప్పందము జ్ఞప్తిలేద యుర్వీనాథా? 1

"అవనిఁ గడచిబ్రతికిన మానవుఁడు లేఁడు
కష్టసుఖములు రాత్రింబగళ్ళతీరు
శాశ్వతముగా నిలువ డేది శాశ్వతముగ
మాటయొక్కటే నిల్చు నమాత్యవర్య!" 2

అనుచు నలనాఁడు మీనోట నన్నమాట
నుఱచితివటయ్య? గజపతిక్ష్మావరేణ్య!
శ్రీమలలో గావలసిన పరాత్పరుండు
పిదపఁ గాఁబట్టకుండుట విదితమె కద! 3

అట్టి వదాన్యునిదయ రాఁ
బట్టుకొని జగత్ప్రసిద్ధి బడయుట లెస్సా!
నిట్టూర్పులఁ జుట్టఱికపుఁ
బుట్టుకతేనియను నీరుఁబోయుట లెస్సా! 4

వినయవిధేయతన్ దమ రభిన్నదయానుమతిన్ జరించి నా
రినుటకు సందియంబు గలదా! ముందు రాఁగలకార్యసిద్ధి సూ
చన శుభదప్రదాన మిట సల్పుట కై చనుదెంచినాము మా
పని సఫలంబుసేసి పనుపంగలరా? యలరారు రాయలున్." 5

అన తే డిట్లను మా తనూజయెడ మీ యాంతర్య మెట్లుండునో
యని వాదించితి పై నిజస్థితిని బాహాటంబుగాఁ గంటి లో
ననుమానంబును దీర్చుకొంటి భవదీయాజ్ఞానుకూలుండ నై
మనసానందము జేసిపంపెదను లెమ్మా! యెల్లి మంత్రీశ్వరా!" 6

సరి యను చిర్వు రందుపయి సమ్మతినందిరి పోఁద నొక్క మం
దిరమున సేనతోన విడిదిన్ నియమించి యనుజ్ఞపై గృహం
బరిగి నిజాంగనం బిలువనంపి విశేషములెల్లఁ జెల్పె న
త్తై అవయుఁ బుత్రికం బిలిచి తెల్పె వివాహ విభేద పద్ధతుల్. 7

"నా నోముందొలిపంట! నా పసిఁడికొండా! గుండెలన్ రాచి అం
పానంబెట్టుచు నున్న దీవిషమసంబంధంబు నెట్లోర్తు న
మ్మా! నీనా ఋణ మింకఁ దీఱినది కన్నారన్ నినున్ జూడ ను
న్నానా? ముం దొకనాఁటికిన్ బ్రతికియున్; నా నెయ్యపుం గూతుఁరా! 8

మేనఁ దుఱంగలించు మిసిమిన్ జిగిజంపు పరంజుకొన్న నా
మానస మంధకారమయమా? మురిపమ్ములు కట్టుశ
క్కా! నునుబల్కులం బలుకు కీరము లేనటువంటి పంజరం
బే నగ రేమి చూచుకొని యింకఁ దరింతును నీ వియోగమున్? 9

చేయారఁ బాయసాన్నము
నేయమునన్ గుడువఁ బెట్టి నీ కీవిషముం
బోయఁ దలంచితి మింతకు
మాయవిధికి నెంత కడుపుమంట మన మనన్! 10

కత మిట్టి దని వచింపక
వితాకునన్ గంటనీరు విడిచెడి జన నీ
స్థితి గన్న పుత్రి దుఃఖిత
మతి యయ్యును ధీరతా సమంజసభణితిన్. 11

"తల్లీ! కారణ మేమి? చెప్పకయె చింతన్ గుందుచున్ బాష్పపుం
జల్లుం గుప్పెద వెవ్వ రే మనిరి? రాజద్రోహవృత్తాంతమా?
ఘొల్లుంగల్లల మల్లగుల్లపు దలంపుల్ వోవు రాద్ధాంతమా?
మల్లాడం బరువెత్తి వచ్చెడి రిపుక్ష్మానాథు దుస్తంత్రమా? 12

నాకున్ నీకు వియోగఖేద మగునన్నా వే మహానర్థముల్
చేకూరెన్? జనకుం దెఱుంగఁడే? పయిన్ జిమూత్రిపుడున్ లేఁ డే పైఁ
బైకొన్నన్ శిరసావహించుటయుఁ దప్పంబోవునా? దాన నీ
పే కన్నీటను గుత్తరింపఁగలవే మే? పిచ్చి నా తల్లిరో! 13

జననీ! రాచకొలంబున
జననంబెత్తితివి పౌరుషం బుడివోవన్
వనరుచు వఱ్ఱిలు విడువం
జనునే? లోఁగుట్టుఁ దెలుపఁజాల వదేలా? 14

ఎట్టి భయానకంబు వెలయించునొ దుర్విధి; యైనవారికిన్
గిట్టని దారిద్ర్యక్కి యుడికింపఁడుగా నిను దండ్రి యల్లరుల్
పుట్టినసీమలో; జిలుఁగుము త్తెపుదండలు దూసినట్లుగాఁ
టుట్టెడు కంటినీ రులగ బోసెద వంతపనేమి వచ్చెనే?" 15

అన విని తల్లి యిట్టు లను "హా! సుత! నా దుఃఖిల్లినట్టి కా
రణ మతిదారుణమ్ము వినరాని దనాచరణీయకార్య భా
జన మతినిందితాస్పద మశాంతికరం బనులోమబాంధవా
ర్జన మొదవించు ఫాలతలజాతకరేఖ నెటుల్ తరింతువో! 16

నిక్కము దాచనేల? ధరణీరమణుం డల కృష్ణభూవిభుం
డెక్కడివాఁడొ! ని న్నతని కిచ్చి వివాహము సేయఁగోరినా
డక్కట! నీదుతండ్రి కెవ రడ్డము సెప్పెడివారు లేరు మా
చక్కఁదనాలచుక్క యొకజాతివిహీనుని జేరఁబోవునే? 17

ఎల్లి ప్రదాననిశ్చయము నేర్పరుపం దలపోసి రిందు పూ
బిల్లయు బీరువోక విన వెక్కసమై తలయెత్తిచూచు నీ
యల్లరి పేరటంబు తనయా! మన యన్వయ సుప్రతిష్ఠకున్
జిల్లి కదమ్మ? రాజ్యరమ చింతిలి జాఱుఁగదమ్మ మీఁదటన్! 18

నా దుహితా! హిత మ్మెదొ! కనండట! వియ్యపు వారు తండ్రికే
పోదులు సాదిపోసి తలఁపుం బులిపించియుఁ బిచ్చిరేపిరో!
కా దన నొ ననున్ బెడపుఁగట్టె కనేకముఁ జెప్పి చెప్పి నేఁ
జేదయిపోతిఁగాని యరచిన్నముఁ దగ్గ డదేమి రోగమో! 19

గుమ్మడిపండుచాయ సొబగుం గులికించెడి నీ తనూవిలా
సమ్మను గన్నులద్దుకొని సంబరమందెద నన్ను దుఃఖ కూ
పమ్మునఁ గూలఁద్రోసి యొకపాడుపరున్ గయికొందువా? వరా
లమ్మ! మనోరథాల కిదియా కడ? తల్లిఋణానఁ బోదువే? 20

ఉదయము లేచి నీమొగము నోరగఁ జూచినయంతఁ బ్రాణముల్
కుదుటపడున్ గదా? వెతలకుం గులదూరునిఁజేయివట్టి పో
యెదవు కదమ్మ! నే నెవరి నిందుఁ గనుంగొని సంతసింతు? నా
యెద నిటు చిచ్చువెట్టి చన నెట్లు తెగించెదవే? తనూభవా! 21

ఎన్నటికేని ని న్నొకని కీఁదగుధర్మము దప్ప దాతఁ డ
ధ్యున్నతరాజ్యవైభవ సముజ్జ్వలుఁ డైనను లాభ మేమి? నీ
పున్నెము సొంతమున్ దుడుపఁబుట్టినవాని వరించి రేఁబవల్
కన్నుల నశ్రుధార లొలుకన్ గొఱనోములు నోచికొంటివా? 22

కల బలగంపు టాగడపునిందలఁ దులాభారమ్ముగాఁ దూఁగఁబడకు మమ్మ!
నవరాజ్యలక్ష్మి నీ సవతిగాఁ గనుగీటు వలపుటుచ్చులఁ జిక్కువడకు మమ్మ!
ఏనాఁడుఁ తలవంపు లెఱుఁగని పుట్టింటి కీర్తికాంతమె తూలకింపు మమ్మ
మరులు పేగించి వెంపరలాడు నా ముద్దునిలువెల్లదాటిపోనీకు మమ్మ!

యెల్లని ముహూర్తమునకు రాఁజెల్ల దనుము
పెత్తనంబునఁ జెప్పి పంపించు మమ్మ!
వీరపత్నీపవిత్ర జీవితచరిత్ర
లనుకరించినదాన వై మనఁగదమ్మ!" 23

అనుచున్ దన కేమాత్రం
బు నభిప్రాయంబులేని భూమీపతితోఁ
బ్రణయాను బంధము గుఱిచి
తనయకుఁ దల్లి వచియించి తలపోయు తఱిన్ 24

పతగ కులంబు లెల్లఁ జెవి పండువుగాఁ గుదిరించుపాటతో
జతగొను గండు తుమ్మెదల ఝూంకృతి నాదము నాలకించి భూ
సతి వెస మేలుకాంచి విలసజ్జలజ ప్రణయార్చన క్రియన్
గుతుకము గూర్చెడిన్ బొడుపు కొండకు నెక్కి దినేశ మూర్తికిన్ 25

సాజముగా మనః పరవశత్వమునన్ దపియించువానికిన్
భోజన పాన నిద్ర లదుపున్ గలవా? కలవాణి సంగతిన్
రే జపియించుచున్ గలవరించుచుఁ గన్గవ నచ్చు బొమ్మతో
జూజములాడు తేని మనసున్ గరసంజ్ఞల లేపె సూర్యుఁడున్ 26

అట మేల్కాంచి ప్రతీక్ష సల్పెడు నమాత్యాగ్రా మణిం గాంచి నా
నటనన్ నా మొగ మాన వా లెఱుఁగ కుండన్ తేని కన్గట్టి నా
వటులన్ సుందరి యందచందములు కన్నారంగఁ జూపింపు మి
చ్చట నాకింతియ చాలు నీ నిపుణ వాచా ధుర్యమాధుర్యమున్ 27

అనినన్ దిమ్మరు సిట్లను
"జననాథా! పిల్ల పట్టు చందంబున నీ
పని తనసును గడపినఁ ద
క్కిన దీ కనుగీటున జరిగించెదను సుమీ! 28

నిన్నఁ బ్రయాణమ్మున మీ
రన్నది నావంటి వాని కవమానముగా
నున్న నొనర్చెద నెద యె 29
ల్లున్నఁ జెలిని జూడవలసి యున్నపని కదా ?

జనితానంద మనస్కుఁడై గజపతిక్ష్మానాథుఁ డానాఁడు నం
దన నారాయల కిచ్చి చేసెడి కడంకన్ బంధు వర్గంబు నం
తను రావించి మనః ప్రియంబొదవ సత్కారంబు గావించి మం
తనముల్ సేయ దొడంగెఁ దత్సభ నుదంతంబెల్ల రాఁబట్టఁగన్ 30

గురిగింజయెఱుపునకుం గ్రింద నలుపును జూడవాయని మీఁదఁజూచు నొకడు
పాలమున్నీటిలోపలఁ బిచ్చివిష మున్న దెఱుఁగవే యని బల్లజఱచు నొకఁడు
బారెడు చుట్టైన బాటను బొమ్మన్న యార్యోక్తి నెగ్గింపు మను నొకండు
పాముకోరలతోడ సాము సేయదలంచు కొంటివా? యని రిక్కఁగొట్టునొకఁడు

కాకులకు గాను వెమ్ములగాయ నేమి ?
యగ్గి ముల్లియ గట్టుదువా నృపాల !
యను నొకం డిట్లు తల కొక యాశయంబు
వెడల నాడంగ గజపతి కొడలుమండి 32

ఈసౌభాగ్య మహో ! మహాసభకు మీ రేకార్థులై వచ్చి నా
వాసిన్ నిల్పుదు రన్న భావమున నాహ్వానింప హాస్యాస్పద
వ్యాసంగంబులు సేయఁ బూనితి రిదేనా ? తగ్గ మర్యాద వ్య
త్యాసంబుల్ గణియించు కాల మిదియేనా ? చాలు మీ కూరుముల్ ! 33

వైనములయ్యె మీ పలుకు ట క్కొలికించు తలంపు లన్ని వా
గ్దానముఁజేసి తప్పుటి యధర్మము పై మన రాచ జన్మకున్
న్యూనత గాదె పూరు మనువో! యని లోకము గోలపెట్టి పో
దే నగు బాట్లు జీవితము నెట్లు భరించెద మింతవార మై? 34

మీ రొక మాటమీఁద నిది మెచ్చితిరా! సరి! బెట్టుచేసి మ
మ్మాఱడి పుచ్చగాఁ దలఁతురా? మరియాదగ లేచి యిండ్లకున్
దారుడు నిండుగా మునిఁగినన్ జలిలేదు; ముహూర్త మాగునా?
కారణ మెల్ల ముందు జరుగంగలదో దిగ యంతు చూచెదన్ 35

నావారై నను తీసివేయ రను కొన్నా నిట్టి మీ వక్రపుం
భావంబుల్ విని నామనంబును మరల్పంబూను కొన్నప్పు దే
యావద్రాజ్య రమాతనూభవల చాయం బొంచి యుద్ధాకృతిన్
గాప్రంబట్టదె రాచబెబ్బులి మహోగ్రక్రోధ దుర్వారమై 36

వియ్యపువారు విన్న తగవేగద? తియ్యని వింటివాని క
న్నయ్యకునైన వంక లరయంగల దీ జగ మింత యేల నీ
కయ్యపుఁ గూటికిన్ నడుము గట్టగఁ జూతురె? వడ్లలోనిదే
బియ్యపు గింజగాఁ దలఁచి పిల్చి తనూభవ నీఁ వెగించితిన్! 37

దివులు విచారమున్ గజపతి క్షితి నాథుని మందలింపులోఁ
దవిలి చలించు చిత్తములఁ డావరమౌ కపట మ్మడంచి పె
ల్లవమతి మేల్మిసుంగుగ నయంబు భయంబు ప్రియంబుఁ దోప బం
ధుపు లెటులెట్లొ తమ్ములమునున్ గయికోఁ దలపోసి రంతలో 38

కలమాంకూరము నేత్ర పర్వముగ నిక్కన్ వేగఁ బర్వెత్తి యు
బ్బలి కూపంబునఁ గూలుసేన్గు పగిదిన్ ప్రాల్మాలి శ్రీకృష్ణ రా
యల వా రొక్క గులాటువేసమున నొయ్యం జిక్కె నచ్చోట నా
జలజాక్షీ వదనావలోకన మహాశాపాశబద్ధాత్ముఁడై 39

కామోద్రేక మునందు మై మఱపు దృఙ్మాంద్యంబునుం బూని ల
జ్జా మర్యాదల నుజ్జగించి రమణీ సౌందర్య లీలా సుధా
పేర్మిమన్ రాయలు మంత్రివెంట జనియెన్ వియ్యాల వారింటి కు
ద్దా మాయల్లక చింత న స్తగిరి కాంతన్ జేరె భాస్వంతుఁడున్, 40

వచ్చిన మంత్రి వర్యునకు వందన పూర్వకమైన గౌరవం
బిచ్చి పసిండి గద్దె వసియింపఁగఁజేసి మహాత్మ! మీరు మా
రచ్చకు రాక ముందఱఁ దిరంబుగ యుష్మదభీప్సితార్థమున్
ముచ్చట మూటగట్టియు మిమున్ గనిపెట్టుచు నుంటి మిచ్చటన్ 41

మీ మాటను జవదాటిన
నామము గలదా జగంబునను ? మారిణి ముం
దా ముక్క తెగులు విను తం
డ్రీ ! మీ కోరికను గొండ కెక్కింతు నిదే !" 42

అని గజపతి తన మానస
మును విప్పియుఁ జెప్పె మంత్రి ముఖ్యుఁడుఁ జిఱు న
వ్వువఁ బలుకరించి సామం
త నృపా ! మీ మతి విశాలతను గంటిఁగదా ? 43

కాని కొలందివేడుకయుఁ గల్గె నదేమన కృష్ణరాయ భూ
జాని యశస్సతీ మణికి జంట వినిర్మల హర్మ్యవాస ల
క్ష్మీనిభ భావిపట్ట మహిషీమణిఁ గన్నులఁ గాంతుమేని మా
మానసతుష్టి కింక నతిమాత్రపుఁ బుష్టియునబ్బు నట్లగున్ 44

జననీ జనకులవలె రా
జును రాణియుఁ బ్రోవకున్నచో మృత్యువు నో
ట నిమేషములో నెరయై
చనకున్నె సమస్తలోక జనసంతతియున్ 45

ఈమాత్రపుఁజన విచ్చిన
చో మా జననీ పదాబ్జ శుభ దర్శన సే
వా మర్యాద లొనర్చి మ
హామోద మహీధరాగ్ర మధిరోహింతున్ 46

నే నీభృత్య శిఖామణి
తో నావిడిదికిఁ జనను గుతూహలము సరే
నా? నీ మహుతమ్ముల ముం
దీనేర్పరి నమ్మకస్థుఁ డెల్లడల నృపా!" 47

అనుచున్న మంత్రి మొగమై
జనవరుఁ డను "మీ మనోవిచారము దీటం
గ నడుగ వలెనా? మీ వాఁ
డనుగానా? యిదియు మీ నటనయే గాదా? 48

మాపని తీఱిన దిపు డిఁక
మీపిల్లది కీడుగాని మేలే కానీ
యాపసిదానికి మీరే
కాపుగడ తమయభిమతమె కానిం డార్యా !" 49

అనుచు మంత్రిని మంత్రి భృత్యుని మహా ము
దమునఁ దోడ్కొని పైడి గుమ్మములు గడచి
రాణివాసముఁ జేరి గారాముసుతకు
రా ననుజ్ఞనొసంగె నా రాజవరుఁడు 50

అంతట రాకుమారి పితయానతిఁ గన్ మిఱుమిట్లుగా లసత్
కాంతి కలా కలాపములఁ దాల్చి స్వభావమనోజ్ఞ రేఖ నూ
అంతలుగా నమాత్యుదరి కంతి పురంబుననుండి వచ్చె ని
శ్చింతత మబ్బుచాటున వసించి తళుక్కునఁ దోఁచుమించు నాన్ 51

నళిన దళాక్షి నెమ్మొగమునన్ జిఱునవ్వుల పండు వెన్నెలన్
బులిమి నటించు క్రొంబసిఁడి పూఁత నిగారపు సోయగమ్ము తీ
రలరుచుఁ గ్రొత్త పెండ్లికొడు కబ్బురపుందమిఁ జొక్కి నిల్వ చూ
పులు గల జంత్రపుంబ్రతిమ పోల్కి నధేపనిగాఁ గనుంగొనున్ 52

ఈదృజ్మోహన రూపమున్ దొలుత నే నీక్షింపమిన్ జిత్త మం
దా దర్పంబగు లీలలన్ గలిగి గాఢాలింగనేచ్ఛా రసో
న్మాదానన్ దలక్రిందు లై చివర కీ మాధుర్య వారాశిలో
పీదంగంటిని వాంఛితార్థములు హాయింబండి కైవ్రాలఁగన్ 53

లోలో నిట్లనుకొను చా
నాళీకముఖీ విలోక నాళీకరణ
వ్యాలోల ప్రేక్షణుఁ డై
బేలవలె౯ నిలిచెఁ గృతక భృత్యుం డచ్చో ! 54

అరుదెంచి జిలుగు మేల్ముసుఁ
గరజాఱ నమస్కరించి యట నిల్చిన యా
శరదిందు కళాసుందరి
దరస్మితను సుతను గాంచి తండ్రి వచించెన్ 55

పీ రెవ్వా రనుకొంటివో ! రిపుచమూ విచ్ఛేదనోద్దండ దో
స్సారుండౌ మనకృష్ణరాయల మహాసామ్రాజ్యమున్ గాచు బం
గారుంగోట కదమ్మ ! తిమ్మరుసు లీకాలాన చాణుక్యు లై
యూరేగించెద రుద్భట ప్రతిభ నాంధ్రోర్వీ యశస్సుందరిన్ 56

సుమతీ ! ప్రధాన తాంబూ
లము బంచి వివాహమునకు లగ్నము నిష్క
ర్షముఁ జేసికొంటిమి గదా ?
క్రమ మిది సేవకుఁ డొసంగుఁ గై కొను మమ్మా ! 57

అంతట వలపుందలపులు
దొంతర లై చెలువమీఁద దొరల వివశుఁ డై
మంతిరి కనుసన్నల నొక్కెఁ!
గంతున నిడె మాయవేషగాఁడు తములమున్ 58

వాగ్గరిమంబు మాని తలవంచి చెవిం జోరవచ్చు పల్కులం
దొగ్గక నేలపై బుఱుకుచుండిన చూపుగుమిన్ గులాముకాల్
గగ్గెరమీఁద నంతముఖ కంజమునం బరగించి గిఱ్ఱునన్
గగ్గురుపాటుమైఁ విసిగి కన్నియసౌధముఁ జేరి తల్లితో 59

మన మెవ్వాని స్మరించుచున్ బరిభవింపన్ జూచుచున్నాము ! యా
జన నాథుం డగు కృష్ణరాయల ముఖాబ్జం బిప్పుడే కంటి న
న్యా నరుం డెవ్వఁడు రా నసాధ్యతర మీ యంతఃపురం బెల్లు చొ
చ్చెనొ ! యీ ద మ్మెవఁ డిచ్చెనో ! జనకుఁడే చేటయ్యె నా పాలిటన్ ! 60

వినుము సవిత్రి ! వా డసలు భృత్యుఁడు గాఁ డగునేని దేఁటగా
గనుదెర విచ్చి తాల్మి నయగారపు జూపులకై పునన్ ననున్
గనుఁగొనునా ? ఒడాయి నడకన్ జిగిపచ్చల కాలి యందెతోఁ
బనిఁగొని వచ్చునా ? యతనివాలక మారయ కృష్ణరాయలే ! 61

తాను చాణక్య మంత్రి యంతటి మనీషి
యంట ! సర్వరాజ్యమ్మున కండ దండ
యంట ! యా తిమ్మరుసు మన యింటిలోన
లేనిపోని యీ పోటు కల్పించె నేమి ?" 62

అనుచున్న తనయ వచనము
లను విని జనయిత్రి పన్నులను నూరుచు భ
గ్గున మండి నిజాప్తుల మం
తనమున రావించి యిట్లనంగఁ దొడంగెన్ 63

"బంధు జనంబులార ! సదుపాయమునుం బరికించి నామదిన్
రంధిని దీర్పరారొ ! నగరంబునఁ జొచ్చియు విస్ఫురద్వయో
బంధుర కన్య మానస విభవంబును జూరఁగొనం దలంచు గ
ర్వాంధుని రూపుమాపి మన యన్వయకీర్తిని నిల్పఁబెట్టరే ! 64

తడవుసేయుదు రేని సౌధములఁ గడచి
చను నగర్తల నటుమీఁద సంహరింప
మనవశము గాదు లెండు తత్క్షణము కోట
గుమ్మము బిగించి శిరమును గొట్టి లెండు ! 65

కని విసరులఁ గొసరింపుల
నుసికొలిపెడు న య్యసుర దురుక్తులు విని బం
ధు సమాజము కోపమ్మున
కు సానలను దీర్చి నెత్రు కూటమొగ మ్మై 66

సార్వభౌమాంక విస్ఫారితాహంకార మునకు నూఱేండ్లు నిండినవియేమొ !
యనుచిత బాంధవ్యమునకు బారలుసాచు పుట్టెడాసకు నంది గొట్టె నేమొ !
రాణివాసమ్ము మర్యాద మంటను గల్పు మోహమునకుఁ జావుమూడె నేమొ !
జన వినిందిత సాహసక్రీడలకుఁ దార్చు నాగ్రహానకు నాడి యాగె నేమొ !

కాక మనవీఁటి కి ట్లొంటి కాలిమీఁద
లేచివచ్చునే యీ నీతిలేనివాఁడు !
నేఁడు మన వంట యింటి కుందేలటంచు
రాయల వధింపఁగదలి రా రాచవారు 67

ఆలోన గుజగుజల్ సడ
గాలి చెవుల సచివుఁ డెఱిఁగి కనుగీటె భటా!
చాలఁగ సున్నముగల తాం
బూలము నిచ్చితివి నోరుపొక్కెను గదరా! 68

కిల్లీని గట్టు పెఱుఁగక
వల్లడి గొని తెచ్చినావు పనిపాటలు నీ
వల్లంగా విఁకఁ బద పద
కల్లరి! యిచ్చోట నీ మొగముఁ జూపకురా!" 69

అని కృత్రిమచారుని వీ
పున మోపిన గతి హజారమునుండియు గెం
టి నటుల వెన్నాడి గృహాం
గణ మిర్వురు విడిచి కోటగడి గడచి రాగిన్ 70

హంతకులు ఘోర కృత్య ప్రయత్నమునకుఁ
దారసిలి దారిగాచు నంతకును మున్నె
వ్యథితు లటుఁ గోట దాటిన వైన మెఱిఁగి
గుప్పుచప్పుడు గాకుండ దప్పుకొనిరి 71

ఇవ్వార్త గజపతి ప్రభుఁ
డెవ్విధమున వినియెనో! సహించుకొనక యా
నెవ్వఁకు దిగి చివ్వకుఁ గాల్
దువ్విన తన సతికి దుర్మతుల కిట్లనియెన్ 72

ఈ గోల రేఁగినది మన
బాగునకో ! లేక ముందు బాధలకో ! మి
న్నాగును జెనకితిరి సుమీ !
జాగారము సేయఁగా విహారించితిరే ! 73

నా యిలు చొచ్చు బంధువులనా? కరవాలము లంటి ప్రాణముల్
దీయఁ దలంచుకొంట ? వెలితిన్ దలదింపులు గూర్చు కత్తి తో
పాయపు బెత్తు గ శ్శృపుడు పన్నితి రోయికిరాతులార ! మీ
తాయువు మూడిగాక చెరలాటము తిమ్మరు సయ్యతోఁడనా ? 74

ముమ్మొన వాలు సేకొనఁడు మూఁడవ క న్నగు పించ దంతె యా
తిమ్మరుసయ్య శత్రు జగతీ లయరుద్రుఁడు సర్వరాజ్య చ
క్రిమ్మొక ప్రేలిపై గిరగిరన్ వడిద్రిప్పెడు నంతవానితో
తొమ్మెటులాని పోరఁగలరో ! తమకించితి రింతవెఱ్ఱు లై 75

దైవ వశంబునన్ బ్రహరిదాటి జితాసువు లైరి గాని వా
రీవలఁ జిక్కుచోఁ బ్రతుక నిత్తురె ! పాపము రాజధర్మపుం
దోవలు దప్పి మీ రడుసుద్రొక్కుట యా యగడంత నా తలన్
బోవగుటయ్యె సొమ్ముదిని తొమ్మను గ్రుద్దితి రేమి సేయుదున్ ? 76

చంపను బెంప జాణ లని చానలఁగూర్చి వచించువాక్య మీ
కొంపల గుత్తతో నమరుకొన్న దనేక విధాలఁ జెప్పి గ
ద్దింపుల నొంచితిన్ దుదకు దిద్దుకొనం గలదా? మనస్సునం
దంపర పెట్టి నా పరువు దక్కని యోజనతోఁ జరించెడిన్ !" 77

అను చిట్టుల నిట గజపతి
తనవారలు వొనరిచిన కుతంత్రపుఁ బనికై
కినియుచు నుండఁగ నటఁ గృ
ష్ణనృపుఁడు గండముగడచి పని సచివునితో 78

"మెకముల తేని మీఁద బడె మేకల మం దని నట్టి కింపదం
తికి గుటియై యశో మదవతిన్ దలవంపుల పాలుఁ జేసి ప్రా
పక మగు ధైర్యలక్ష్మికిని పంద తనం బలవార్చి హీన రూ
పకమునఁ బౌరుష మ్మడుగు బట్టెఁ గదయ్య ప్రధానిశేఖరా! 79

విడిచిన యింటి జోగునకు వెళ్ళితి మైనది చాలుఁగాని నా
గడ పిఁకఁ ద్రొక్కరా దతఁడు కాళ్ళ పయింబడి మ్రొక్కినన్ బదం
పడి తనముద్దు గూఁతును సమర్పణఁ జేసెద నన్న నెల్లి దే
విడి బిగియించి మొత్తమును ప్రేల్చుటకున్ హుకు మిమ్ము సేనకున్" 80

ఆకర్ణించి ప్రధాని "భూపతివరేణ్యా! క్రొత్త వాఁడా యతం
డీ కౌటిల్యపు వృత్తికిన్ దిగి లడాయింబూన నేతెంచునా?
మూఁకై బంధు జనంబు లీ పనిఁ దలఁపుంజేసిరో! కుర్కురా
నీకంబుల్ మదనాగమున్ గని మొఱింగెన్ జేటు వాటిల్లునా? 81

కట్టుగా లేచి సరఘలు గుట్టుచున్న
బయలు సేసియుఁ బొదఁ దేనె పట్టు రాల్చి
మధువుఁ గ్రోలక మానెడి మనుజుఁ డున్నె?
తీవ్ర పడకుడు ఫల మిందు దేలఁగలదు 82

ధీరోదాత్తత కా యకార్యమున కుద్దిన్ గట్టి యీ సంగర
ప్రారంభం బడియేలఁ బిచ్చుకలపై బ్రహ్మాస్త్రమా? ద్వేషరో
షారూఢ ప్రతికార దీక్ష కిది వేళా? కాదు కోపానఁ దెం
పారం గోసిన ముక్కు శాంతమున రా దాలింపు మీ పల్కులన్ 83

తక్కిన గొడవలు మన కిపు
డక్కఱయే లేదు కన్నియన్ గంటి నిగా
కెక్కిన దా చక్కందన
మ క్కారణ మిందుఁ దెలుపు టవసరము గదా? 84

కోపమునందు శాంతమునకున్ జనవున్ గలిగించి రాజ క
న్యా పరతంత్ర చింతనమునన్ బురికొల్పెడు మంత్రిఁ గాంచి "అ
ప్పా! పరువంబు పొంగి తెగఁబండిన చక్కదనాలకొమ్మ వా
ల్చూపులు గుప్పు నావలపు జొబ్బిన పోయి వచింప మాటలా? 85

కందెర విచ్చి చూచితినిగా! తొలికారు జగామెఱుంగుఁద
ళుక్కుం దొణకించు నందమునకున్ దలక్రిందయిపోతి. దొంద పం
డెందుకు దానివాతెఱకు నించుక విప్పియు వీనుదోయికిన్
విందొనరించె లే నగవు వెన్నెల చల్వలఁ గూర్పదయ్యెనే? 86

ఆలాపణ్యవతీ సమక్షమున మోహభ్రాంతి వట్టిట్టులై
కేలన్ గాలి పటంబు పోలిక మనోంగీకార సూత్రమ్ముతో
లీలన్ జిక్కియుఁ దూలుచుంటిని పిరాశిన్, సర్వదివ్యాంగనా
లాలిత్య మ్మొక కుప్పవోయు మది యెల్లన్ సాటి యా గోటికిన్ 87

కువలయ నేత్ర రూపమునకున్ దులదూగిన పూవుబోండ్ల సం
భవలిక నిద్ధరిత్రి తలమానిక మా కడసారి చూపులోఁ
గవగొని నట్టి భావములు కన్ గురియించియు దాటిపోయె నే
నేవ రనుకొన్నదో ! అసలు కృష్ణుఁడ నై చెయిఁబట్టకుందునే ? 88

కోండ్రదీసిన ముక్కుముంగురుల నడుమ
పాపట బిగించి తేంట్లగాఁ బరపడంగ
ముద్దు లొలికించుచున్న య మ్మొగద మొగము
కటవుఁ దీరఁగఁ జూతు నాగకయెపోయె ! 89

కలికిచూపు తెప్ప గౌసెనలోనుండి
దుమికి నా మొగంబు నిమురు తీరు
చందమామ బేడిసలు గావు హోయలును
మతికిఁ దెచ్చుకొందు మంత్రివర్య ! 90

సిగ్గరితనంబుఁ బయికి సూచించు రూపు
రేఖల మదిన్ గదించి చిత్రించు పటిమ
చెక్కుటద్దాలఁ బ్రసరించు జిగిమెఱుంగు
లం దిమిడ్చె లతాంగి నేమని నుతింతు ! 91

పెక్కులికేల యంచనలు వేసిన లక్షణముల్ బరాబరిన్
జక్కదనంబునన్ గుదిరి సై : ఫలమున్ గని నోరియూటలన్
గుక్కడ మెన్నినా శ్లతివకున్ గళసీమను దాళిఁగట్ట నా
పక్షి నతిత్వరన్ గమ మపాయములేని యుపాయ మియ్యెడన్ 92

అనినన్ దిమ్మరుసయ్య చక్కని యుపాయం బప్పు డూహించి లే
ఖ నిటుల్ వే విలిఖించె "నో గజ పతిక్ష్మా నాథ! తా మింట మ
న్ననలన్ దిన్నని వై ఖరిన్ మము మహానందాబ్ధి నోలార్చి వ
చ్చిన కార్యంబును జక్క పెట్టితిరి సుశ్రీ మీకు సిద్ధించెడిన్ 93

బనకును మీర లంపిన శుభప్రదలేఖ పఠించినాము మా
నసమును సంశయాస్పదమునన్ జొనుపం బని యుండదే! సమం
జసముగఁ బూనుకొన్న పని చక్కపడన్ గల దెల్లి వేడ్కతోఁ
గొనగు మదీయ వాక్యమునకున్ జెవి పీయుఁ డభీష్ట సిద్ధిగాన్ 94

ధరణిప! మా ప్రదేశ కుల ధర్మము పెండ్లి కుమారుమారుగాఁ
బరిణయ వేళ నొక్క నిడువాలునకున్ దలఁబ్రాలు వోయు ట
క్కరణి నొనర్చి మావలయు కాలము నం దనుఁగుంగుమారి మా
పురమున కంపినన్ బ్రమదమున్ గలిగించిన వారలే గదా? 95

మత్తకోకిల: మూరు రాయరగండఁ దుర్గచమూసమూహ విధాత వి
స్తార రాజ్య రమాధి నేత యితండు మీ సుకృతానఁ జే
కూరె నల్లుఁడుగాఁ దనూజకుఁ గొంగు బంగరుగా మతే
ధారుణీశుల కీ యదృష్టము దక్కె ధన్యుఁడ వీవపో! 96

గాలికనులు మావి కార్యార్థి మీమ్రోల
దోఁచ దన్న బుద్ధిఁ దొణఁక కిచటి
గారవమునఁ జీమకాలంత వెలితికిఁ
జోరవలేని త్రోవఁ జూచి పొండు!" 97

అని వ్రాసిన కమ్మను గ
త్తి నొకనిచేఁ బూన్చి గజపతి ప్రభునకుఁ బం
పిన వాఁడై మంత్రి వరుం
డనువు పడన్ బురమునకుఁ బ్రయాణంబయ్యెన్ 98

అంత మంత్రివర్యుఁ డంపిన కమ్మందు
కొని గజపతి చదువుకొని యనూన
గౌరవం బెలర్పఁ గల్యాణలగ్న ని
శ్చయముఁ జేసి బంధుజనులఁ బిలిచి 99

ఆ రాణీ వాసమున సర
సీ రుహ నేత్రలు నలుంగు శ్రీగంధము నొం
పార నిడి జలకమార్చిరి
నారీమణి పెండ్లి మొగమునన్ గళ సూపన్ 100

సకియలు నేర్పుఁబెంపున లసన్మణి భూష లలంకరింప వ
చ్చి కఱకుఁగత్తి కంజలిని జేసి వినమ్రత నగ్నిసాక్షి పూ
ర్వక విశదప్రమాణ మలరన్ దలఁబ్రాలును బోసి భర్త్రు సూ
చక మగు పుస్తెకంఠమున సంతసమొప్ప ధరించెఁ గన్యయున్ 101

బలవత్ప్రేరణ మైఁ గరాసికిఁ దలం బ్రా లొప్పఁ బోయించి నీ
తలపై నిప్పులువోసి శత్రుగత చింతాశల్యముం బాసి పై
దలపుల్ గూరిమి గ్రుమ్మరించుచుఁ బతిస్థానంబునుం జూపెఁ బోఁ
దలకొంటే పితృవాక్యపాలనకు నా తల్లీ! బహిఃప్రాణమా! 102

పోవంగఁ దలఁచుకొను నీ
భావము స్థిర పఱచు కొందువా? భద్రముగా
నా వాక్య మొందు నీ చెవి
లో వేసెద దానిని నలుపఁ బూనెదవా? 103

మానరక్షణ నిజజాతి మహితకీర్తి
యా సుధాకర తారార్కు మై రహించు
కార్యసిద్ధికి మూలవాక్యంబు గాన
ఫలము సాధించుకొని వత్తువా? కుమారి! 104

జనకుని పంపునన్ ధవుని సన్నిధిఁ జేరుము చేరి కొన్ని నా
ళ్ళనుమతిఁ దాల్మి మాలిమిఁ బ్రియంబును జూపుము చూపి సెజ్జపై
గునికిన వేళ ఖడ్గమున గుత్తుక గోయుము కోసి క్రమ్మఱన్
మనపురి కేఁగుదె మ్మిదియె మంచి యుపాయముగాఁ దలంచితిన్ 105

పగ వానికి విషమున్ ద్రా
పగ వచ్చును నమ్మకమ్ముపై నమృతంబున్
దగ నమ్మని మిత్రునిచే
దిగ ద్రావింపంగ బ్రహ్మదేవుని వశమే? 106

కుబుసమూని మిట్టాడెడి కోడెత్రాచు
కన్నుఁగానని విధమునఁ గాము కతను
మత్తుఁడై యున్న విభుని నమ్మకము మీఁదఁ
గాక సాధింప సాటి లోకమునఁ గలదె? 107

నిను పెన్నాడు సఖీజన
మునకైన రహస్య మందు ముడివిప్పితివా?
మన కొంపకు మనమే ని
ప్పును ముట్టించిన విధం బవును నా తల్లీ! 108

తాయలి కళత్ర మా తుకారా యటంచు
జగము గ్రహిమ్మిన వార్త దాచంగ వశమె?
పోవకయుఁ దప్ప దనుప నా బుద్ధి కింత
సమ్మతము లేదు లేదు; వజ్రాలమూట! 109

కడుసౌందర్యము పల్లవించి పరిపక్వంబైన నీ జవ్వనం
బడవిన్ గాచిన వెన్నె లయ్యెను గదమ్మా! లోకనిందాస్ప దుం
డౌద యుండా? కడగండ్లకాపురము పెల్లారించు కన్నీళ్ళతోఁ
గడుపంగల్గుదు వెట్లు జీవితము నా గారాబపుం గూతురా! 110

ఒంటిన్ బంపఁదలంప నీ జనని యం చూహింతువో గర్వపుం
బంటా! నీ యడుగుంజివుళ్లను గదల్పన్ గన్నప్రేమంబు నీ
వెంటన్ బ్రాణ మనస్సఖీ మణులతో విచ్చేయదే? యింతకున్
ఘుంటన్ ముంటినిదీసి వచ్చుటయె ప్రాముఖ్యంబుగా నెంచుమా! 111

కన్నీటి ముత్తెములు నీ
కు న్నే నొడిఁగట్టి పంపుకొనవలసిన ప్రాఁ
త న్నలువయె తొలి జన్మా
వ న్నుదుట లిఖించెఁ దప్పునా — నా జననీ! 112

అన్న తల్లి పల్లి లాత్మను వడఁబెట్టి
పీండుచున్న బాష్ప బిందుధార
కనుల నిండి వానగా నగుచో నొక్క
యబల పిడుగువంటి కబురు దెచ్చె 113

"విను మిది రాజకుమారీ !
జనకాజ్ఞను నత్తవారి జనపదమునకున్
జన వలయు సిద్ధ మగునది"
యన విని తల్లియును గూఁతు రదరిపడి రొగిన్ 114

వనితామణి చెలితో ని
ట్లను "సకియా ! జనకుఁడే ప్రయాణం బొనరిం
ప నిరాకరింపఁ దగునా ?
టనుటకు నా కేమి సర్వ సంసిద్ధంబే గదా ? 115

అని వచ్చిన చెలియను బం
పి నిజనివాసమునఁ జేరి మృదుశయ్యపయిన్
దనువును వ్రాలిచి దిగులునఁ
గనుమూయని దై నిశీథిఁ గడిపిన దెట్లో ! 116

ఆ మఱునాఁడు ముద్దుతనయన్ బయనం బొనరింపఁగా సువ
ర్ణా మల కాంతులీను నిలయంబున దండి ప్రవిష్టుఁ డై కుమా
రీ ! మృదు భాషణీ! వెలుపరించితి నిన్నుఁ బ్రయాణరీతి మా
లాపమును జేయబోకు మది రాజ కులంబునకున్ గళంకమౌ ! 117

భువన విజేత పేరుగల భూపతి నీ పతి తల్లిచాటు బి
డ్డవు మఱి నీవు; ప్రేమ మనుటంకముతో ననుబంధమైన మీ
కపనెడఁ బాటు సేయుటకుఁ గాంచన గర్భుని చేతగాదు; రేఁ
బవలు ప్రియానువర్తనముఁ బాయకుమమ్మ వినీతచిత్తవై 118

ఒకచో భర్త చిరాకుఁగా బలుకునేమో ! నేత్రగోళంబులన్
జికిలీ నవ్వుల పూఁత నెమ్మొగమునుం జిత్రించినన్ జాలు సా
త్వికుఁడౌ నొక్కతఱిన్ వినోదముల నవ్వింపంగ నుప్పొంగు డాం
బికమున్ జూపకు మమ్మ ! నాతులకు సాక్షీవృత్తియే లగ్గగున్ 119

చీమ చిటుక్కుమన్న నడ చింతనఁజేసి రహస్యమున్ గనుం
గో మొనగాఁడు మీ సచివ కుంజరుఁ డట్టి వివేకశాలితో
సామొనరింపగాఁ దగినజాణ త్రిలోకములందులేఁడు నీ
వేమరి యెన్నడే నవినయించితివో ! మనకొంప లారెడున్ 120

ఘనతరరాజ్ఞివై బొమిడికన్ ధరియించితి రత్నపీఠ మం
దునఁ గొలువైతి నన్న మది ధూర్తతఁ బోయెడి కీర్తికన్నఁ బా
వన మతి సత్యవాణి ప్రతిభానిధి చల్లనితల్లి యంచు నీ
జనముల నోళ్ళలో మెదలు శాశ్వత కీర్తి గడింపు మిద్ధరన్ 121

మీ జనయిత్రి హితం బి
వ్యాజవిరోధ ప్రవర్తకాంకుర మగు బి
డ్డా ! జమ సేయకు మది రా
రాజున కర్ధాంగి వెందు రావు కొఱంతల్ 122

# తుకారాం

## చతుర్థాశ్వాసము

కులసతి రాకడన్ దెలిసికొన్న నృపాగ్రణి రాయ లాత్మలో
మొలచి కలంచి చిత్తరువు ముచ్చటితో మదయాస్తమానమున్
వలపుల దొంతఱన్ బరువు వారు తలంపుల మేడ లెక్కి దృ
క్కులఁ జెలిగుంపుతో నెదురుకో లొనరించుచు నుండె సత్తతిన్ 1

బలసిన వైరి దంతి తతి ఖండన భూమి నృసింహకృష్ణ రా
యల నులివేడి యూర్పు లొలయన్ బొలయంబడు టబ్బురంబె తో
య్యలి తన జన్మభూమి సరిహద్దులు ద్రొక్కియు వీచునట్టి సౌ
ఖ్యల సుడిగాలితోడ మదిలో మదిలేక చరించు టబ్రమే? 2

అట్టి పరాకులోన సచివాగ్రణి చయ్యన వచ్చి నిల్చి మా
పట్టపురాణిగా రిటకు వచ్చుచు నున్న యుదంతలేఖయున్
ముట్టె శుభోదయం బిదియె మంచెదురుంజని తెచ్చి చల్వరా
కట్టడ మందుఁ జేర్చుటకుఁ గావలయున్ సెల వేమి భూవరా! 3

అప్పా! నీ మనమున కె
ట్లొ ప్పెదమో చేసి చెప్పు మూకొట్టెద నే
తప్పి పొరఁబడిన రేపున
తెప్పగదా? నీ హితోపదేశం బెపుడున్ 4

చలువ జాతిమేడ పల్లందనము నీదు
భర్మ హర్మ్యమందు బ్రతుకలేఁదు
నా మనోనికేతనముఁ జేర్తువా? దంప
తుల సుఖంబు లెల్లఁ దూచికొందు 5

తినఁబోవుచు రుచు లడిగెడు;
మనసు మనసుఁ బెనచి యాలుమగలకుఁ గూర్మిన్
బెనుచునది బ్రహ్మ ముడి యను
కొననగునా? కోక కోక కొనముడి యగునా? 6

సతి రూపము పతి మనసునఁ
బతి రూపము మనసునఁ బడి నిల్చినచో
మృతి యంటదు వారల దం
పతీత్వ మది యెడప నెవరి వశము నృపా! 7

పుట్టకోమ జన్మభూమిని విడి వచ్చి
బుట్టి బందిఖానఁ బెట్టఁబడియె
లక్కపూఁత మేను పుక్కిటి గరళంబు
ముద్దు పెట్టుకొన్న మూడుచావు?" 8

జనపతి మంత్రియు నివ్విధ
మున ననుకొని రెదురుఁబోవఁ బుత్తెంచిన వా
రెనసి మహోత్సవమున రా
ణి నివాసముఁ జేర్చిరి తరుణీ రత్నంబున్ 9

ఏమేమో ముచ్చట లిట
జామున కొక సకియ చెప్పసాగినను తుకా
రా మాత్ర మే జవా బీ
దేమి మనం బిందులేకనే కద చెలియా ? 10

అంతి పురానఁ జొచ్చి సగమైన ది దేమిబెడంద వచ్చునో ;
కాంతకుఁ గన్నవారి పయి గాలియె మళ్ళెనో ; కాపురంబుపై
స్వాంతము లేదొ ; భర్త సరసత్వ మెఱుంగఁడొ ; క్రొత్తతావు వృ
త్తాంతము పొలువోక బిడిదప్పి మొగం బిగురించుచున్నదో ; 11

ఆరాచూలి కదేమి కుందనపుఁ జాయం గుల్కు నా సుందరా
కారం డబ్బెఁ గవుంగలింతల నమోఘప్రేమ దాంపత్య మే
పారన్ బొంది సుఖింపనేరక మనో వ్యాధిన్ మదిన్ గుందు చి
త్తై రామొందఁగ నేల ; సోయగము ప్రాయం బెల్ల వ్యర్థంబుగాన్ 12

అరలేని మనసు గలదని
చిఱునవ్వుల జాలు మొగము సెప్పుఁగదా ? యీ
తరళాక్షి ముఖము తుమతుమ
గుఱుతున ముడుచుకొని యుంటకున్ గతమేమో ; 13

ధవుఁడు సదా ప్రాణ ధనం
బవిరళ రాజ్య రమ సవతి; యతిలోక యశో
యువతి పనికత్తె యిఁకఁ దన
కెవ రిందు పరాయులే చెలీ ; తెలుపఁగదే ? 14

పగవాని మీఁద గాలి తో
లఁగెనో ! యేమొ ! సతీలలామ మనో జా
శు గమునకున్ గుఱిగాదో !
జగతీ పతిదే యభాగ్య జాతక మగునో ! 15

కను మూసి తెరచు నట్లుం
డిన జనమును లోఁతు గల్గు నీరంబును న
మ్మిన వారల కనుభవ మీ
యనవసర ప్రశ్న మన కనర్థముఁ దెచ్చున్" 16

అనిన చెలిమాట నొక బోఁటి యందు కొనియు
మారు వచియించు నీ రాకుమారి మనసు
సిగ్గుతెర దాటి వెలికి వచ్చునది గాదు
కోఁబఱిక మన్నఁ దొలుదొల్తఁ గ్రొత్తగాదె ? 17

వనిత వివాహవేళఁ దలవాల్చును గారణ మేమి మోయఁ జా
లని బరు వేది ! సిగ్గు టలలన్ గెరలించుచుఁ బొంగు కాపు రం
బను వనధిన్ గనుంగొనిన దై దిగి యెట్లు తరించు నన్న చిం
తనయు బిడెమ్మునుం దలనుదాల్చిన భారముగాఁ దలంచెదన్ 18

తలవంచఁడు చిఱునవ్వులు
మొలకెత్తు మొగాన మీసములు దీటును సం
ధిలు సంసారమునకు పతి
కలఁగడు సతివోలెఁ బెండ్లికాలమునందున్ 19

ఇలుగడి దాటి వచ్చునపుడే వదనాంబుజ మావరింపఁ బె
ల్లలుక వివర్ణలక్షణము లాడుచునున్నవి తల్లి దండ్రి చు
మ్మల సుడిగొన్న యశ్రులఁ గుమారిలుచున్ బయనించుచందమున్
దెలిసికొనంగదమ్మ ! సుదతీమణి ధీరగభీరచిత్తముల్ ! 20

వెఱపును లజ్జయున్ వినయవృత్తి నలంకరణంబొనర్చు సు
స్థిర గుణరాశికిన్ బరణి చిప్పగదా ! మన రాచ బిడ్డ లా
హారి సరసంపుఁబల్కు లిపు డింపులుగా వని మూతఁగట్టె వా
తెఱ నిఁక వెచ్చెలీ ! పెడమదిన్ గుదిలింపకు మీ ప్రసంగముల్ 21

వెకలి తనంబునన్ విసరివేసిన నీ నుడు లన్ని బెండ్లు సా
ధకముగ రాకుమారి మది దాచిన సుఖ్ఖ ఫిరంగి గుండ్లు సా
ర్థకమగు వేళలన్ విడువదా జయమున్ గొనదా? వివాద మూ
రక మన కేల ? నాల్కజిల రచ్చకువత్తుము రాణి విన్నచో !" 22

అన విన్న మఱొక్క సఖీ
మణి నగుచు "ని దేమి క్రొత్తమాదిరి యిందున్
దనకుం దెలియదు మనమై
నను జెప్పి మదిన్ మరల్ప న్యాయంబు గదా ? 23

నిక్కము రాజవంశముననే జన నంబయి యుందునేని నా
దృక్కులతో మహీ పతి మతిన్ గరగించి తనూవిలాసమున్
జొక్కద గాక యీమగువవోలె నుసూరు మొగంబు దాల్చి మై
జిక్కని ప్రాయమున్ గసిమసిన్ జిలికించెదనే తలోదరీ ! 24

ఐన చేరువఁ జేరి యయ్యతివ మతికి
జనపతి వశహితోపదేశం బొనర్చి
చూతు మిదె" రమ్మనుచు నొకించుకయు జనువు
కల్పనముఁ జేసికొని కన్య కడకుఁ జేరి 25

"కంజదళాక్షి! మత్తగజగామిని! నీ పదదాస్యవృత్తి కే
పంజలిఁ బట్టి నిన్నుఁ గొని యాడమె నీ మధురాధరామృతం
బుం జవులూరు పల్కు విను పూజకు నోచగలేదె? యిట్టి కి
ష్కం జొరనేటికో తెలిపినన్ గృతకృత్యులమై రహింపమే? 26

పదిదినంబు లయ్యె భావపరంపరల్
పుట్టి పొంగ గుండె గట్టు దాటి
మదిర రంగు మోపి మాటునఁ దెరలలో
విచ్చి యొక్కపల్కు వినరు మమ్మ! 27

అతివా! మా చెలిగుంపు రేఁబవలు నిద్రాహారముల్ మాని నీ
బ్రతుకున్ జావులు మావిగాఁ దలఁచి పారాచేయుచున్నన్ బరి
స్థితులన్ దెల్ప విఁకేరితోఁ దెలుఁప నుద్దేశించు కొన్నావు! నీ
మతివై కల్యము చుట్టుకొన్నది గదమ్మా! మా మనశ్శాంతికిన్ 28

అచ్చము మనవారికి వెలిఁ
బుచ్చఁ దలఁపులేనిచోఁ బ్రభుపు లనుచరుల౯
బుచ్చిరి గుంపున నున్నా
రిచ్చో నవ్వారికైన నెఱిఁగింపఁగదే? 29

వారొక వార్తఁ దెచ్చి రనివార్యము గాన వచింతు నీ మన
స్తీర విహారుఁ డిందుఁ జనుదెంచు మతిన్ వెలిబుచ్చిరంట రే
పీ రక మీ వివర్ణ ముఖమే కనుగొన్నఁ దిరస్కరింపరా ;
గౌరవ హానికిన్ జొలవుగా మము నెట్టుల నుద్ధరింతువో ; 30

సీరేజ దళాలంకృతు
లూరించి మిళింద జాతి నుసికొల్పును స్త్రీ
పై రూపు తళుకు బెళుకులు
గారింపవె పురుష హృదయ కంజములఁ దమిన్ 31

కుడువవు ముడువవు నుడువవు
నడవ విచటి లలిత నందనంబులలో నె
న్నఁడు చల్లని మది మాపెం
బడిఁ బడి పెందిగులు మానుపంగల దమ్మా ; 32

నగతుఁ జొచ్చినతోడ నీ నాథుఁ డెలమి
నగవుఁ జెలువుల నీ యాననమున వెదకుఁ
గానఁ గవుగింట గ్రుచ్చి లగ్గలకు నెక్క
చిన్నెలను దాల్చి మమ్ము రక్షింపు మమ్మ ; 33

ఆ జనపాలబాల మది నారట యూరట లేని యూహలఁ
బాజునఁ జిక్కుకొన్న పురుపుంబలెఁ బ్రాణదొలంగు నుక్కతో
రాజసవృత్తికిఁ బెడపురాని శమంబు మొగానఁ దాల్చి దా
సీ ; జలదాగమంబునకుఁ జిందులుద్రొక్కఁగదా మయూరముల్ ? 34

లేచినఁ గూర్చున్నఁ గ్రియా
వాచకముల సర్వదా ప్రవర్తిత కార్యా
లోచనములఁ గనిపెట్టుచుఁ
గాచుకొనన్ దగును కన్యకన్ జెలులారా! 40

ఇటు లనుకొన్న క్రొత్త చెలు లిచ్చల నచ్చెలిపిండుతో మెలం
గుటఁ బరిచర్యలన్ ముదము గూర్చుట నెమ్మది చెమ్మలూరు ము
చ్చట లాలికించుటన్ జనువు చంకలదూఁగెఁ బరస్పరార్ద్రి హృ
త్పుటములు మాటలున్ గలసిపోయె స్వతంత్రము స్వర్గమే కదా? 41

అట్టి యనుంగు నెచ్చెలుల నందటు నెన్నక రాకుమారి లో
గు ట్టపుకప్పుతుఞ్ దొణఁకు కూర్మి తలంపులు కుప్పవోయు నా
కొట్టని ముచ్చటల్ గుబులుకొల్పు దుకూల విభూషణాళి కా
ఱట్టని రీతిమై మఱపు పై కొనుటఞ్ గని యొక్క చేడెయుఞ్ 42

నాణెపు పుత్తడిఞ్ బటిక నార్చిన క్రౌంచిగుతక్షు లీను నా
ద్డాణము చేత బట్టుకొనుటఞ్ గరవాలముగా స్ఫురింప ని
స్త్రాణ వహించి బెగ్గిలుచు సత్వరముఞ్ జనుదెంచి మంత్రితోఁ
బ్రాణము లుగ్గబట్టి ప్రభువా! తిలకింపుఁ డిదేమి చిత్రమో! 43

చూపుల కిది యొడ్డాణము
బాపరికమ్మునకు వాలు తన్వీ రత్నం
బేపాపి రక్తమును రుచి
చూపింప ధరించుకొనెనో! శోధింపఁగదే? 44

దాసివి కావు నిక్కముగ దైవ సమానవు కార్యలాభ వి
న్యాస వివేచనన్ నడచినావు; విచారనిమగ్న మానసా
యాసము దీర్చినావు ; మన యాంధ్ర మహేంద్ర మహోదయాప్తికిన్
గ్రాసము వెట్టినావు ; నను గట్టునఁ జేరిచినావు సోదరీ ; 45

దీనికి సమమగు మఱియొక
దానినిఁ జేయింతుఁ గొని యథాస్థలి ననుపం
గా నేర్తు వారు లెఱుంగఁగ
రాని విశేషము భయంకరం బిది సుమ్మీ ;" 46

అని శిల్పి నొకని బిలువం
బనిచియు వంగము గరంగి భద్రముగా వెం
డిని మించు తళ్కును బో
తను నొడ్డాణంబుఁ గల్పితం బొనరించెన్ 47

దాది కిచ్చి దీనిఁ దగు జాగరూకత
జెప్పినట్లు మదుపు జేసికొనుము;
రాణిగారి కంటిలోని పాపను దీయఁ
గలుగు నేర్పు నీకుఁ గలదు పొమ్ము ; 48

ఇదిగో ; మఱొక్కమాట మన యిర్వురిలో గల యీ రహస్య మె
ట్లెదిగి వెలారునో ! చివర కే విషమస్థితిగా ఫలించునో ;
అదను తటస్థమయ్యెడుఁ గదా ; యగుదాక మనస్సులోపలన్
బదిలము సేతువా ? మనకు బాగు; పరాకగునేని నోగగున్ ;" 49

అనుచుఁ జెప్పి దాది నంపి తిమ్మరుసయ్య
పరుగు వాఱుచున్న భావములను
దఱచు నేక తంబ; తనలోనఁ దా నిట్లు
రాజ మన్మథుండు రమణిఁ దలఁచు 50

విరహ దవానలంబునకు వేగసు నా మది వెన్నపూస మం
దిరమునఁ జేర్చి నా కఱవుదీరఁ గనుంగొని మచ్చటించి సుం
దరి కవుగింటిలో నొదుఁగు తాలిమిపట్టు దిన ప్రమాణ మీ
వఱకుఁ గతించె నింక నిలువంగలనా? తమి తాళుకొందునా? 51

చెలియలి తొంటి తమ్ములముఁ జేకొను నాఁ డరగంటి చూపుతో
బలుచదనంబుఁ బేరలుకపై విసెరం గద? యట్టి లక్షణం
బుల వల నెట్టి చిన్ని నగవున్ బులకింపులలోన బండు వె
న్నెల దులకింపఁ జంద్రముఖి నేఁడు ముఖాముఖి దర్శనమ్మిడున్ 52

తేనెలోని సీటి తెంపరితన మెంతొ!
మంత్రివర్యుఁ డాడుమాట లంత;
తాను జెప్పు వాయిదా గడవు వఱకు
వలపుఁబట్టి మేను నిలుపఁజాల 53

ఆకొనియున్న కోరమెక మా వెదురన్ విలుచుంట జూచు చెం
దాకని నోరుఁగాయు మమతన్ దలక్రిందులుగాఁ దపించు నా
కూకొన నేర్పు మంత్రి వరుఁ డుండిన లాభ మ దేమి లే కదే
మీ! కులకాంతతోఁ గలపి యిక్షు శరాసును నే జయించెదన్ 54

నా దురవస్థ చేడె కనెనా? తనపాటును నే నెఱుంగ నౌ
నా ? దవు దవ్వులున్న సదనస్థితి కల్గిన కాలమందు ని
ర్వేదము సౌఖ్యమే మనుభవింపక పెంపు దలంపు లంపటన్
ఖేదమునొంద నేటి ? కునికిన్ జెఱ బట్టి వటింప నేటికిన్ 55

ఏ సమయము నే సలహా
నీ సచివవరుఁ డిడునో గ్రహించితి నిపుడు
జ్ఞీ సరికాదని చెప్పిన
చో సమ్మతినొంద నిం దసూయన్ గొనినన్ 56

భానుని కౌఁగింటిలో నింకను గరఁగి పోవదే పశ్చిమ సంధ్యా వధూటి ?
గుములుగూడుచు గోగణము లిండ్ల కింక నంభా రవంబులఁ జనుదేర వేమి?
కువకువధ్వనులు పరవ గూండ్ల కింకను వరుదేర వేమి విహంగమములు?
నీడలు తూర్పుగా నిక్కి చింకను లోకమును ముంపఁ జీఁకట్లుఁ బెనయవేమి?

అనుచు సైరంధ్రి పొందున కాసఁ జెంది
వేగ నర్తనశాలకు వెడల మూర్ఖుఁ
గ్రుంకిపో నాత్ర పడు కీచకుఁ డదియేలా !
ఊరకూరక కనుపట్టుచున్న వాఁడు"! 57

అను తలపోతలోఁ దపనుఁ డస్తగిరిన్ దిగిపోయె నంతలో
జనపతి కృష్ణరాయలు ప్రశస్త విభూషణ వస్త్రధారియై
మణి మకుటంబు దాల్చి పటిమన్ జిగురించిన కోరమీసముల్
దెముచుచు నిల్వుటద్దమున వేషములోఁ గలవారలన్ గనున్ 58

ఆ రెయి కృష్ణరాయ వసుధాధిపుఁ డుజ్వల రాజ్ఞియౌ తుకా
రా రమణీలలామ గృహరాజమునన్ శయనింప వచ్చు చు
న్నారను శోభనోక్తి శ్రవణంబుల సోకిన రాజురాక కొ
ప్పారుచునుండు చెంగలువ లట్లు లమిన్ బరిచారికాంగనల్ 59

మా కృష్ణరాయదంపతుల జీవిత మిట్లు భాసిల్ల వలె నను వరుస దనర,
మా కృష్ణరాయదంపతుల ప్రణయ మిట్లు తీపెక్కవలె నను తీరుదోప,
మా కృష్ణరాయదంపతుల యశ మ్మిట్లు వ్యాపింపవలె నను భావమడర,
మా కృష్ణరాయదంపతుల కడుపులెన్నగా పండవలె నను కరణి నలర

ప్రమిద పంక్తుల వెల్గించి ద్రాక్ష రసము
పాత్రముల నింపి యగరు వత్తుల వెలి
గించి పరుపుపై విరు లెన్నొ కెరలఁబోసి
తీరుతీరుగ గృహసీమఁ దీర్చుకొనుచు 60

ఝుంకార రుతిని మా షట్పదుం డీనాఁడు మాధురీ నవపద్మ మధువు గ్రోలు
సుస్వరంబున మా పికస్వామి యీపూట తమిదీర నవపల్లవమును మెసవు
వలపుకై పూర మా చిలుక రా జీరోజు పక్వంపు దాడిమీ ఫలము గొట్టు
హోరానఁగూర్ప మా యగసాలె యీవేళ నవరత్న మణికి రంధ్రంబు వెట్టు"

అని నృపతి వంక చెలు లాడుకొనుచు నుండ
వినుఁడు క్రుంకుచుండఁగ నవి యెట్లు వళమొ?
పద్మ ముఖులార! యని రాణి వంక చేడె
లప్రయత్నమ్ముగా వైర మందుకొనిరి. 61

ఇరుదెగలవారు పరువంబు పరుగువారు
రాకుమారి వయసువారు జోకవారు
నొక్కరిని మించి యొకరుండ నొరయువారు
ఏ మిష దొరకిన కలహ మేల పడరు? 62

ఏమి యనినారె మీర లో యింతులార!
ఇనుఁడు క్రుంకుచుండఁగ నవి యెట్లు వశమె
యనియెకా? షట్పదాలన్న హా! హా! హా! షట్ప
దాలె? యేడ్చి నట్లుండె మీ తలల మెదడు! 63

మీరు గజపతి పరిచారికా రమణులు
కారటే? యౌను పాపము! కనఁగ మీకు
కుంభిగమనంబు గజకుంభ కుచము లుండు;
ఇంగితజ్ఞాన మెట్లుండు సృష్ట్యగతిగ? 64

మీరు కృష్ణరాట్పరిచారికా రమణులు
కారటే! యౌను పాపము! కనఁగ మీకు
కృష్ణబుద్ధులెకాని యుత్కృష్టము లెటు
దాపరిలు? యధా రాజా తధా ప్రజయగ! 65

ఇనుఁ డనిన నినుఁడే యౌనవు! నినుఁ డన నినుఁ
డా మహాత్ముఁడు క్రుంకిన నేమి యగును?
ఆయిరులలోన మీ షట్పదాదుల కొన
గూడు పెట్లుక్రోల? మెసవఁ? గొట్టఁ? బెట్ట? 66

మీ తలల నుండుసది తెల్వి మెదడు కాదు
వెఱ్ఱి చీకఁటే యో కృష్ణ వేణులార !
దాన నంతు పట్టవు మీకు ధ్వని రసాలు
అంధునకు చంద మామాయి యౌను లట్లు 67

ఓసి యెంత మదించి కూసినారే యన్న నేమె కూయక భయ మేమె యనుచు,
ఇట్టులైన నిఁక నయిన యట్టులే యన్న నేది యెట్టులైన నేమె యనుచు,
ఇవి వట్టి తెలివి తక్కువవి యిసీ! యన్న నివి వట్టితెలివితక్కువవి యనుచు,
కటకటా! యెంత రాకాసిపే యివి యన్న కట్టా! యివ్వెంత రక్కసివె యనుచు,

అలఁతి యలఁతి యా వాగ్వాద మంతకంత
కొరసి కొనికొని సిగపట్ల వఱకు వచ్చె
నిప్పు రవ్వ యెట్టెట్టులో చొప్పవామి
కంటుకొనికొని పెస మండు మంటవోలె. 68

గర్భగేహాన రాణి యెక్కడనొ యుండి
యచటి పరిచారికల కలహాగ్ని నార్ప
మెఱపుల పయోద మాలిక కరణి నొప్పి
ద్వాః కవాటముచెంతఁ బ్రత్యక్ష మగుచు. 69

రాజు రాకకుఁ బరమ నీరజములు కుము
దములు నైనా రదేలె నైజములు మాని !
రాజు రాకకుఁ బరమ నీరజ ముఖులును
కుముదనేత్రలు గాక నైజములు గలిగి. 70

"ఏమి రస మహా సామ్రాజ్య మేలుకొంటకె
వచ్చి పడ్డది మీ కింతవైర మిపుడు ?"
అని మృదులముగాఁ గినుకు చున్నంతలోన
రానెవచ్చెను శ్రీకృష్ణరాయవిభుఁడు. 71

అధిపుఁ డచటి కేతెంచిన యాక్షణంబె
పరువులెత్తి రెచ్చట నుండు వా రచటికి ?
రాజు వినువీధి కెక్క బరాబరులుగ
విచ్చిపోయెడి చీకట్ల విధము దోప ! 72

తిమ్మర సయ్యు లేని వెలితిన్ గల సంశయ మొందు దక్క వే
షమ్మన రవ్వలోటుఁ బడఁజాలని చందము లందగింప లోఁ
గుమ్మరి సారెవోలెఁ దమిగొల్పు ప్రియాంగన మేడఁ జొచ్చి ఘుం
ఘుమ్మను వాసనల్ గుబులుకొన్న గదిన్ వెలఁదిన్ గనుంగొనెన్ 73

రమణీముఖ ప్రదేశమున వ్రాలిన భూపతి చూపు లచ్చటన్
స్తిమితములై మతొక్కదెసఁ జిందవు రాచెలిచూపులో రమా
రమి దన పాద యుగ్మమున వ్రాలినదై బొటవ్రేలి వ్రాత తో
జము లొనరించి భూ సతికి సంగతు లేషా ! వచించి నట్లగున్ 74

అత్తటి నత్తెఱవ యొక స
దుత్తరమా ? దృక్కులా ? యయోమయ ముద్రా
యత్త యగుటం గనుంగొని
చిత్తము చల్లబడి రాజశేఖరుఁ డవియెన్. 75

"నీవు శాసించిన గడవు నేఁటి యుదయ
మాఱు గడియలకే పూర్తియయ్యెఁ గాదె ?
అభిలషించి న ట్లన్నియు నదను కమరి
నివ్వటిల్లె నే కొఱ లేక నీ వ్రతమ్ము ? 76

అన్నుల మిన్న యేమి టివి ? యయ్యారె నీ మెయి సోయగాలు నా
కన్నులఁ బట్టకున్నయవి; ఖస్థలి మించుల పిండు లేకమై
తిన్నగ నేఁడు మాగజపతి ప్రభు పుత్రిక మూర్తిఁ బోలి యు
త్పన్నములౌచు రావుగద ? ధాత్రికి నన్నిటు విభ్రమింపగన్ 77

లేఁ జిగురాకుమోవి గదలించి మృదూక్తి మధు స్రవంబులన్
జేఁ జెయి జంటగల్పి సుఖజీవవడోలిక లూపవేమి ? నా
తేజము నీవె ! నా ప్రణయదేవత నీవె ! సమస్త మీవె నా
యోజన లన్నిటన్ జిదిమి యుల్లముఁ జల్లనఁ జేయవే ప్రియా ! 78

పేరిమిపేరు నీ తలఁపు బీగ మొకానొక చిన్నినవ్వుతో
బోరనఁదీయవా ? రదనపుం దెలి ముత్తెము లార బోసికో
వా ? రమణీ ! యిదేమి మరియాద ! బలేపని యింటిసొమ్ముతో
బేరములాడ చూత మను బిఱ్ఱు వహించితివో వచింపవే ! 79

పాలింపందగు నీ విలోకనము లవ్యక్తంబుగా నేల పా
లేలా చేయుదు ? వొక్కసారి కనుఁ గోవే సుందరీ ! ప్రేమ వా
చాలాలిత్యపు ముద్దుముచ్చటల జూజం బాడుకో రమ్మ ! రా
వే లో లోఁదలపోతలన్ జివికి పోదే మైవిలాసం బొగన్ 80

నిరసన భావమున్ బరిగణించుట రెండవసారి యీ సమా
దరణముగా ప్రధానమునఁ దమ్ముల మిచ్చెడువేళలో నిరా
కరణ విలోకనంబులను గాంచితి జ్ఞాపక మున్నదా ? తలో
దరి ! యలనాఁటివాఁడను గదా ? మన కింకను జంకులున్నవా ? 81

గజపతిరాజు నా పసుపుఁగట్టడి వీనులఁబడ్డ యంతనే
గజగజలాడు నీ పసుపుగట్టడి కేను వడంకిపోదు; నం
బుజముఖి కెంత శౌర్య నృపపుంగవుఁడైన వశుండు పో ! యనన్
బుజావు పడెంగదే సుదతి యీ నరసింహజ సింహ గాధలో 82

సంగర రంగమందు భుజశౌర్య పరాక్రమ విక్రమోన్నతిన్
సింగమువోలెఁ బోరు నృపశేఖరుఁ డేనియు నాఁడ గాలి సో
కంగనె వెన్నరీతి కరగంగల మెత్తని చిత్త మూని పెం
పొంగర పై చరించుఁ బువుబోణినిఁ గూడి యిదేమి చిత్రమో ! 83

ఈ పూఁబానుపు లీ సువాసనలు నీ శృంగార సన్నాహ మీ
దీపజ్యోతి మదాగమ ప్రియత నిర్దేశించెడిన్ నీదు స
ల్లాపప్రేమ నిధానమానసము లౌల్యభ్రాంతిపై నుండ నా
వ్యాపారంబులు సాగునా ? మదవతీ ! పాలింపవే సమ్మతిన్ ! 84

శ్రోత్రప్రియమ్ముగాఁ జిత్రవాక్సుధల నీమోహనాకృతి గుప్పవోయునాఁడు,
తనువు పొంగులువాఱ రణభేరిమ్రోగించి నీకునై పోరుకు దూకునాఁడు
తిమ్మరుసు మనః ప్రియమ్ముగా కోటి రంభలసౌరు నీగోట పలుకునాఁడు
నటనాభటుండనై నయనోత్సవమ్ముగా వినుఁగాంచి స్వర్గమ్ము గనెడినాఁడు

స్వప్న మధురిమ వై గాసి పఱచు చిపుడు
బహు జనన పుణ్య పరిపాక ఫలమ వైతి
వోపగాలేను ననవిల్తు తూఁపు గమికి
వ్రాలిపో సఖీ! వెసఁ బూల పాన్పుపైకి! 85

నను డాయవలదంచు గినిసినానే చాన! యొదుగుచు దవుదవ్వు నుండెదేల?
తలకెక్కవలదంచు నలిగినానేయింతి! మొగమువాలుచుకొంచుఁబొలఁతు వేమి?
సరిగ నన్ బరికింప శాపమా రూపసీ! యోరనోరగఁ జూచుచుందు వేల?
నీనోటి ముత్యాలు నేలరాలునె బాల! యొక పల్కునుం బల్కకుందు వేల?

అది ప్రణయ కోపమో! వియోగాగ్ని తాప
మో! వయో రూప దీపనమ్మో! యెఱుంగ
నోపగాలేను ననవిల్తు తూఁపు గమికి
వ్రాలిపో సఖీ! వెసఁ బూల పాన్పుపైకి! 86

వినుము శ్రీకర్ణి యేవిధముగాఁ దబ్బిబ్బు పడుచున్నదో నా సువర్ణవాక్కు?
కనుము నా కెంగేలు గడగడ నెట్లు కంపిల్లుచునున్నదో బిసరుహాక్షి?
స్పృశియింపుము శిరీష మృద్వంగి! యెట్టు లార్చటిలెడినో నా యురస్థలమ్ము
ఇదియే పరీక్షింపు మెట్లు నా నెమ్మేను గరుపారెడినొ రసికావతంసి?

ఎంతగా నేను నీకొఱ కెన్ని నాళ్ళు
వేఁగిపోతినో తెలిసికో నీనివలన
నైపగాలేను ననవిల్తు తూపు గమికి
వ్రాలిపో సఖీ! వెసఁ బూల పాన్పుపైకి! 87

తొలుత నీ కెంపుజెక్కిళులం బుణుకు ముంగురులనుఁ బాపటకు నెగద్రోయ
వలెనా!
దొండపండునె యట్టులుండుండు మనెడి నీ మృదు సుధోష్ఠమునుఁ జుంబింప
వలెనా!
భరములై నీ కౌను వంగించు వక్షోరుహోద్ధతిని జక్కనొత్త వలెనా!
అవనికిఁ దిగివచ్చి న ట్లున్న నీ మించు మైతీగఁ గౌగలింపంగ వలెనా!

అత్యధమ రుచ్యరుచ్యుచి తానుచితము
లంతుఁబట్టునే యధికక్షుధాతురునకు;
సైపగాలేను ననవిల్తు తూపుగమికి
వ్రాలిపో సఖీ! వెసఁ బూలపాన్పు పైకి! 88

అగరువత్తుల నిన్ని పొగలించిరేలనే? చాలదే నీ యూర్పు సౌరభంబు?
ప్రమిద పంక్తుల నిన్ని రగిలించిరేలనే? చాలదే నీ హాస చాంద్రిలవము?
ఫలరసం బిన్ని పాత్రల నింపిరేలనే? చాలదే నీ యోష్ఠ సరస మధువు?
పరుపుపై విరు లిన్ని పడబోసి రేలనే? చాలదే నీ దేహ సౌమ్య కలన?

జ్వలన వహ్నికే నెయివోసి సంతసిలెడి
చెనటి చేటికల వివాటినమట యేల?
సైపగాలేను ననవిల్తు తూపుగమికి,
వ్రాలిపో సఖీ! వెసఁ బూల పాన్పుపైకి! 89

గొనబులగేరు నీ కుటిలకుంతల వేణిక గాఢ నీలి మం
బును గబళింప నల్దెసల మూగిన చీఁకటిలో సమస్త ధా
రణి నిదురన్ మునింగినది రా! మనమున్ శయనింత మోదృథ
స్తని! కవగొన్న చాంద్రిశశి చాడ్పున నిర్వర మొక్కమేమగా! 90

నానా రీతులుగా సతిన్ గొసరు చున్నం బల్కు బంగారమున్
మౌనంపున్ ముడి బెట్టుటన్ గని విరామం బూరుకోలేక కాం
తా ! నే నోర్వఁగఁజాల నంచు బలవంతానన్ బరీరంభ సం
ధానుండై పువుబాన్పుఁ జేరె నపు డా తన్వంగి డగ్గుత్తికన్ 91

నిక్కము స్వస్తితప్పె శయనింపుడు హాయిగ నిద్రఁజొందు నే
డొక్కదినంబు మాత్ర మెద నోపికఁ బట్టుదు రేని రేపు మీ
చక్కదనంబునన్ మునిఁగి స్నానము సేయుచు నున్న నా మనో
దృక్కులు వాక్కులున్ వలపుధీపులు త్రిక్కను గ్రుమ్మరించెదన్ 92

అమ్మధుర వచో రసమున
నమ్మతిలి మనస్సు; పూర్ణచంద్ర ముఖీ ! నా
యుమ్మదపు టూర్పు చల్లఁద
నమ్మగు పలుకేల దాచినా విందాకన్?‌ 93

స్వస్థి తప్పియున్న జాగార మేరీతి
సేయ వలయు నన్న చింత నాకు
గలుగ కున్నె హాయిగా నిద్రవోవుద
మవల రేపుమాట లరయ వచ్చు." 94

అని భార్యతో నొడంబడి
కనుగూరికె భూధవుండు; కర్మవశమునన్
తన యత్నం బీడేరిన
దని మెల్లన లేచి నిర్దయత బూనినదై. 95

గోడలకు చెప్పల్ గలవంచు గుర్తెఱుఁగని
వనజనేత్ర కెల్లెఱుకౌను కనులు నుంట;
అవసరమునకగు తీరు నధిగమించు
తిమ్మరుసు సచివత్వంబు దిరుగునగరి ? 96

మొలమొద్దాణము చేధరించినది "శంభో! శాంకరీ!" యంచు ని
శ్చలతన్ గంఠమునందుఁ బూన్చినది; హస్తాలొద్దె 'హా!హా!' ధ్వనుల్
సెలఁగన్ మంత్రి; చివుక్కునన్ నిదురలేచెన్ జేడు; - చంద్రాననన్
దిలకింపన్ శివమెత్తి పోయినది సందేహించి నిశ్చేష్టుఁడై 97

హాట మెన్నా క్షీటుఁ బూని నాయుసురు దీయంబొంచెనో యీ భయో
త్కట మృత్యాకృతి భార్య యా యిది ! యమాత్యా! లెమ్మ నా కడ్డ మీ
తుచ్చిటిలో దీని కరాసికిన్ బలియొనర్తున్ గాక ప్రాణంబు లుం
చుట దోషంబగు నంతకున్ మిగులవచ్చున్ దర్శనాకాంక్షయున్ 98

ఈ రాకాసి ముఖావలోకనము నా కేహ్యంబు గల్గించెడిన్;
కారాగారముఁ జేర్తువో! పురబహిష్కారంబుఁ గావింతువో !
దూరాగమ్య విదేశ మంపెదవొ ! తోడ్తో దీని "దాసీ" అని
షాకరుణ్యంబున గెంటు మిప్పుడె దురాచారిన్ బటాచోరినిన్. 99

ఓసి దురాత్మురాల ! యెట్టులూరెనె ? ఘోర నరాంతకక్రియా
భ్యాసము నీకుఁ జేతు లెట్టులాడెనె ? గుండియ యెట్టుచాలెనే
రాసికి మంత్రివర్యుఁడు పరాత్పరుఁడై చనకున్నఁ బ్రాణముల్
దీసిన దానవే కద ? మదిన్ బగఁ బూనుట కేమి హేతువే ? 100

విషమయమైన నీహృదయ వీధి నెదో! కసియొండు దక్క నా
విషయములోనఁ బ్రేమ ప్రభవించునె? నీవగ లన్ని నమ్మి యా
మిష మను బుద్ధి గాలమును మ్రింగినచేపకుఁ దోడుఁబోతి క
ల్విష మిటు పండె; పో మ్మనుభవింతువులే! నరరూపరాక్షసీ! 101

తను విలసదలంకారం
బునకుఁ బలే సొగసులక్కబొమ్మవు గుణ రీ
తిని పేడ బుఱ్ఱ వనవల
సినదే కద కచ్చెకొమ్మ! ఛీ! ఛీ! పొమ్మా!" 102

ఒడ్డినచేతి నట్టె సతి నోరగఁజేసి ప్రధాని భూపునిన్
గడ్డముఁ బట్టి రాజతిలకా! మనజీవితవాసరంబులే
చెడ్డవి కాన నీవు పరుషించి వడిన్ జెయిచేసికొన్నచో
గొడ్డగు గోటగిల్లునది గొడ్డటి కేటికిఁ దెచ్చుకోవలెన్? 103

ఈయమ మాత్ర మే మెఱుఁగు నే సమయం బెటు లేగుఁదెంచునో!
తోయజ గర్భదృష్టికిని దోచునె? యీ యెటుఁగాని కుట్ర యే
దాయలపల్ల నేర్చెనదో! తత్ఫలమున్ జవిఁ జూడకుండునే?
హాయిగ నుండుడీ యబలనంపెద నిప్పుడె పుట్టి నింటికిన్ 104

రాజా! లోకము గొడ్డువోయెనె? నగారాదెబ్బ వేయించి నీ
మో జేజాతి వధూటిపైఁ గలదొ! నేర్పుం బెంపునన్ దెచ్చి యా
జేజేల్ మెచ్చఁగ నీకుఁ బెండిలిని నేఁ జేయింపలేకున్న" న
ప్పాజీ "పేరున నన్ను బిల్వకుము; నీపై నొట్టు శాంతింపుమీ!" 105

అనిన నవనీళుఁ డాపల్కు నాదరించి
మౌనముద్ర ధరించి లో లోనఁ బొగులు;
గృహము వెడలించి సతిని బుట్టింటికనుపు
తరుణమున నామె సచివసత్తమునిఁ జూచి 106

"అక్కట! మంత్రివర్య! సెలవా? యెటువోయెద నొంటిజెక్క నీ
రక్కసిజన్మపై గనికరంబునకున్ గిలగింత లేదె! మీ
డొక్కను కావరాని వెగటుంబ్రతుకే యనుకొందు దీనతన్
మ్రొక్కిన చేతులన్ నఱుకఁబూనుదురే? శరణన్నఁ ద్రోతురే! 107

నాకర్మం బిటు లంటియున్ గుడుచుచున్నా నైన కానిండు ఆ
రాకా చంద్ర సమానుదేహమున నర్ధంబిద్ది కాదా? మదే
కాకిత్వ వ్యధ లోపలన్ దనకు భాగం బేమి లేదా? దయా
లోకక్షాంతికి మించిపోయినదె నాలోపంబు మంత్రీశ్వరా? 108

తండ్రీ! నాకు శరణ్యదేవుఁడవు వాత్సల్యాబ్ధివే! నీదు కూ
తుంద్రన్ నేనొక కూఁతురన్ సయిపవే దోషంబు జాగుండెయా
తీంద్రంబౌ పతి కిన్కమాన్ప వెఱపేదీలేదె? పుష్పైర్యశ
మ్మంద్రిశ్లే లయమైతినేనిఁ దమ "కాదా" యేమిలోకంబునన్? 109

నా కింకన్ సుఖ మిమ్మహిన్ గలుగఁబోనా? రాజకంఠీరవా
స్తోకప్రాపక మారినన్ బరమనుష్యం డాదుకోఁ జాలునా?
కాకింగొట్టియు గ్రద్ద కీ దలఁచువంకన్ మీరు గాదన్నచోఁ
దాకొందున్ నుయినో! తటాకమునో! దాక్షిణ్యపాథోనిధీ! 110

నీవై త్రిప్పుచునున్న బొంగరము తండ్రీ! భూమి పాలాత్మ నా
లావాదేవికి నొక్క-త్రిప్పిటు మరల్పంజాలవా? అందుపై
తావిశ్వేసియుఁ జూచుకొం డిదె మదంతర్బుద్ధి భావంబు లం
దే వా రున్నను దగ్గబుద్ధిఁ జెపు డింతే వేయు నిం కేటికిన్?" 111

అనుచు నమాత్యశేఖరుని హస్తపుదొన్నియనిండ బాష్పకం
కణముల జాలుతోఁ గరుడు కట్టిన గుండె కరంగిపోసి చూ
పిన సతిమారుబుద్ధికిఁ దపించిన మంత్రికి నోరురాక మె
ల్లన "జననీ! పురాకృత ఫల మ్మనుభూతికి రాక తప్పునే? 112

కుర్రింకె నృపాలుతాల్మి శనిగొన్న దినంబులు నీయెదానఁ బూ
ర్ణాంకములయ్యె జంట విరియంబడిపోయిన మానసంబులన్
లంకెకు వచ్చునా? పలుకలన్ జిగురంటున? నా ప్రబోధ మీ
శంకల వల్లఁ జెల్లదు వెసన్ బయనించుటె మేలు తల్లిరో!" 113

ఆవచనంబులా సతి కనాదరణీయములై కలంచ తం
డ్రీ! వలదందురా? యనుచు నేడ్చెశిలల్ ద్రవియించిపోవ; ముం
దొర్వను వెంబడించువెలఁదుల్ పరివారము పల్లకీల వా
రావల నీవలన్ జన మహాటవిలో డిగె నర్ధయామినిన్ 114

# తుకారా

## పంచమాశ్వాసము



అది ప్రతి పద దుష్ట మృగా
స్పదము భయదవనము; చావువంటి మగతలో
నొదిగినది ప్రకృతి చీకటు
లెదిగిన గాంధారవేళ నింతి కలంతన్ 1

"అకటా! చేతికి నందివచ్చు పతిగాఢాలింగ నానంద పా
త్రికఁ జేసేతుల విచ్చగొట్టుకొని భ్రాంతిన్ ఘోరపాపమ్ము సేఁ
తకునై పొల్పడి "ఖూని కో" రనెడి నిందన్ నెత్తిపైఁబూని యే
మొకమై చూతును తల్లిదండ్రి, బలగంబున్ మానహీనస్థితిన్? 2

పేర్మిమానవంబు బొబ్బిలు మోము దమ్మిపై వ్రాలుచూపులతేంట్లు వదలిరావు,
నగువెన్నెలను తందనాలాడు నెరనున్న యాశాచకోరికా లాడిరాదు,
మతి పంజరమున కామిత ఫలస్వాదనా రతిఁ జొక్కు ప్రాణకీరంబురాదు
సౌందర్యసరసిలోఁ జవుకళించుచు నీదు మానసహంసమై మఱచిరాదు

సుందరాకార! సేవకుఁ జొఱవదగిన
మంచివానిని నేరి హర్షించి పట్టి
త్యక్కు నాపాలవదలుట ధర్మమగునె?
జీవయాత్రకు నడయాడు త్రోవ యేది? 3

నా దురదృష్ట జాతకమునన్ బయికొన్న దరిద్రదేవితో
లేదుగదా సుఖానుభవలేశము తావకపాదపద్మ సే
వా దరణీయ భాగ్యదశలం దొక దాసినిగా గణించుకో
రా దని పించు నీపతితు రా లెటు పోవలె? హా! మనోహరా! 4

అనఘా! ద్రోహి నయోగ్యురాల నతినిందాబద్ధ నిక్కంబె! చె
ల్లని బంగా రగసాలివానికడ లీలన్ జెల్ల కెచ్చోటఁ జె
ల్లును? పోనిమ్మను తాలిమిన్ జొదుగు పల్కుంబైర నా మీఁద వీ
చినఁజాలున్ జిగిపాప్రియమున్ బిడిచి నిన్ జింతింతు దీపార్చనన్! 5

చంపకషట్పదంబులకు సారము జాఱని వైరమట్టు లీ
జంపతి కూరుములే మనకుఁ జాలని రోజులవల్ల డొల్లె నన్
జంపిన సాకినన్ దనువు సర్వము మీ మయమైన దాననై
తెంపున నిందు నే నడుగుదీసి మఱెచ్చటఁ బో ననాధగాన్? 6

గహన ప్రదేశ దీర్ఘలతా నికుంజ వృక్షచ్ఛాయలును నివాసములు గాగ
వికృత భల్లూక మత్తకరీంద్ర సింహశార్దూల జాలములు బంధువులు గాగ
వెదురుప్రాలును బహువిధ ఫల కందమూలములు కమ్మని భోజనములు గాగ
ఎద ముంచుకొని చెక్కుచెదరని నీరూపు దలఁపులు జపతపమ్ములును గాగ

విశ్వము నుతించు నీ వీర విజయ కథలు
కృతులు గాఁ బాడు కొనుచు నా వెతల బరువు
బ్రతుకు సాగించి తుద కీయభాగ్యతనువు
కాన కెరయిత్తు! నరకాగ్ని కౌఁగలింతు!" 7

అనుచుఁ గన్నీటఁ దేరఁబోసిన క్షమాప
ణము నెఱింగించు నట్లుత్తరము లిఖించి
కువల యాదేపి నిదుర మేల్కొనక మున్న
భర్తృ సన్నిధి కంపించె భటునిచేత  8

మన్నన సేయబోవఁడు సుమా! పలినన్నను సంశయంబునన్
గన్నుల నీరు నింపుకొను గంపిలు కంపిత కంఠియౌచు నే
డప్పు న్నికటస్థలింగల మడుంగుల బ్రుంగుట కుద్యమించు నా
పన్నుల కెప్పుడున్ వెఱపు పాటులు తొందర పాటులే గదా? 9

చేసిన యఘంబు హృదిరేగి జీల్చుచుండఁ 
దనువు బాయంగ దొరకొను తనను నెవరొ! 
పెనుతుఫానుకు మలగనుండిన ప్రమిదను
హస్తముల బట్టి వెలిగించునట్లు తోప  10

అమరార్ఘాకృతి నుజ్వలించుచు నయోధ్యాంతః పురస్వర్ణ సౌ
ధములం దుండి సతీవియోగమున కాంతారంబులన్ గుందు నా
యమితార్తిన్ శ్రుతి గల్పుకొందు వెవరమ్మా! నీవు,? నాథాను రా
గ మనఃపాత్రఁ బగల్చుకోవుగద కిన్కన్ నీవు నాకుం బలెన్? 11

నా కందామర మూసినన్ దెఱచినన్ దైన్యంబు దివ్యాకృతిన్
గైకొన్నట్లు జ్వలించి నన్నినుము నాకర్షించు సూదంటుగా
నాకర్షించి కృపన్ వెలార్తు వెవరమ్మా! నీవు,? నీదర్శన
స్వీకారంబున నా కవుంగిఁటికి పొల్చెఁ గోటికైలాసముల్ 12

పర్తిత్యేకంబుగ నీ విషాదకథయే రామాయణంబంతగా
నత్యంతాయత మై లిఖింపను శ్రమంబై యుండి వాల్మీకి సా
హిత్యాంభోనిధి యెత్తుకో డయిన నేమీ ? డాగఁబోవద్దియా
దిత్యేందు ద్వయి యెవ్వరెత్తుకొన ద్యోతించున్ దివారాత్రముల్ ? 13

పురినైనన్ గిరినైన నీకు గల ముప్వుర్ తోడుకోడండ్రు నె
వ్వరి ప్రాణేశులచెంత వారు జతగా వాసించుచుండంగ నొం
టరివై స్త్రీలచరిత్రవాటిఁ బడియున్ నాల్గేండ్లు దివ్యత్వమున్
విరఁబూయించిన నీకు స్వాగతము దేవీ ! యూర్మిళాంబా, సతీ ! 14

కుల గర్వాంధపు మత్తు నా జనని వాకుం ద్రావ మద్రిక్తనై
వలపుంబాస్పున కేగుదెంచిన మనఃప్రాణేశ్వరున్ గృష్ణ రా
యల ఘూజానినిఁ ద్రెంపఁబూని పరమోద్య జ్జీవితార్థంబునేఁ
దెలియన్ నేరక పోయితిన్ ! బ్రతుకు మాధ్వీకంబు గోల్పోయితిన్ ! 15

జేకొట్టన్ జనకావనీంద్రు నగరిన్ శ్రీలక్ష్మణ స్వామితో
నీకుం బెండిలి యైన దైన దనుమాటేకాని యేమైన ద
మ్మా ! కాయం బొకటౌట కెయ్యది ? యయోధ్యన్ జేరుకొన్నంతనే
యా కైకేయి మిషన్ వియోగమె గదమ్మా ! నీకు నీభర్తకున్ ? 16

దశరథక్ష్మా భర్త వకుఁ డౌచుఁ గైకేయి కెపుడో వరద్వయి నిచ్చు టేమి ?
తీర నా ద్వంద్వంబు శ్రీరామ పట్టాభిషేక మపు డభిలషించు టేమి ?
పదు నాలుగేండ్లపై పట్టాభిరామయ్య కానలందేయుంట గలుగు టేమి ?
నీ నాథునకు జానకీనాథునకు నంత యురుగాఢ సౌదర్య ముండు టేమి ?

నెలఁత మిన్నవు నినుబాసి నీ ప్రియేశుఁ
డన్న వెంబడిఁ గానల కరుగుటేమి ?
అమ్మ యూర్మిళా ! యెల్ల రామాయణంబు
పుట్టె కాఁబోలు నీ పుట్టి మునుఁగుకొఱకె ! 17

చెఱకుతుంటలు వట్టి చెఱకుతుంటలెగాని నీకడ మరువిల్లు గాకపోయె
గండుతేంటులు వట్టి గండుతేంటులె గాని నీకడ మరునారి గాకపోయె
ఐదుపువ్వులు వట్టి యైదు పువ్వులె గాని నీకడ మరుశరాల్ గాక పోయె
పిల్లతెమ్మెర వట్టి పిల్ల తెమ్మెరె గాని నీకడ మరుతేజి గాకపోయె

శుకపికములు నిరర్థక శుకపికములె
గాని నీకడ మరుదండు గాకపోయె
నెంత నిగ్రహాధికశక్తి ! యెంత నియమ !
మెంత దృఢదీక్ష నీలోన నెసఁగె నమ్మ ! 18

నిను వెతలు పెట్ట నతనుఁ డతనుఁడె గాని
లోకముల నేఁచు రతిరాజు గాకపోయె
నగునగును ! ముంటి వాడిమి యరటి యాకు
మీఁద నగుగాని వజ్రంబు మీఁద నగునె ? 19

ఇందుండు నిఁను వేప నెంతగాఁ మండెనో ! సతతమ్ము నొకభాతి బ్రతుకఁబోడుఁ
కంతుండు నినువంప నెంతగాఁ దివిరెనో ! శిరమెత్తుకొని యెందుఁ దిరుగఁబోడు
ఋతురాజు నినునేఁచ నెంతగా మసలెనో నెల లన్నిటను గూడి నిలువఁబోడు
గంధవహుం డెంతగా నిన్ను వెతపెట్ట మలసెనో ! మైఁదాల్చి కులకఁబోడు

దొరకె నదనంచు సౌగాము లరయకుండ
ననదులను గాసి పఱుపంగ నతిశయించు
నెంత లెంతలు వారైన నేమి తల్లి !
యనుభవింపక పోదురే యఘ ఫలంబు ? 20

నీతారుణ్య వయోవిలాస మధురస్నేహంబులన్ బాసి యా
సీతారాములవెంటఁ గాఱడవులన్ జేర్కొన్న ప్రాణేశుపైఁ
జేతంబెట్టుల నుగ్గపట్టితొ ! మృగాక్షీ ! హైందవోద్యన్మహా
పాతివ్రత్యము నీ పవిత్ర చరితన్ భాసిల్లె నూత్నచ్ఛవిన్ 21

నీ ముద్దు జాబిల్లి నెమ్మోము సుధలూరి యేవెన్నెలలఁ గురియించినదియొ !
నీ తళ్కు కనుచూపు నిశ్చలంబుగ నిల్చి యే ధైర్యమును సృజియించినదియొ !
నీ తేనె కెమ్మోవి నెనరుల దీర్ఘాని యేమోదముల ధ్వనియించినదియొ !
నీ మెత్తని పదాల నెత్తమ్మి పారాణి యేశుభంబుల వచియించినదియొ !

తాను విపినాల కన్నతోఁ దరలిపోవఁ
గాలు గదపను నీవంకఁ గాంచునపుడు
ఏ విశేషమో ! పదునాలుగేండ్ల వఱకు
నిలు మొఁగముగాఁడు ! నీజోలి నెత్తుకొనఁడు ! 22

నిను సౌందర్య సుధా నిధానమును రాజ్ఞీరత్నమున్ నిండు జ
వ్వనినిన్ గాదని యన్నవెంటఁ బడిపోవన్ లక్ష్మణస్వామి ని
న్ననుకంపన్ గనఁడా ? రసప్రియుఁడు గాఁడా ? యేమి టీ లక్ష్య మిం
దున నేవో నిగమాంత సూక్తిసుధ లుండున్ ధాత్రి కుద్బోధమై ! 23

జనకాజ్ఞా పరిపాలనా యశము సంస్థాపింప నై చేతి కం
దిన సామ్రాజ్యమునే త్యజించి యనుఁగున్ దేవేరి వెన్నాడఁ జ
య్యన నుగ్రాటవిఁ బట్టురామునకుఁ దోడై పోవ నీ బావక
న్నను బెక్కాకులు నెక్కుడే చదివె నీనాథుండు సామాన్యుఁడే ! 24

కలఁతన్ నిన్ను గృహంబునన్ దన వియోగజ్వాలలన్ గాఁచి ని
న్నలరుం బోండ్ల పతివ్రతామణిగ నీకై క్రాగి భర్త్రవ్రితో
జ్వాల రత్నంబుగఁ దా రహించెఁ దెగ త్రావన్ దేంట్ల ముల్ పోట్ల తి
ప్పలకున్ సైచినఁ గాక యూరకయె లభ్యంబౌనె క్రొందేనియల్ ? 25

ఆ కప్యగ్రణి చూపు భూషణ చయం బానోదరుల్ సూచు కొం
చీ తాలంచెలు రెండు మా వదినెవే ? - యీ దండ లీ కమ్మ్ర ? - లే
మో ! కట్టా ! యది యేమి ? - యామె చరణాంభోజంబులన్ గాక నే
నేకాలంబున గాన నన్యమనె తల్లీ ! యెట్టి సౌశీల్యమే ? 26

అది పెన్ రక్కసి కామరూపిణి యభీష్టాంగాకృతిన్ దీరు నా
డుది ముస్తాబయి కానలో వలపు నీటున్ గోటు లూరింప నె
మ్మదిగా దానికి దగ్గ శాస్తి పొనరింపన్ గల్గెనే గాని నె
మ్మది నొక్కింత తొణంక నీఁడు భవదాత్మస్వామి ధీధార్ఢ్యమున్ 27

పదునాల్గేడులు చన్న పిఁదటయినన్ బ్రాణేశ్వరుం డేఁగు దెం
చు దయోత్సాహములొప్ప నేలుకొను నన్ జొక్కంపు ధైర్యంబునన్
బ్రదుకన్ జాలితి! వెట్లు నావిభుఁడు నన్ బాలించు నన్ నమ్మికన్
బ్రదుకన్ జాలుదు నమ్మ ! లక్ష్మణ కళత్రా ! భర్తృశూన్యాత్మనై 28

భ్రాతృ భక్తికి లక్ష్మణ ప్రభు వరుండు
భర్తృ భక్తికి నీవునుఁ బాత్రలౌని
యెంత ధృతిఁ బ్రదర్శించితిరే సవిత్రి !
ప్రథిత హైందవ జీవిత రంగ మందు ? 29

ఒడయం డెన్నటికేని నన్నుగన నుద్యోగించనీ ! ముంచనీ !
యడవిం గాసిన వెన్నెలై పడుచు ప్రాయం బంత యుజ్జీంకనీ !
యొడలిన్ బ్రాణము లుండు నంత పఱ కెట్లో వానికై నిల్చి నీ
యడుగున్ జాడలలో జరించుచు లయంబై పోదు నీ గాథలో." 30

అని యూర్మిళా సతీమణి
ఘనతకు నెనగా వనులఁ దుకారా రాజ్ఞీ
మణి పతి నర్చించుకొనుచు
మనఁ దలఁచె సుసాధ్వి కది సమంజసమె కదా ? 31

కదుకొని ప్రాగ్దిశాంగన ముఖంబున నెఱ్ఱని చీరె కప్పునున్
జిదిమి దివేశు డం దధివసించె నవాంబుజ హాస చంద్రికా
స్పద వదనంబుఁ జూపె ధర; శయ్యకునుఱ్ఱా దను నప్పగించి త
న్మద గజ గామినీ గమన మానసుఁడౌ నృపుఁ జేరె మంత్రియుఱ్ఱా 32

కునుకు భారంబు నం దేరు కొన్న నేత్ర
జలజముల విచ్చి సన్నిధి సచివుని గని
ఏమి సంగతు లప్పా ! సతీమణి విష
యమ్మెఱింగింపు మనిన నిట్లనియె మంత్రి 33

"భూపవరేణ్యః మీపలుకు బోణిమిలో గురిగింజ వారవో
సైప గలాడనాః పడగఁ జాచిన మృత్యు ఫణి ప్రమాదమున్
రూపడగించితిఁ బలువురుం బలురీతుల మచ్చటించు నిం
దా పయశంబులఁ గడపి యాయువు మీ కొనగూర్ప జాలితిఁ 34

అది యొడ్డాణముగాఁ దలంచితిరొ కొదండీః కృపాణంబుగా
బొదగఁ జాలిన శిల్పి నేర్పరి తనంబుఁ మెచ్చగా వచ్చు న
య్యది యెట్లో మనదాదిచేతికిని లభ్యంబౌటచేఁ జూచి నే
ర్పుదలిర్పఁ బ్రతి సృష్టిఁజేసి కపటద్రోహంబుఁ బోఁ ద్రోసితిఁ. 35

ఈ కపట క్రియా విషయ మించుక నే ననుమాన బుద్ధి పైఁ
దాఁకొని వేచి యుంటి వనితామణి చేకొని గొంతుకోతకుఁ
డీకొనె నంత నే నురవడిఁ జనుదెంచియు నడ్డగించి నా
నాకటు కృత్య మోచనమునందు నినుఁ బొడగంటి భూవరాః 36

ఈవిషయం బొకఁడే తమ
కావంతయు దెల్పకే స్వయముగా నిట్లున్
గావించితి దోషం బను
కోవాః ధన్యుఁడ క్షమింపఁ గోరితి నధిపాః" 37

"అప్పాః యిట్టి యనేక కష్టముల నవ్యాజాను రాగంబు పైఁ
జిప్పిల్లన్ మది కోటగాఁ బెనిచి గ స్తీ చేయు నిద్దంపు కన్
తెప్పన్ పాఁపు టుయాల నూచెద వయారేః యెన్ని జన్మాల కీ
ఋప్పున్ దీర్చుకొనన్ గలాడను శరణ్యాః జ్ఞాన సంపన్నిధీః 38

షోనీ లె మ్మది యొక్క పీడకల నీ పుణ్యంబు రేపెట్టకే
మానుంబుండును బ్రహ్మ కల్పన మసామాన్యంబు కన్గొంటె పూ
మేనిన్ బచ్చి కసాయి గుండె కతకంబెట్టెన్ సరే! యింతకా
టానన్ నామెడ కంట గట్టె గద? సంసారం బసారంబుగన్ 39

వినిచిన దీరునా? యనుభవింపక కర్మమటంచు మంత్రితో
నను సమయాన రా నెలఁత యంపిన బం టరుదెంచి లేఖ ని
చ్చినఁ గొని మెల్లగా జదివి సిగ్గు వితాకు నటించు మోము వం
చిన నృపవర్యునిన్ సచివశేఖరుఁ డేమని ప్రశ్న సేయఁగన్. 40

జా బొసంగి యే జవా బీయఁ డారాజు
చదువు సచివుఁ డౌడుఁ జప్పరించు
మధ్య రెండు మతులు మాటు మణఁగి వెండి
సముఖ దర్శనమున సంధిగొనియె 41

వింతన్ గొల్పెడు దత్సతీమణి నిజాభిప్రాయమా? యక్షరాల్
బంతిన్ గూరుపు బాష్పధారల మషీ పంకానఁ జిత్రించి న
ట్లింతుంబట్టు మనస్సు మారుపడెనౌనా? పూర్వకాపట్యపున్
దంతుంబోదుగదా? కనుంగొను మమాత్యా! లేఖ సందర్భముల్ 42

శిలపైఁ బాము, నభంబునఁ
బులుఁగు, జలంబులను మీను, పువుబోఁడి తలం
పులుఁ జన్న జాడ లెఱుఁగుట
వలవ కయినఁ దలకుమించి నట్టి పని కదా? 43

షడపతి కెంతలో మనసు మాఱెఁ దనంతటఁ దా దలంపునన్
బొడిచిన దౌష్ట్య మేని వగపుం గుదిలించు క్షమాపణ స్పృహన్
బదనగు నెమ్మొగంబు పద పద్మములంటఁగ ళ్లేఖతోడ నం
పఁదలఁచునా ? వివేక పటిమన్ గనుగొమ్ము "నిజానిజమ్ములన్''. 44

పగమదిలోనఁ బూని ననుఁ బ్రాణము దీఁ దలకొన్న నాతిపై
దగిలిన ప్రేమ పాశములు దాల్మిని ముప్పురిగొన్నవై మతిన్
దెగవు గదయ్య ! యెప్పగిది తెంపు వహించియుఁ ద్రెంచుకొందునో !
భగవ దనంత కల్పిత నిబంధన మె ట్లొన గూడ నున్నదో ! 45

నిజము వధార్హ చంప జననింద వ్యధాతులుఁ దౌను తంద్రి ది
గ్విజయ నయప్రసిద్ధ నిధికిన్ జలనంబు విపన్న దేవతా
కుజ బిరుదా ప్రతిష్ఠ యని కొంతమనంబున శంశయించి యా
గజగమనన్ ద్యజించితిని గాని మరల్ దెగ వేమిసేయుదున్ ?" 46

అను భూపాలు ప్రియా మతానుమత రాగావేశ సంభాషణం
బును మంత్రీశ్వరుఁ డాలకించి సతి తెంపున్ జేయ కాపన్మహాం
బు నిధిన్ మున్గియు జేయు మొఱ్ఱ విను చామోదించి చేయందుకో
జను మీమాటకుఁ గాదనం గలనె ? రాజా ! యేల సందేహముల్ ? 47

అబల క్షమార్హ దోష గళితాత్మ పదానత యంతరాహిత
ప్రబల విషాద సాధుగుణ భాజనగాఁ దలపోయు చిత్త మం
దుబుకు దయాసహాయ వినియోగ కృతం బది పుణ్యసాధ కం
బు బహుళ కీర్తిదంబయిన పోకడలో వెనుకంజ యొప్పునే ? 48

అనిన యమాత్యవర్యు హృదయాశయ మాన్నృపుఁ డాకళించి స
న్మణులు పసిండి వెండి రతనాలు కొటారులు చీల్చి గోనె లం
దునిచి బిగించియున్ బొలఁతి యున్న యరణ్యము జేరఁబంపె న
మ్మిన నెఱబంట్లచేత వెలమిన్ బిగురించిన నెమ్మనమ్ముతో ! 49

తనభృత్యుం డట చన్నత్రోవ బడి యంతర్భావమున్ దూర ద
ర్శినులై సాగ విలోకముల్ బఱపి రాజీవాక్షి నిట్టూర్పు పె
చ్చనలన్ గ్రాగిన యశ్రులన్ మడని వక్షఃపీఠి ముద్రించుచున్
గనిపెట్టున్ బొలిమేర పెట్టు ధరణీనాథాను కంపస్పృహన్ 50

ఆలస్యంబున కేమి కారణము ? గమ్యస్థానమున్ జేరి నా
దో లేదో ! దయితుండు లేఖను గొనండో ! కొన్నచోఁ జించి తూ
ర్పాఱంబట్టునో ! బేధభావమున గోపంబూని దండించునో !
కాలున్ గన్నులు నొచ్చి సేవకుఁడు మార్గక్రాంతుడై తూలెనో ! 51

నాదోషంబు మనంబునన్ దెమలుచున్నన్ మింటి మధ్యంపు గ్రీ
ష్మాదిత్యుండవునో ! క్షమాపణ విధేయ ప్రార్థనాక్రంద మా
మోదింపన్ గనకున్నె ? తాఁ గనికరంబున్ జూపఁ డే నింక నా
కోదా ర్పెక్కడి? దింతకా మనసులో నుద్దేశ మెట్లున్నదో ! 52

చరణాబ్జంబుల నశ్రుబిందువులఁ బ్రక్షాళించి గర్భంబునన్
శిరమున్ దూర్చితి చేతులెత్తి శరణంటన్ గాని నావంకకున్
వరి ముల్లంత కృపాకటాక్ష మొరిగింపన్ బూనఁ డామంత్రి యి
త్తఱి నన్నున్ గరుణించి యాయనకుఁ బ్రోత్సాహంబుఁ గల్పించునా ? 53

నన్నోమన్ దలపోఁత లా మతులలోనం బుట్టునే పుట్ట! పా
పన్నత్రాణ పరాయణంబయిన దైవప్రేరణన్ బ్రేమ ము
త్పన్నంబై చనకున్న నాపెసను సర్వప్రాణ భక్షుండు లే
కున్నాడా? తను వప్పగించుటకు నుద్యోగింప శంకింతునా? 54

సందేహ డోలికల ని
ట్లుం దూగుచు మార్గమున్ విలోకించుచు నుం
డం దయితుఁ డింపు బలగము
సందడి విని సతియు పరవశంవద మతియై 55

ఏ పనిమీఁద నుంటివో! మహేశ్వర! మాటయు మంతిలేదు నా
పాపము పండి జీవిత శుభ ప్రద సౌఖ్యము లంతరించి పో
రాప యశో వ్యథా కలితనై దెసమాలిన యీయనాథ కీ
వే పగవాడవైన పరు లెవ్వరు చుట్టము లీ జగంబునన్? 56

వనసీమన్ కడగండ్ల మారి బ్రతుకై ప్రాణంబు వేగించు నీ
యనదన్ జంపఁగ నేన కావలయునా! యావజ్జగజ్జాల జీ
వన సంత్రాణ కటాక్ష వీక్షణము లాపన్ జూచినన్ జావనా?
ముని హృల్లోల! పరం పదార్థ మగునో మున్ నేడ పండించితే? 57

విసమరిగించుకొన్న దొరవే ఫణిభూషణ! న న్నమాంతమున్
మెసవెడు కర్మమున్ గమిచి మ్రింగి విముక్తను సేయవా? శ్రమన్
దసలిన నాదు కట్టుసురు దక్కని మ్రొక్కుల నిన్ను మాటికిన్
గొసరిన లాభ ముండ దిదిగో! మొడమీదికి వచ్చె మృత్యువై 58

సేనకు ముందు వా డెవఁడు? సేవకుఁడా? యతఁడే! పరాయి వా
రీ నెల వే మెఱుంగుదు రనేకులుగాఁ జనుదెంచుకార్య మే
మౌనొ! గమించుచంద మభమా? శుభమా? భగవత్పదాంబుజ
ధ్యాన పరత్వజీవనము దక్కఁగదా? శ్రీమలావరించినన్ 59

సతి యధైర్య భీతి సందేహముల నిట్లు
చింత సేయు నంత సేవకుండు
దండు విడచి ముందుఁ ద్వరవచ్చుటను గాంచి
పుట్టెడాస నెదురు వోయి పలుకు 60

నాయన సేవకా! బడలినావు గదా? సుఖమా నృపాలుఁ డే
మాయెను లేఖ? అందుకొనెనా? పరిశీలనతోఁ బఠించి నా
డా? యపుడా ప్రధాని గలడా? విని యేమనె? వేగఁ జెప్పుమా!
కాయయ? పండ? యేమి యొడిగట్టి దయానిధి పంపె నిన్నిటుల్?" 61

అనినన్ రాజసతీమణి
ఘన పరిచయ భాషణములు కలిగిన స్వేచ్ఛన్
జనుపు దనరార చారుఁడు
జనయిత్రీ! యనుచు నిట్లు సంగతి వినిచెన్ 62

ప్రిణుతు లొనర్తు భూపతి సురక్షితుఁ డిచ్చిన కమ్మఁ జూచి యే
మను కొనెనో! మనోగతము నందలి నిక్కముఁ జెప్పలేను కా
ని నెనరు పొంగి తేరు నవనీతము వంటిది బుద్ధి కానిచో
కనకపురాశి నీకొఱకు గట్టియు బంపడుగా బలంబుతో 63

సరకారిష్టము సరి! యని
శిరమూచుట కష్టమా? సచివ్పుఁ డే కడుపు
బ్బరపుం బల్కులు నిన్నున్
గుఱిచి వచింపండు ధర్మ గుణగణుఁ డమ్మా! 64

అనిన దన్వంగి యాణి ముత్యాలమాల
యొకటి ప్రమదాక్షు మాలతో నొసఁగి యతని
నంపి సేనకు నాతిథ్య మాచరించి
ధనము గుప్తము సేయించి తలఁచునిట్లు 65

ధనమున కన్న నా హృదయ తల్ప గత ప్రణయాధి నాథు మ
న్నన నభిమానమున్ బడసినాను గదా? యిఁక ధన్యనైతి ని
ర్జన వనరాజమా విబుధ రాజ పురీ కమనీయభాగ్య భా
జన మగుఁగాక! పుణ్య జన సౌఖ్య కరంబగుఁగాక యీపయిన్! 66

ధరణిప వశ్యభోగ పరతన్ భ్రమఁజెంది తనర్చునట్టి నం
బరమొక నాటికిన్ ధరణి పాలొనరించెడు మృత్యుధాటికిన్
దొరకని కీర్తిచంద్రికలతో సరసీతట కూపదేవ మం
దిర రచనా సమగ్ర సుకృతిన్ జిరజీవినిగా రహించెదన్! 67

జనని హితోపదేశ కలుషక్రియ మూలమునన్ వియోగ దుః
ఖ నరక కూపమున్ జొరవఁగన్న ననున్ దిలకించి యీ విమో
చన ధనరూపమెత్తి యిటఁ జన్నది నా విభుఁడా? విపజ్జ నా
వనుఁడ? స్వతంత్ర మిర్వుర కవశ్యము రాఁదగి యున్నదే గదా? 68

కాన నిర్వైరకు ముఖాముఖీ దర్శన
భాగ్య మొదవు నంతవఱకు బ్రహ్మ
చర్యమూని పుణ్యకార్యంబు లిక్కాన
నిర్వహింతు ననుచు నెలఁత కడఁగి 69

పరిజనుల నాహ్వానించు పరమ వదాన్య తా ర్భాటంబునకుఁ దీరుబాటు లేదు
ఆకొన్న కడుపుల కాహార మిడుట కెత్తిన చేయి మఱల దించినది లేదు
పనికి మాలిన గడ్డపాఱయు వెండి నాణ్యాలసొనకుఁ బ్రాలుమాల లేదు
నల్లబండలకు నున్నని ముద్దు గల్పించు సుత్తెకు నొకరోజు క్రొత్త లేదు

కాననం బేమి? యీవింత గాంచు టేమి?
ఆహాహా! యంచు నా సహస్రాక్షుఁడు గని
తత్తరము నొందగాఁ బెక్కు తరంగతులను
దీర్చి కట్టించె పురము నా దేవికరము! 70

ఆమె కాల్మెట్టిన విశేష మేమొ! యింద్ర
పట్టణం బైన దా వనీ ప్రాంత మంత!
ఆ వనీ ప్రాంత మహిమా ప్రభావ మేమొ!
వాణివాస నవ్యేందిర యైన దామె! 71

ఒక్కొక్క యింటి కొక్కొక్క పాడి పశువు నింటి కైదెకరాల నిల యమర్చి
వైద్య సౌకర్యంబు విద్యావకాశంబు లెల్లర కంద సమృద్ధి పఱచి
స్వార్థంబు నలసత సొంతంబు నశియింప కఠిన శాసనమునఁ గాలరాచి
జాతిదేశములకు శాశ్వతత్వము నిచ్చు సత్కళా రమకు సంస్థాన మిచ్చి

పార్థివ ప్రౌఢ విశ్వాస పాత్రులైన
సచివ వరులచే పాలనఁ జరుపుచుండి
కానఁ బడ డామె యెవరికిఁ గానఁ బడక
సృష్టి జరుపుచుండెడి జగత్ స్రష్ట యట్లు 72

పరమ విజ్ఞాన భాగ్యముల్ పరగు మహిని
జారచోర దౌష్ట్యములకు స్థలము గలదె
భాసుర సహస్ర కిరణుని ప్రాభవమున
తమము తలసూపునే కలికమున కేని? 73

అందఱు నొక్క తల్లి సుతు లట్టుల పొందుగ నుండు వారలే;
అందఱు భక్తి తత్పరులె యందఱు దేశహితైక దీక్షితా
నందులె, యందఱున్ యశము నం దనురక్తులె యెప్పు డెందునన్
గొందల మందు వారు కనుగోఁబడ రప్పురి కోటి కొక్కరున్ 74

అతివ పెద్దల దండ్రుల నన్నలుగను
చిన్నలను దమ్ము లట్లు నీక్షించుచుండు
పెద్దలను దల్లు లక్కలఁ బిన్నవారి
ననుఁగుఁ జెల్లెండ్రుగ మగవాఁడదయుచుండు. 75

తల్లిదండ్రులు పెద్దలు తగినయీడు
ప్రాయమునుఁ జూచి పెండిలి చేయువఱకు
మగువ కాంక్షింప డాతండు మారుఁడైన
యువకుఁ డాశింపఁ డాబిడ రతియైన 76

జీవన సందాతయై వరుణస్వామి యతివృష్టి గొలపడే యవసరమున
వాయుదేవుండు ప్రభంజనుండయ్యును భంజింపఁ డొక గడ్డిపఱకనేని
వసుధాంబ రత్నగర్భయె యయ్యు నదనుకు బదునౌచు ముక్కారు లొదిపె తీరు
మృత్యుదేవత యవారితయయ్యును నకాలముగఁ జిన్నిక్రిమినేని ముట్టుకొనదు

అసమ బాణుఁడయ్యును మారుఁ డక్రమముగ
నేయఁ డెవరిని చెఱకు వి ల్లెక్కువెట్టి
ప్రజలు నడచు వర్తనములఁ బట్టికాదె?
అల్ల సర్వేశుఁడును బ్రవర్తిల్లుచుంట? 77

అభిషేకమున కుదయాననే యేటికిఁ జని తానె కడవతో జలముఁదెచ్చు
బారెడు ప్రొద్దెక్కువఱ కొక్కఁజా మాత్మభూపు పటమునకుఁ బూజ సలుపు
మధ్యాహ్నవేళ నీమంబు దప్పక పురాణములను పారాయణమ్ము సేయు
సాయంతనమున సహాయార్థులై వచ్చు జనముల కష్ట నష్టముల నరయు

ఎట్టి మధుర పదార్థముల్ ముట్టుకొనదు;
తాల్చ దొక్క భూషణమునుఁ దాళిదక్క
మిసిమి కాషాయ వసనంబు ముసుఁగులోనె
కానుపించు స్వపరిచారికలకు నేని 78

క్షామ పిశాచి దోర్చి వరుసన్ గబళించిన గ్రామముల్ తుకా
రా మహిళా లలామ యమరావతికిన్ బ్రతిగా మహాటవీ
సీమ జగద్ధితార్థము సృజించిన యప్పురిఁ జేరె నందు లో
టేమిటి? చేతినిండఁ బనియే కడుపారఁగఁ దిండియే కదా? 79

రమణి సాధించు వివిధ కార్య ప్రతిష్ఠ
పండి క్షేత్రావలి యా చుట్టుపట్టులందు
అన్నపూర్ణ వరదరాజ మాభినుతుల
జిహ్వాల పయిం బచారు చేసెను మఱింత ! 80

ఆకాశం గల రెండుకొండలకు మధ్యం జెర్వుఁ గల్పింపనై
పెక్కుం ద్రుప్పర వాంఛచేతను సరంబీకట్ట బంధించినన్
ధిక్కారంబున సారె తాఱ్కొనుచు గండిన్ జేయు గంగమ్మ యే
ఫక్కిన్ నిల్పెద నంచు కాంత పరితాపం బొందు చున్నంతలో 81

ధవళముగ నరిసిన నెత్తి, చెవులు వ్రేల
పసిఁడి కమ్మలు, సందెటఁ బైఁడికడెము
ముదిరిన నలుపుటొడలు తమ్ములపునోటి
ముదుక తెలిచీర యుప్పరి ముసలిదొర్తు ! 82

చనువున వచ్చి మ్రొక్కి దొరసాని ! ధన వ్యయ మాత్రసాధనం
బున సమకూరునా యశము ? పుణ్యవియన్నది రాత్రి స్వప్నమం
దున నర రక్త తర్పణముతో నను దుష్టిని ముంచి తేల్తురే
ని నిలుతుఁ గట్టతో నని యె నిష్ఠుర మాడుటయే నిజంబగున్. 83

తాన నొక్కని బలిగా నొనర్పగలుగు
కార్య భారమునకుఁ గడఁగితేనిఁ
గట్ట నిలుచు పేరు గాంతు వంతకు నిల్వ
దేని ధనము మాత్ర మైన నిలుచు 84

ఆహిత వాక్కులా యువతి కబ్బురమై మది గుబ్బటిల్లను
త్సాహముజాఱి పల్కు మన సత్కృతికిన్ విధి దిష్టిగొట్టె నా
సాహసవృత్తికిన్ గడఁగి చావు కెవండును రప్పగించు నీ
ద్రోహము మూటగట్టుకొని దూకెదనెట్టుల రౌరవంబునన్ 85

సుఖవున్ సూత్రముగా వియన్నది జటాజూటాన బంధింపఁగా
గల సత్తా అలచంద్రశేఖరునకే గాకొడ్లకున్ గల్గునా ?
చలపట్టెన్ చెలగొట్ట నీయ దిఁక నీసత్కార మాతల్లి యా
బలి నే నెక్కడ తెత్తుఁజాలు నసుర ప్రారంభ సంరంభముల్ 86

ఈరీతి రాజసతి తా
నారంభించిన మహా ప్రయత్నము సఫలం
బౌ రోజులు లే వనుచు వి
చారము వెలిబుచ్చ నాముసలి దిట్టు లనెన్ 87

తనయుల గన్న నాకడుపు ధన్యము గావలె పుత్రులో చిరం
జన సుఖభోగలోక శుభ జన్మలు గావలె కీర్తి యే మను
ష్యుని వరియింపదో ! యతఁ డయోగ్యుఁ డిలన్ జిరంజీవి పేరుతోఁ
దనరుచుఁ బొట్టబోసి కొనదా ? బలివర్ధనమో సతీమణీ ! 88

కలరు పెద్దకంబడు చిన్నకంబఁ డనెడు
కొడుకు లిద్దరు నాకు నో గొనబులమ్మ !
అనుమతించిన నా కుక్షులందు నొకని
అప్పనము చేతు గంగమ్మ యారగింప 89

అనినఁ బిడుగు పైఁబడినట్టు లదరిపోయి
ఏమిటి బలియా? బలిమాట యెత్తవద్దు
నిండు ప్రాణంబు బలిపెట్ట నే సహింప
ఎంత ధనహానికైన సహింతుఁగాని. 90

అనెడు రాణి కిఁకేమి చెప్పినను లాభ
మడవి ప్రూనుకు మొత్తుకొన్నట్టు లగునె
అని తలంచి చెఱువు భారమంతయుఁ దన
శిరముపై నున్నటులె యింటి కరుగుదెంచి 91

ఎందఱులేరు వృద్ధ సతు లీ పుర మందున నన్నుఁ బోలి: వా
రందఱివీడి గంగమ మహా జనయిత్రి సుషుప్తిలోన నా
కెందుకుఁ గానుపించి బలి యిచ్చిన నేఁ దరితోడ నిల్చి పో
దుం దనియింతు నంచు దయతో సెలవిచ్చినదో! తలంపనా! 92

ఆదొరసానిగారు బలియన్నది యెంతకు నొప్పుకోరు, గం
గాదయితమ్మ కోరి నటుగా బలి యియ్యక యున్న నిల్వ, దీ
మాదిరి యైన చేసిన సమస్తము బూదిని బడ్డ యత్తరై
సోదెకు నైన రాక చనుఁజూచుచునెట్టుల మిన్నకుండుటల్?" 93

అని విచారపు గొడవులో మునిఁగిపోయి
వట్టి వచ్చి గంగైనను ముట్టుకొనక
కునికి నదిలేక కోడికిఁ దనకు రేయి
చెల్లి కొక్కొరోకో యనఁ దెల్లవాఱ 94

కొడుకులఁ జేరఁబిల్చుకొని కూరిమిమీర కుమారులార! యి
ప్పుడమిని నెందఱెంద ఱొగిఁ బుట్టరు గిట్టరు? వార లందఱున్
జొడమిన జాడయే తెలియఁ బో దొకయింత జగద్ధితార్థమై
మొదలిఁ ద్యజించువారె మనుచుందురు మాయని కీర్తికాయులై 95

నిన్నటి రేయి నాకలను నిల్వున గంగమ కానుపించి మీ
రెన్ని విధాల కష్టపడి యెంత తపించిన మంటిపాలె, నా
కు న్నరు నేరినేని బలిగూర్చిన తుష్టి వహించి కట్టతోఁ
గ్రిన్నన నిల్చిపోదు; కలకాలము జీవనమౌదు మీకనెన్. 96

మీ రే మనెదరు? మాయని
కీరితి కాయమ్మునన వెలిఁగెద మనియెదరా?
యూరుం బేరును నూడ్చుక
బోరున నూరకె నశించి పోదుమనెదరా?" 97

అనెడు తల్లి "కదేమిటే యట్టు లనెద
వమ్మ! ప్రాణ మొకెత్తుగా మమ్ములఁ గని
గోగు గొమ్మలవలెఁ బెంచు కొన్న తల్లి!
విషము వెట్టుము మ్రింగి జీవింపఁగలము" 98

అను కొడుకులలోఁ బెద కం
బని బలికి నొడఁ బఱచి తనవారికి చెఱువుం
బని వారికా యవసరము
వివిచి ముసలిది తన సుతుని వెస బలి కొసఁగెన్ 99

ఒడ్డు పొడుపులేని యినుప
కడ్డీవంటి తనమేన గజ్జలదనుకన్
చెడ్డీ కట్టుకొని తెలుఁగు
గడ్డన సిరుల్ల మొలపింపఁ గాయంబొడ్డన్ 100

అపర శివుండువోలె నభయంబున న న్నిటఁ బూడ్చుడంచు గం
డి పడిన చోట కంబడు వడిన్ నిలువంబడి యుండ నుప్పరల్
రెపరెప కొండలన్ దొలుపురీతిని రేగడి మన్ను గుండ్లు వ
ర్ష పుజడి పోఁతగా దొలుప సాగి రెదో సరిక్రొత్త శక్తులన్! 101

అది యే దైవ మహాత్త్వమో! కలను ప్రత్యక్షించి గంగమ్మ య
ష్మ్మది ముత్తైదవతోడ నన్న విధమున్ బోనాడ కచ్చో బ లి
య్యాఁ దటాకంబు తటాలునన్ నిలిచె నాహా! మర్త్యమౌఢ్యంపు ప
ట్టుదలంబట్టి పరాత్పరుం డడరుచుండున్ గాక యి ట్లే లగున్? 102

ఆగినది యాగినది కట్ట యాగినదను
కంబయకు జెయి యను కంబయాంబకు జెయి
అంబకు జెయి యను కేక అదరి భూన
భోంతరాళముల్ లెస్స మార్మ్రోగిపోయె! 103

ఆ ధరణీ ధరాధరణి కంతకు నాయమ రాణియై యశో
గాధల కిక్కయై జననిగా జనమున్ గరుణించుచున్ ప్రజా
రాధిత యాచు భర్తృదయ రామికి, లేమిని యట్లు లేడ్చు నౌ!
నాథుడుఁలేని జీవితము నాతికి దుర్భరమైనదే కదా? 104

విరహమున వేఁగు నా ధరా వరుని సతికి
తడవ కప్రయత్నంబుగా నెడఁదనుండి
ధ్వనితమగు స్వామి! దేవ! శబ్దములు కొంత
యూరడించుచు నున్నట్టు లూహ తోచి 105

ఆహ! యప్రయత్నంబుగా నాహృది కగు
నీయభిధలలోనే యింత హాయి గలదె!
యెంచి పిలిచిన కనుగొన్న నెంతహాయొ!
ఏది నాదేవ! నీదు మో మింత చూపు! 106

గున్న మావినిఁ జుట్టుకొని యున్న లేఁదీవ పులకరింపుల కొక్క ప్రొద్దుఁలేక
శిలలకే గిలిగింత గలిగించు కోయిల పడుచు పాటకుఁ దీఱుబాటు లేక
తేనె ముంపున దిమ్మతిరుగు తుమ్మెదతేని పానగోష్ఠికి వేళ పాళలేక
పరిసవాంగనల వెంటఁ బడుగాలి పిల్లల మిడిసిపాటున కాటవిడుపు లేక

విరహ లోకమ్ము నెడపెడ వేటలాడు
కుసుమ బాణుని క్షణమైన గునుకనీక
యెన్నియో వసంతములు పోయినవి యీవి
పినముల నను నొంటరిగ నేడ్పించుకొనుచు! 107

వెలికి మో మొకసుంత పొడసూప రానీక చింతనిప్పులగాడ్పు చెఱిగి పోసి
ఎండలకు వెఱచి యిండ్లలోఁ బడియుండ నూపిరాడఁగనీక నుక్కపెట్టి
వనధినే గాదు కన్నడు నేత్రద్రవమునేనిఁ బసిపట్టి చలచల మసలఁగాచి
స్వల్పంబుగా నైన శైత్యంబు నొందఁగా [illegible] పుచ్చెదివేళలఁ గ్రుంగదీసి

భూధరంబుల భూరుహంబులనె గాక
వసుధ నంతను బీటలువాఱ జేసి
ఏగినవి యెన్నియో గ్రీష్మ ఋతువు లీ వి
పినముల నను నొంటరిగ నేడ్పించు కొనుచు 108

ఇట్టి విక్రమ ముండెనే నీ మగని? కన, ధర దద్దరిలిపోవ నురుము లురిమి
ఈకాంతి నీ కున్నదే? యన కనులు మిఱుఱులు పడయంగ మెఱుములు మెఱసి
ఇం తైక్య మున్నె మీ యేల్బడి? నన మిట్ట లెఱుఁగగ నీక కుంభవృష్టి గురిసి
ని న్నేఁచు మరుని కున్నె యిట్టి ధను? వన సప్తవర్ణపు విల్లుఁ జదలఁ కెత్తి

పతి తిరస్కృతి నిటబడి వెతపడునను
గని నగెడి భేక బెకబెక ధ్వనులతోడ
నేగినవి యెన్నియో వర్ష ఋతువు లీ వి
పినముల నను నొంటరిగ నేడ్పించుకొనుచు? 109

భాస్కరోదయవేళఁ బ్రస్ఫుటముగ విచ్చు కమల రజస్సు గంధముల గుప్పి
ప్రణవనాదమ్ములఁ బ్రతిసేయగాఁ జాలు విమలహంసల కూజితములఁ బరపి
వర్షాగమంబునఁ బంకిలం బైయున్న సరసు లన్నిటిని స్వచ్ఛముగఁ దేర్చి
ఎచ్చోట నే మచ్చ యేడాగు లేకుండ దివి మండలము నెల్ల ధవళ పఱచి

నా తెలుఁగు రాయల యశమ్ము జ్ఞప్తి కెలయ
నచ్ఛపుం దెల్వు వెన్నెల లారఁబోసి
ఏఁగినవి యెన్నియో శరదృతువు లీ వి
పినముల నను నొంటరిగ నేడ్పించుకొనుచు? 110

నా నిష్ఫల తపంబునకు మాఱు లెస్సపండిన యెల్ల ధాన్యపు నిధుల నిండి
నా గ్రుక్కుకొను కదుష్ణాశ్రువులకు మాఱు మహినంత దెలిమంచుపయ మొనర్చి
నా వేఁగు విరహంబునకుమాఱు మెయిమైకి సందువోనీని పెంజలిఁ దగిల్చి
నా వాడు నీలి మనసుకుమాఱు పసిమి బంతిచేమంతులఁ బగల బూసి

సతత ముడివోవు నా తనూలతకు మాఱు
పండు మిరపలు గుమ్మళ్ళు బండ్ల కెత్తి
ఎన్ని హేమంత ఋతువులోః యేగినవి వి
పినములనను నొంటరిగ నేడ్పించు కొనుచుః 111

అనుఁగుల తల్లిదండ్రుల మహోదర భాగ్యము త్రెళ్ళి పోయి, నె
య్యుని కృప తున్గిపోయి, విపినోర్వుల మ్రోడయినిల్చియున్న నా
మనమటు లాకులన్ డులిపి మ్రాకుల నన్నిట వట్టి మ్రోడులన్
బొనరిచి యెన్నియో శిశిరముల్ సనె కన్నుల నీరు నింపుచున్ః 112

నా మహాదేవః యది యేమి నాయొనర్చు
నాపదాన్వితాలాప విలాపములకు
శిలలె ద్రవియించు చున్నను నలఁతి యేని
చెమ్మ గిల్లదు నీకన్నుఁ దమ్మిదోయి ః 113

నా యెల ప్రాయపు వెన్నెల
లీ యటవిని వితగఁ జనుట నీక్షించుచు నన్
గాయక బెల్లము గొట్టిన
రాయి పగిది నుందువు దయదాదా? వాదా? 114

వసిగొని యుద్ధరింపఁ బడివత్తువటంచుఁ దలంచి సారె నిన్
గొనరుట నాల్కతీట యనుకొనయితిన్ ; మతిహీన నైతి ; న
ప్పసమునఁ దల్లక్రిందుల తపస్సు ఘొనర్చిన నగ్నిలో సుధా
రసము జనించునా ? కటికిరాతికి చక్కిలిగింత కల్గునా ? 115

అన ఘేచ్ఛన్ గనులార నిన్ను గననై యానాఁడు బుద్ధుండు వే
చ్ఛని ముద్దుం బసి కందు నాలిని మహాసామ్రాజ్య భోగంబులన్
గనకే బిట్టు తపించి యించి వసులన్ బ్రాణంబుపో నున్న నీ
వణు మాత్రంబయినన్ గనం బడితివా? ఆ యంటివా ? యుంటివా ? 116

నీ వున్నావని ననుఁబ్రోతు వనియున్ నిన్నెట్లు నమ్మంగనౌ ?
నీ వే వన్నియ వాడవో ! జగములన్ నీవుండు టెచ్చోటనో ;
నీ వృత్తాంతము లంతు బట్టకయెగా నిన్ బిల్వ నెన్నెన్నియో !
యేవేవో యభిధల్ నినున్ గొలువ నెన్నెన్నో మతాల్ పుట్టుటల్ ; 117

శ్రుతులు పురాణ శాస్త్రములు రొల్లడు ముచ్చట లాలకించుమున్
మతములు వానికిష్టమగు మార్గములన్ జను నిందులో నిజ
స్థితిగతులం బయల్పఱచి చిన్మయ రూప మలంకరించి స
మ్మత మొనరింప నీ కలవి మాలిన కార్యమటే ? పరాత్పరా ; 118

నీ వీ సర్వ మతాలకుం బలె లడాయింబూన్చి యేరూప మం
దే వాసంబునఁ దోప కిట్టుల దురాయిం బెట్టుకొన్నావు నీ
లావాదేవి తమాముతే దను సవాళ్ళం బట్టి ప్రత్యుత్తరం
బీవేనిన్ బురిడీ తనం బగు గదోయీ ; నీ విధం బారయన్ ; 119

ఈ తెఱచాటు చుట్టఱీక మెన్నియుగా లిటు కప్పిపుత్తువో
చేతములెల్ల నీకొఱకు చీదరనొంది ప్రపత్తి బాపుకోఁ
బాతరలాడుచున్ వరుసపాటలు నీ పయి నిత్యపూజ లా
రాతికిఁ జేయుచున్నవి పరా కనుకో విదియుం బరాత్పరా ! 120

నరసింహాకృతిఁ దాల్చి భక్తుని చిదానందంబునన్ శత్రునిన్
బరిమార్పంగల శక్తు లిప్పుడు రవాణా జేతువా ? యీమతాం
తర వాదంబులు చిమ్మరేగున ప్రశస్తంబైన నీపేరు చి
ల్లర కాఁబోవున ? యెందుకో మఱుగుమూలం బంతు బట్టింపవే ! 121

ఇన్ని మతాల కీ వొకఁడవే భగవంతుఁడవంట పేరు లె
న్నెన్ని విధంబులన్ బిలువ నెగ్గు దలంపని వాడ వంట యా
పన్నర పాప పుణ్యముల బట్టి విచారణ చేతు వంట యిం
దు న్నిజమున్న నొక్క గురుతున్ వెలయింప విదేమి చిత్రమో ! 122

ప్రకృతి తనంతఁ దా నగు విభాతిఁ గనంబడుచున్న దిందు పై
విక మనుపించుకోఁ దగిన వింత కనంబడ నీ ప్రభావపుం
బ్రకటన ముంబొనర్పఁ దగవా ? తగుదేని మతంబులన్ జకా
పిక నొకమార్గమందు నడిపించి భవన్నుతి నిల్పుకొమ్మికన్ ! 123

కొందఱి పాప పుణ్యములకున్ ఫలమొంద పరంబునన్ జమా
బంది విచారణంబు జరుపంబడు నంచు వచించు టల్ "దగా"
యెందుకొ ! చూచి వచ్చి వచియింతురొ ! నీ వెఱిఁగింతువో ! యిదే
పందని ప్రమందితో బ్రతుకు జాడలు జూపితివా పరాత్పరా ! 124

కరములు మోడ్చి కన్నులను గట్టిగ మూసి మనంబునన్ బరా
త్పరుని జపింప దర్శనము తప్పక యిచ్చు నటంచు భక్తి త
త్పరు లను మాట కేవల మబద్ధ మబద్ధము గానిచో నిరు
త్తరము నిరాకృతిన్ మత వితర్కము బెంచితివే పరాత్పరా! 125

ఒక తగవున బలువురు పలు
రకములుగా సాక్ష్య మిత్తురా? నమ్మని వో
లిక యీ మతంబులకు నీ
మొక మెఱుఁగని వట్టి వాదము కదా? దేవా? 126

నీవున్నావో! లేవో!
నీవాలక మే పగిదిదొ! నీ పేరేమో!
ఆ వేదాంతమె వల దు
ర్వీవర! సింగనికి ప్రత్తిపేరం బేలా? 127

శిక్షర్హున్ మఱి నాకు నీ యతి రహశ్చిత్తంబుతో నీలసత్
సాక్షాత్కారముతోఁ బనేమి? జగదీశా! నీకు నాపై దయా
దాక్షిణ్యంబులె యున్న నాధవుని సౌందర్యంబులో లీలమై
చక్షుః పర్వము సేయుచుండుము సుమార్చల్ నీకు చెల్లించెదన్ 128

అనుచున్ బతియే దైవం
బని దైవంబే పతి యని యనుపమభక్తిన్
తన పతి రూపములో దే
వుని దేవునిలో దనపతి పొల్చఁగ నిచ్చల్ 129

ఉదయాస్తమయ వినూత్నోరు ప్రభలలోనఁ దన మృదులారుణాననము నరసి
క్రమ మొప్పు సూర్యచంద్రముల గమన మందతని చరణారవిందములఁ గాంచి
గట్టుదాట కులియు కడలులం దాతని యధికార ముద్రిక లంతు బట్టి
జిలుగు రంగుల పూల చిత్రింపులో వాని చాతుర్య రమ్య హస్తములఁ జూచి

కలఁడు కలఁడను వారికిఁ గలుగకుండ
పోవు టెట్లు నా స్వామి నా దేవుఁ డనుచు
న త్తుకారా విభుని రాక కలరుచుండెఁ
గృషి వృథా పో దను నుడి నన్నృతము గలదె? 130

# తుకారాం

## షష్ఠాశ్వాసము

ఒకవంకఁ బ్రత్యేక నికటస్థలి సువర్ణమయ పీఠికపయిఁ దిమ్మరుసు మంత్రి
ఒకవంకఁ బ్రవిదారణోద్దండ నాగమ నాయకులాది సైన్యాధి పతులు
ఒకవంక నందితిమ్మకవి ధూర్జటికవి అలసాని పెద్దనార్యాదికవులు
ఒకవంక కర్ణాట కోదయగిరి చోళ మధుర పాండ్యాది సామంత నృపులు

చారణు లొక వంక సముచి తాసనములఁ
బ్రీతిమై నలంకరించి యుండ
కృష్ణదేవరాయ లెలమి సింహాసన
స్థుఁ డగుచు గొలువున్న గడియలందు 1

మనుపులుదేలి నైల్యమును నూల్కొని యున్న శరీరముల్ గళం
బున గురివెంద కెంపు సరముల్, తలపై సిగయున్, సిగన్ పసం
దనపు దురాయి, నందిటను దంతపు గట్టులు పూరిగోచులన్
దనరి నృపాలు నానతి సదస్సున చెంచులు చేరి మ్రొక్కుచున్ 2

"ఓ నరసింగ కిష్టదొర! యొక్కపుడున్ మముఁ జూడరారుగా
కానరొ! యేమొ! నల్లమలకానలలో నివు డెచ్చిపోయి లే
త్నైనుఁగు లెల్గు బంట్లు పులు లేదులు దుప్పులు మన్నుబిల్లులున్
వేవకువేలు తిర్గిమ్మరెదు వే దయ సేయుదు వేటలాడగన్" 3

అనుచు జేనిని వేటకు ననుమతింప
వేట కుపకరించు వలలు విండ్లు బాణ
ములను మోపులు మోపులు ముందు నిలిపి
చెంచు లనుపమ నృపభక్తి జిప్పిలంగ 4

గగనమంటు వెదుళ్ళ నెగబ్రాకి మేలు మే లేఱితెచ్చిన సన్నసార ప్రాలు
దరికొన్న చెలరేగి తరిమి కుష్టెడితేంట్ల విసరితెచ్చిన కొండముసురుతేనె
పొదలలోనీని యేఁపున గాండ్రిలు పులులఁ బిదికి తెచ్చిన జుంటి పిరపుపాలు
పరువెత్తు నేదుల ప్రాణాలతోఁ బట్టి పెరికి తెచ్చినవాడి ముళువు ముండ్లు

ఇవి పులుల గోర్లివి నెమళ్ళ యీక లివ్వి
కజ్జురా లివి, పును గిది కస్తురి యని
వేఱువేఱుగా నెఱుగంగ పేరుకొనుచు
గారవంబుగ జేనికి కాన్కలిడిరి 5

వన పదార్థము లెన్నొ యప్పనముచేసి
వేట కంతగా పురికొల్పు వేటరులకు
నెంతకే ననుజ్ఞయు నెల వియ్యకున్న
కృష్ణదేవరాయ నృపవరేణ్యుఁ జూచి 6

నడినెత్తినసిగ పసిఁడిగండు పోగులు సవురులీనుచు సారె చెవుల గునియ
గళము నిండ బలు రంగుల పూసలసరాలు దండచేతి కెలదంతపు కడెంబు
పిక్కలంటఁగ వ్రేలు విరుల కుచ్చెలి యెదపైన బెబ్బులితోలు పయటచీర
పసుపుఁబూత మొగంబు నొసటిపైఁ జెంపపై నొకుపచ్చని వన్నెజోకబొట్టు

తనరఁ బతి పరీక్షలకు నెగ్గిన నరునకుఁ
బాశుపతమీయ వచ్చిన బయసి గలుగు
శబరివేషంపు చండిక చందమొప్పి
చిఱు నగవున దళ్కొత్తు చెంచెత యొకర్తు ! 7

"పులుఁగులఁ బుట్రలన్ దినుచుఁ బుట్టల గుట్టలఁ జెట్లనుండి మన్
గొలఁది కొలమ్మువారె యని కొంచెపుఁ జూపులఁ జూడకండో ! వే
ల్పుల నరసింగసామి వలపుల్ గొని పెండిలి చేసికోడె మా
కొలముల చెంచు లచ్చిమిని కూర్మిని మాకు ననుంగుటల్లుఁ డై ? 8

ఎవ్వరో! యెప్పు డెందుకో! యేర్పఱచిన
కులకులంబున కొక్కొక్క గొప్పకలదు
అప్పటి విపుడేటికి? అప్పటిప్పటికిని
గుణము ప్రాముఖ్య మగుఁగాని కులముగాదు. 9

మిమ్ము వంటి మానిసులమే మేముఁ గూడ !
మాది మానిసుల కులమే ?- మనుజులందు
నొకనిఁ గోసిన నెత్తురు లోడ్చుచుండి
యొకనిఁ గోసిన దుగ్ధమ్ము లుట్టి పడునె ? 10

ఋతువుఁబట్టి మాఱుచునుండు ప్రకృతి కరణి
మానవాళి మాఱవలెఁ గాలాను సరణి!
మాఱని మనుష్య, లెంతకున్ మాఱిపోని
ప్రాణములు గల్గునొక వింతఱాళ్ళు సుమ్మి ! 11

అరుగుదెండయ్య వేవేగ నరుగుదెండు
నేఁడె యడవిమెకాల వేటాడుకొంచు
సెమనుకోక మా చెంచు గూడెములదాఁక
మీమది కు సాలచేసి పంపేము సామి!" 12

అని పిలుచు దానిధైర్యం
బునకో! పలుకు నుడికారమునకో! వేషం
బునకో! భూపతి యన్నా
తి నొక నిమేషము తదేక దృష్టిన్ గనుచున్ 13

"సరియే మీరు పదండి వేట పొనరించన్ సాధ్యమైనంత తొం
దరలో మీ వెనువెంట వత్తు మనుచున్ దాక్షిణ్యముం బూని సుం
దర చేలంబులు భూషణాలు బహుమానా లిచ్చి యచ్చెంచు లం
దఱ నంపించి సదస్సులోన మృగ యోదంతంబు వాక్రుచ్చుచున్ 14

వేట కేగంగ వలయు నీవేళ యనుచు
క్ష్మాతలేంద్రుండు నాటికి సభ ముగించి
అత్తఱిబినె వేట కన్ని యాయత్త పడఁగఁ
బయన మయ్యెను చురుకైన హయముపైన. 15

నరపతి కదల తగు వాహనముల మీఁదఁ
గదలిరి చమూపతులు హితుల్ కవు లమాత్య
లన్నగిరిఁ గల్గు వారు వీరనఁగ నేల?
వండి వార్చెడు వంటల వారు గూడ. 16

బలువడి వచ్చి వచ్చి చెలువమ్ముల సిమ్మ వెదుళ్ళ చందన
మ్ములు పనసముల్ రసాలములు పొన్నలు టేకులు వేపలే పెఱన్
బలుసులు దేవదారువులు ప్రబ్బలు జంబులు కోవిదారముల్
గల నిబిడంపు నల్లమలకానలు సొచ్చిరి వేటవేడుకన్. 17

మృగయు లడవి జేర్కొన్నంతనే బొరియలఁ
బొదల గుహలలోఁగల మెకమ్ములను లేప
ధిమిధిమిక్వణన హుడుక్క డమరుకా మృ
దంగముల మొరయించినా రార్చుకొనుచు. 18

మృగయు లొనరించు మ్రోతల కెచటి మృగము
లచట రివ్వున లేచిన వడలిపోయి
తేనె తెట్టెల నటిటు కుదింప ఝుమ్మ
ఝుమ్మనుచు లేచి సరఘుల చొప్పు దోప 19

పటహ భేరీ హుడుక్కల ధ్వానములకు
జడిసి పరువెత్తు మృగముల సవ్వడులకు
మందరగిరి క్షుభిత వార్ధి మాడ్కి నడవి
ఘూర్ణిల దొడఁగిన దతుల కుతల మగుచు, 20

హరిణము పోవుచుండఁ గని వ్యాఘ్రము లే న్గెదురైన సింహముల్
గొఱియ తటస్థమైనఁ గనుగొంచు వృకంబులు తేనె తెట్టెలన్
దఱియుచు భల్లుకంబులు క్షుధా పరితప్తములౌచు ముట్టకే
యఱుపులు పెట్టుకొంచు నుఱు కక్కట ! ప్రాణము లెంత తీపొకో ! 21

చెంచులఢాకకున్ జడిసి చెంగున మింటికి లేచులేళ్ళ నీ
క్షించినఁ జంద్రునందుఁగల జింకను జేరఁగాన బోవునట్లు క
న్పించుచు నుండె నాపదల వేళలలోఁ దమవారిఁ జేర య
త్నించుట నైజమే కద క్షితి స్థలిపై నెటువంటి ప్రాణికిన్? 22

ఇదియె యదనంచు నమ్ముల పొదులు విండ్లు
బల్లెములు కత్తు లీటెలు వలల బోను
లుచ్చులు గొని కిరాతులు యోధవరులు
కెరలుచు నుపక్రమించి రా ఖేటమునకు. 23

నేనే కొట్టితి నేనె కొట్టితిని నేనే నేనె నేనంచు న
క్కానన్ వేటరు లిర్వురొక్క కిటికై క్రౌర్యానఁ బోరాడు కొం
చానా డర్జునుఁడున్ హరుండును వరాహార్థంబు ఘోరంబుగాఁ
గావన్ బోరిన రౌద్రఘట్టమును బ్రోద్ఘాటించి రొక్కుమ్మడిన్, 24

అలుగు నేయక బాకునేయకయె యొకఁడు
వేగఁ బరువెత్తు కుందేలు వెంబడిఁ బడి
యొడసి పట్టుకొని తిరిగి యురికివచ్చి
శూరులకుఁ జూపె నా దెబ్బ చూడుఁడనుచు 25

ఆయెడఁ బొంచిపొంచి యొక వ్యాఘ్రము లేడిని గావు బట్టనై
"ఆ" యని నోరు విచ్చి పడనైన క్షణాననె దాని యంగిటన్
రాయలు బాణమేసి హరిణంబును గాచిన నోహొ! రాజు రా
జేయగు నంచు మెచ్చుకొను చెంతయొ యద్భుతమంది రెల్లరున్! 26

విలుకాఁ డొక్కఁడు గగన
స్థలి నెటనో యెత్తునఁ జను శకునంబు నిలా
స్థలికిఁ బడఁగూల్చి తనయ
త్యలఘు శర సులక్ష్య పటిమఁ గనఁ బఱచుకొనెన్ ॥ 27

బలు వేటలఁ బడి ప్రొద్దుం
దెలిసికొన రొకరును; వేట, తెఱవ, మొదలుగా
గల సప్తవ్యసన గ్ర
స్తు లెపుడు నన్య సువిచార దూరగులు గదా ? 28

వేటకు విసుగు కొని పెద్ద నార్యాదులు
పురముఁ జేరుకొనను త్వర వహింప
వీరు లాటవికులు వేటాడ చాలించి
యురికి వచ్చి రెల్ల యొక్క మొగిని 29

వారిజ బాంధవుం డపర వారిధిఁ గ్రుంకగ నున్నవాఁడు నే
డీరెయి యిచ్చటే గడపి యెల్లి ప్రభాతమునందు లేచి కాం
తార ఫలాది వస్తు సముదాయముఁ గైకొని ఫీఁటికల్లనన్
జేరు కొనంగ వచ్చును నిశీథమునన్ బయనింప నేటికిన్ ? 30

అని యారేయి యరణ్యం
బుననే గడుపుచు ప్రభాతమున లేచి పురం
బునకున్ జనుదలఁపున నీ
వని నెచ్చో నుంట ? యన్న ప్రశ్నము కలుగన్. 31

ఎఱిఁగిన వేటకాఁ డొకరుఁ డిచ్చటి కామడ దూరమందు నం
దఱునుఁ బరుండ పెద్ద మయిదానము దానికిఁ జేరువన్ సరో
వరము ప్రశస్తమంచుదెలుపన్ బసకయ్యది యోగ్యమంచు తి
మ్మరుసు ననుజ్ఞఁజేకొని సమస్తముతో నటకేఁగి రెల్లరున్. 32

ఆకడ మాంసాహారపు
శాకాహారంపు ద్వివిధ శాఖాపచకుల్
బాకము లొనర్ప రుచులై
మేకొని భుజియించి రిష్ట మృష్టాన్నములన్. 33

ఏకముగా శయనించిరి
యాకఠిన శిలాస్థలమ్ములం దేకడి వా
రాకడె పడి; నిద్ర సుఖం
బాకలి రుచి యెఱుఁగదన్న యార్యోక్తి యటుల్ 34

వారు శయనించుటకు ముందు వనమృగముల
వెతలు సొరకుండుటకుఁ జుట్టు వేసికొనిన
మంట లవ్వారినేసిల్గు లంటనీక
అనలుఁడు "ప్రహరీ" చేయు చున్నట్టులుండె. 35

అది ప్రశాంత నితాంత వాతావరణము
నిదురలోఁ దూగు మునిపల్లె లదిరిపోవ
కర్కశమ్మైన కాల శంఖమ్ము వంటి
గొంతు తెగజించుకొని కొండకోళ్ళు కూసె. 36

కుంకుమచ్ఛవిఁ జిమ్ముకొంచు ప్రాగ్గగన మండలమున కెక్కుచున్నా డినుండు
గూండ్ల మైమెయియంటఁ గూరికిలేచుచు న్న వికలధ్వనుల విహంగమములు
ధరకు డిగ్గు మెఱపు తెఱగంటు లట్లు క్రిందికి డిగ్గు చున్నవి నిర్ఝరములు
కిచకిచారవములఁ బచరించుకొంచు గొమ్మల ప్రేలు చున్నవి మర్కటములు

తమ్మి పువ్వుల చెఱనుండి తప్పికొనుచు
ఝంకృతు లొనర్చు చున్నవి షట్పదములు
బంగరు మలాముచేసి యావలకు విసరి
వైచినట్లు భాసిలుచుండెఁ బ్రకృతి యంత. 37

సీరుపట్టున కుఱ్ఱకాఱు మబ్బులతోడ కలసి యాకాశ భాగమున కెగసి
తుంగభద్రా నదీ తోయదమ్ములఁ బర్వి కమల కన్యల కపోలములఁ బుణికి
నవనవామోద సుందరగంధ తరుశాఖలేలి యుయ్యాల జంపాల లూగి
బలుతేంట్లకోట్ల కేర్పడిన వెదుళ్ళ రంధ్రముల దూరి మధుర ధ్వనులు చేసి

ప్రతి మృదుల పుష్పగంధ గర్భములఁ జొచ్చి
ఘుమఘుమ పరిమళమ్ములఁ గొల్లగొట్టి
పగటి కరుదెంచు ప్రకృతికి స్వాగతముగ
పిల్ల వాయువు లల్లన వీవఁదొడఁగె 38

ఆరెయి యంత వేట విషయంబులె యూహకు వచ్చుచుండి జా
గారము చేయుటై కనులఁ గట్టిగ మూసిన నిద్రరామిచే
సారెకుఁ బొర్లుకొంచు అలసాని కవీంద్రుఁడు కుట్టిమంబుపై
భారముగా పరుండఁ దెలవాఱె దిశల్ దెలుపెక్కె బల్లునన్ 39

బిల్లున తెల్లవాఱిన బవల్ బిలుపేటన డస్సియుంటచే
నెల్ల రొడళ్ళపైఁ దెలియకే నిదురించుచు సుంద్రి, కృష్ణభూ
వల్లభుఁ డొక్కరుండె యటు వంకగ మ్రాకులక్రింద నమ్ములన్
విల్లును చేతఁబట్టుకొని విల్వఁబడన్ గని లేచివచ్చుచున్ 40

ఏమిటి కృష్ణదేవ ! పగలెల్ల నొనర్చిన వేట చాలలే
దా? మఱి యేలనింక విలునమ్ముల చే ధరియించినారు ? వీ
మా మన మింటి కీదినము ? యామిని యంతయు నిద్రె యుంటిరో !
యేమొ ! సుషుప్తిఁ గొన్నగుఱుతే కనుపట్టదు మీ కనుంగవన్ ! 41

అనుచు సన్నిధి కేతెంచి యడుగుచున్న
పెద్ద నామాత్యునకు పృథివీధవుండు
సుఖ సుషుప్తినిఁ గంటివే సుకవి చంద్ర !
రాతిరంతయు నీకాన రాతివేల ? 42

మెలఁకువ వచ్చి కన్దెరచి మెల్లన దిక్కులు చూచుచుండి బె
బ్బులి యొకచూడు లేడి యసువుల్ గొనఁ బర్విడుచుంటఁ జూచి య
మ్ములు విలుపట్టి వెంటఁబడిపోయితి నొక్కఁడఁ; జూచుచున్ మహా
ర్తులఁ బరిరక్ష చేయని పతుల్ పతులే ! సుకవీంద్ర ! పెద్దనా ! 43

పరుగులెత్తుచు గురి కందు వఱకు బోయి
పోయి యమ్ములనేసి బెబ్బులివి గూల్చి
హరిణ పరిరక్షజనిత ప్రహర్ష మతిని
ఆళల నరయు నాకు నల్లంత యెదగ 44

పోవుచున్నంత పొదవునఁ బొదలుఁ జెట్లు
వాటి కావలఁ గలదేమొ బాట!; - దానఁ
జనుచునున్న యాబిడను నేఁ గనుచునుంటి
వెనుదగిలెడు నన్నాబిడ కనుటలేదు. 45

నును మేను తళు కద్దుకొని పల్కలపుఁజీర సన్నని సంజకెంజాయ గాయ
చెదరు ముంగురులు తుమ్మెదలట్లు నెడనెడ బింబాధరముఁను జుంబించుచుండ
అలవోక పూలగాలులు సోకినంతన కలగలమో మింత కందిపోవ
భూదేవిలేనవ్వు మొలకలై యడుగులు నడిచిన చోటి కందములు దిద్ద

తన భుజాశ్లేషమునకుఁ జైతన్యమొదవి
ఆకడవ కూడఁ గ్రిందు మీదై భ్రమింప
మెఱుపువలె నీటి కొఱకేటి దరికివచ్చె
సోగ కన్నుల చక్కని చుక్క యొకతి. 46

యోగినీభావ మింత వియోగినీ వి
భావ మొకకొంత తోచు నప్పడఁతియందు
కఠిన వైరాగ్య నియతి శృంగార నిరతి
పొంది పొసఁగిన యద్వైత మూర్తియామె. 47

ఆ నిరంతర నిద్రాణమైన భూమి
తలఁపు నూపెడి యేరహోర్థంబు కొఱకొ!
తిరుగుచున్నది గుండె నిబ్బరము సెడక
ఎవ్వరి తపః ఫలమ్మొ! యాపువ్వుబోడి. 48

పడఁతి మొగంబునన్ దిగులు వంటి దెదో ! యొక నీలిఛాయ క
న్పడి నటులుండి వెంటనె యనంత కళా దరహాసరేఖ లే
ర్పడినవి జీవితమ్మడవి పాలగు వెన్నెల యైనదో ! మఱే
గడియను గన్న కమ్మని సుకమ్ము కలల్ తొణికించెనో మదిన్ ! 49

ఎవరీచిన్న దయారె ? కాఱడవిలో నీయోగినీవేష మం
దవగాహంబున మోహినీ వపువునన్ ఖ్యాతిల్లుచున్ వీక్షణా
లవమాత్రంబునకే యమోఘ మమతల్ ప్రావిర్భవంబంది యే
యవినాభావ మరంద బాంధవమొ ! న న్నాలేమకై లాఁగెడిన్ ! 50

ఈ పెనుకానలోన ముని కెచ్చటనో ! మృదులారుణాంఘ్రులీ
కాపథమందుఁ గందఁ దిరుగన్ బనియేమిటొ ! కావి యేటికో !
ఆపెను జూచిరాను కడు నాశగ నున్నది వేగ పోయి రా
నా ? పరివారముల్ పయనమై చనుచుండెడి యంతలోపలన్ ? 51

అపుడె యాబిడఁ జేరి మాటాడఁ దలఁచి
అచట నేదైన జాగైన నిచట మీరు
నా గమించిన యునికి గానక తహ తహ
పడెద రనుభీతి నూరకే వచ్చినాడ. 52

అను కృష్ణరాయలకు పె
ద్దన తమ కింత త్వర యేల? తా మట కొకరే
చన నేటికి ? మనమందఱ
ముమ గలసియె చనుద మని నృపు నొడఁబఱచుచున్ 53

ఎల్లరకుఁ బ్రయాణ విషయం బెఱుక పఱచి
కాల్యములఁ దీర్చుకొని యామెఁ గొంచుకొఱకు
తొలుతగా నటకటకు చారులను బంపి
బయలుదేరి రందఱు కృష్ణవరునితోడ. 54

వారు రాత్రి పరున్న కాంతారమునకు
నామెయునికికి నంత దవ్వేమి లేదు
ఉన్నతపు గుట్టలు నడుమనుంట కతన
నటకుఁ జేర్కొనుటకుఁ గొంతవ్యవధి పట్టె. 55

వా రనుకొన్న యట్లు ముని వాటిక కా దది, పూలతోటలున్
బారులు తీర్చినట్లు కనుపట్టెడు వీధులు వీధివీధికిన్
వేఱిమి లేక యొక్క కరణిన్ ధవళోన్నత కుడ్య సుందరా
కార గృహాలతోఁ దనరుక్ష్మాతలి నాకము సర్వభంగులన్. 56

ఆకడ నేకడఁ గన ది
వ్యాకృతిని పసిండి వన్నె యక్కఱములతో
శ్రీకృష్ణదేవరాయ మ
హీకాంతుని నామధేయ మెసఁగుచు నుండెన్ 57

ఒగి చారుల్ పనుచుండ తిమ్మరుసు కృష్ణోర్వీశ మౌఖ్యాదు ల
న్నగరావన్ బడి పోయిపోయి కనుగొన్నా రొక్క సౌధంబులో
వగ ప్రాయంబునఁ గావిఁదాలిచిన సాక్షాల్లక్ష్మియో ! వాణియో !
నగరాణ్ణందనయో ! రతీరమణియో ! నా నొప్పు నాయోగినిన్ ! 58

బాజార్లు పట్టకుండఁగ
రాజులు రవణప్పలు మన రాజ్ఞిన్ గన నీ
రోజున రానేలో ! యను
యోజనఁ బ్రజయు నటఁ జేరె నొక్కుమ్మడిగన్. 59

బ్రహ్మ తేజస్సుతో నుట్టిపడుచున్న
సంయమినికి నమస్కృతి సలుపఁబోవు
చు వలదని నల్లు తిమ్మరుసు కను సంజ్ఞ
నాప నల్లనల్లన రాయ లాగిపోయె. 60

వచ్చిన సచివాదుల నామె స్వాగతముగ
కావి మేల్ముసుగు నుండి క్రీఁగంటఁ గనుచు
తొట్రిలిక వారి కల్లంత దూరముగనె
మాన్యులకు జోహారులని నమస్కరించె. 61

మాన్యులకు జోహార్లనిన యమ్మధురవాణి
లలిత మృదులగాద్గదిక గళస్వనమున
తిమ్మరుసు మంత్రి కను సంజ్ఞ తెలియవచ్చి
అధిపుఁ డామె నరసె ! నామె యధిపుఁ గాంచె ! 62

ఒకరి నొకరు కనుఁగొనుచు నొకరి నొకరు
హా ! తుకారా !- ప్రభూ !- తుకారా !- ప్రభూ ! ప్ర
భూ ! యను పరస్పరార్త సంబోధనమున
శార్ద్రమైన వచ్చటి హృదయాంబుజములు 63

ఎల్లయెడ గాఢ నిశ్శబ్ద మేర్పడి యొక
పావుగంటసే పచటి వాతావరణ మె
సంగెఁ జంచదుత్తుంగ తరంగతతుల
కళవళములేని గంభీర జలధి యట్లు. 64

కృష్ణరాయ లామెను కవుంగిలికిఁ దార్చి
యూరడించు నుత్సుకత బాహువులు సాచె
వచ్చుచునె వచ్చుచునె యెందువలనొ ! యామె
యంతరమున హఠాత్తుగా నాగిపోయె ! 65

అరుగు దెంచుచు నాగిన యామె నరయ
నాదరప్రేమలు మఱింత యతిశయించి
యకట ! నను జేరవచ్చుచు నట్లె నడుమ
నాగిపోయె దదేమె ! నా యర్ధదేహ ! 66

సైరింపంగదవే ! సఖీ ! ప్రబల పశ్చాత్తాప బాష్పంబు ధా
రారాధ్యప్రియ దర్శనం బమరలేదా ? దుఃఖ మింకేల? నీ
ధీరత్వంబున ముట్టడిన్ గొనిన పాతివ్రత్య శీలంబు శృం
గారింపంగల నీ చరిత్రకుఁ గలంకం బింత చేకూరునే? 67

నీ వలనాడు నేరిచియొ ! నేర్వకయో ! యొనరించినట్టి కా
ర్యావగత ప్రమాదమునకై పగఁబూనితి నన్న భీతి నీ
లో విహరింప వచ్చును తలోదరి! యా భయ మేల రమ్ము! నీ
సేవకు మత్క్షమా జనిత చిత్తములో నభిషేక మిచ్చెదన్. 68

నా పయి ప్రేమ యివ్విధమునన్ గహనస్థలిఁ జిత్రకల్పన
స్థాపిత శోభనా కృతులు ధారలు గట్టఁగ జిమ్మియున్ మన
స్తాప దవాగ్నిలో మెరుగు దాపిన భక్తిని ప్రోజ్వలించు ని
న్నే పగిదిన్ నుతించి కృత కృత్యుఁడ నయ్యెదనో! యనూహ్యహా!" 69

అనెడు తేనికి నాఁడు నే ననుచితముగ
గడఁగి చేసిన పాపంబు గుడుచుచుంటి
చేసి కొన్నట్టివారికిఁ జేసికొన్న
యంత యో మహాదేవ! యన్నట్టులైతి! 70

అనుబంధచ్యుతి నాఅటన్ గుమిలి కూరాకైన నాఁ డిట్టి ద
ర్శన భాగ్యం బొనకూర్చి నా రదియు గోరంటాకు కెంజాయ పూ
చిన మోమోటము గాదె? చన్న దినరాశిన్ బూది బుగ్గైన జ
వ్వనపుం గూరుము లెండ గుజ్జములు కావా? ప్రేమ వారాన్నిధీ! 71

కొండొక భార్యతో వలపుఁ గోరికలీరికలెత్త పంచ దా
రుండలుగ్గా భుజించుచు వయోవిలసన్నవ రూపలీలలన్
పండువు లాచరించుకొను భాగ్యమునన్ దలలోతుఁ మున్గి యీ
బెండున సార మే మనుభవింతురు లెండు రసజ్ఞశేఖరా! 72

అని వచియించు నార్ద్రి తరళాక్షికి తిమ్మరు సంత బాధగా
ననకుము తల్లి! నీ పడెడి యార్తికి నా హృది యోర్వలేదు కా
దని విధి నడ్డుకోఁ గల మహాత్ములె లేరు; భ్రమించు కాలమున్
బెనగొని వచ్చుచో ననుభ వించియె తీరవలెన్ వినమ్రతన్. 73

కమ్మని జవ్వనం బడవిఁ గాసిన వెన్నెల కాగ భర్త దుః
ఖ మ్మెట్లు లోర్చితో! నడుము గట్టుక మన్మధ ఘాటి కింత కా
లమ్మెట్లు లాగితో! సిలుగులంబడుచున్ గహనాల కెట్లు స్వ
ర్గమ్మును దింపితో! తెలియఁగావలె నీకె సృజించు బ్రహ్మకే! 74

ఉడికింపవే నారదుఁడె పరీక్షింప వచ్చిన ముక్కుసెనగలఁ జిటికలోన?
అడలింపవే మనోహరుఁడె యర్ధాయుష్కుఁడై యున్న వెనువెంటనరగియముని?
పుట్టింపవే వట్టిచెట్లకే పండ్లు కానలఁ దిండికిఁ గరవెయైన?
ఇప్పింపవే నాథుఁడే సంశయించిన నగ్నిలోఁబడి సాక్ష్య మగ్నిచేత?

పుట్టినిల్లు మెట్టినయిల్లు పూతవెట్టి
ఎవ్వ రమతల్లి! నీవలె నింతచారు
తర పతివ్రతాత్వాతి బంధురయశమ్ము
నవనిఁ బడించుకొన్న హైందవ వధూటి? 75

భారత పతివ్రతాళి శుంభచ్చరిత్ర
యందుఁ బ్రథిత నూత్నాధ్యాయమై రచింప
వెస లిఖింప కుండడు నీ పవిత్ర కథను
సుప్రసన్నుఁడౌ నే సుధీ సుకవియేని? 76

అనిన "లెస్సయంటి రయ్య తిమ్మరుసుల సచి
వావతంసా!" యనుచు కొనియాడి హర్ష
మంది రలసాని పెద్దన వంది తిమ్మ
నాది కావ్యర్ష మెఱిఁగిన యాంధ్ర కవులు. 77

కళగల్గి కొలలేని చారుణ్యమున నుట్టిపడుచుండెడి వదనవనరుహంబు
అరసినంతనె ప్రజనాకట్టుకొను, జాలి వెదజల్లు చల్లని వీక్షణములు
కర్ణయుగము మీఁదుగా మూపుక్రిందికి గునిసియాడెడి నీలికుంతలములు
గళమున నుండి యంఘ్రులదాఁకఁ గలకెంపు జారియంగీ స్వర్ణవర్ణతనువు

జోకగా నెడందను రుదురాకుపేరు
నొకకరంబున జపసరం బొక కరాన
దండము సువర్ణ కలిత కమండలువునుఁ
గలుగు యోగిని యోర్తు సాక్షాత్కరించి 78

నేనె మిముఁగొని రాను యత్నించుచుండ
మీరలె ప్రసన్నులైతిరా మేదినీశ!
మ్రొక్కఁబోవు రాధకు జగన్మోహనుండె
ప్రేమమున నిల్చి సాక్షాత్కరించినట్లు 79

ఎంతటి సుదిన మీనాఁడు కృష్ణదేవ!
మీరు చనుదేర ఋతురాజు చేరుకొనఁగ
నిగ్గిరి వనులు మల్లెపూమొగ్గ పొదలు
తెల్లగా విచ్చి సుధలెగ జిమ్ముచుండె. 80

ఈ గహనము నేటికి మీకుభాగమమున
విజయనగర సామ్రాజ్యమై పిచ్చలించె
నెన్ని యేండ్లు పూండ్లు మనిన నేమి ఫలము?
అధిప! సద్యశం బొకపూటదైనఁ జాలు. 81

సకలాంధ్ర వాగనుశాసను నేలిన చాళుక్య నృపుని ప్రశస్తి కన్న
పృథివీ కవన కుండలీంద్రుని మోసిన నెల్లూరి విభుని సందీప్తి కన్న
శృంగార పోషణ శ్రీనాథు నోమిన సింగన్న మంత్రి ప్రసిద్ధి కన్న
కావ్యోర్వీసోమ భాస్కరుల వెల్గించిన తత్ప్రభువుల సద్యశము కన్న

అష్టదిగ్గజ కవులతో నఖిల కళల
మున్నతికిఁ బెంచు నీ ఖ్యాతి మిన్నకాదె?
నిజముగా నీ తెలుఁగునేల నీవుఁ గాక
ఇంత సాహితీపోషకు లెవరు తండ్రి? 82

కలముఁ బట్టిన నవరసా లొలికిపోవుఁ
గత్తిఁ బట్టిన జయరంభ లత్తమిల్లు
సాహితీ సమ రాంగణ సార్వభౌమ!
ఎవ్వ రీడుజో డయ్యె నీ కీజగాన? 83

కాళీయ మర్దన ఘంటి కాంఘ్రియుగళిఁ జటుల దారిద్ర్య శీర్షమును మట్టి
ఉలియుఁబిల్లనగ్రోవిఁ గల సుధామధురిమల్ కవిపండితుల మనుగడల కడర
పదియాఱు వేల గోపస్త్రీలపైఁగల్గు వలపుః విద్యాభివృద్ధులకుఁ బొదల
కురుపాండవుల సంధిఁ గూర్చు వైదుష్యంబు నాంధ్ర జాత్యున్నతి కవఘటింప

అల్ల శ్రీకృష్ణుఁడే యిప్పుడాంధ్రి కవ త
రిలిన శ్రీకృష్ణ దేవరాయల వసుంధ
రాధిపుఁ డటంచు నిన్ను నే నభినుతింతుః
నింక నెవ్వరే మందురో! యే నెఱుంగ! 84

కొందఱు శ్రీధురంధరులు కొందఱు నిష్ఠదరిద్ర జాతకుల్
కొందఱు దివ్యసుందరులు కొందఱు వక్ర వికార రూపకుల్
కొందఱు సౌఖ్యతోషితులు కొంద ఱతిశ్రమ దుఃఖితుల్ గదా?
ఎందుల కీ విభిన్నము లొకేయొక యీరస వద్వసుంధరన్? 85

నరులు పూర్వ జన్మము లం దొనర్చుకొనిన
పాప పుణ్యక్రియలె పునర్భవము లగుచు
వారి కొడ గూర్చు నాయయి ఫలితములను
ధాననే యీ విభిన్నముల్ మాన వోర్వి. 86

నరుల సుగతికి సుకృతాలె తెరువులగుట
"జేయుఁడు సుకృతమ్ముల లెన్నచేయు" డంచు
సకల వేదా లఖిల మతాల్ సాటుచెవుడు
విశ్వతో ముఖముగ వినుపించు చుండు. 87

కంటిరే యీ రహస్య మో క్ష్మతలేంద్ర!
నరుల సుగతికి సుకృతాలె తెరువు లగుట?
ఎందఱయ్యా! యిట సుగతి నందుకొనను
సుకృతము లొనర్చెదు చరితాత్మకులు నేడు? 88

ధన మదమ్ముచేఁ గృష్ణావతారమందు
నీ తలను కాల నెట్టి నిన్ వీధి నమ్మి
అఘ మొనర్చిన సత్యభా మమ్మె యిప్పు
డీ వమల "తుకారాగా" తపించు చుండె 89

మిగుల నినుగొల్చు కొనుచుండి తెగడఁబోని
మగువ పై నీకుఁ బగబూనఁ దగు నటయ్య?
ఏకడైన రక్కసులపైఁ గాక పిచ్చు
కపయి బ్రహ్మాస్త్రమేతురే కృపఁ దొఱంగి? 90

నాఁడు నీవాడి కత్తికి చేడెకైన
పెండ్లి యదియేటి పెండ్లి? యీవేళ పెండ్లి
కావలయును ప్రత్యక్షమ్ముగా క్షితీంద్ర!
నీకుఁ బరమ సాధ్వీ తుకారాకు మగిడి. 91

దయను మాకు పునః పరిణయము సేయ
వచ్చిన రమాంబవేనీవు వనజవదన!
నీవు వాణీమ తల్లివే నీరజాక్షి!
శాంభవీ దేవివే నీవు నన్నుతాంగి! 92

పనిపడి మున్ను మమ్ముఁ గనవచ్చిన చిత్రహారంగు, నిన్న యి
వ్వని మము వేటకై పిలువ వచ్చిన చెంచెత యంగు, నీ యెడన్
గనఁబడుచుండె నద్భుతముగా, నెపుడో విడివడ్డ మమ్ము నీ
క్షణమున మేళవింపఁ గృపఁగందువు నీవెవరమ్మ యోగినీ? 93

అనిన నవున్ నిజం బెఱిఁగి యంటిరి మున్నొకనాఁడు మీకునై
పనిపడి మీపురంబునకు వచ్చిన చిత్రను నేనె, వేటకై
వినదము గొన్న చెంచెతను నేనె, కవీంద్రులు మీరు; మీకు నిం
కన్ను నమమాన మేల? రవికానవిచో కవి కాంచునే కదా? 94

హైందవమ్మున దేవుని యవల నధిక
గౌరవము ఋషీశ్వరులకే కలుగు కతన
యోగినిగ శేషజీవిత ముజ్వలింపఁ
ద్రిమ్మరుదు దేశదేశాలు ధీరఫణితి! 95

ఏ నిటీవల నీ ప్రాంత మేఁగుదెంచి
వింధును గదా! తుకారా పవిత్రి గాథ
మీ నెనరునకు మారమై కానలఁబడి
యనదగఁ జితించి పోవుచున్నట్లు తెలిసె. 96

ఆ సతీపతుల మధ్య నలుకలో ప్రేమ తలఁదూర్చ నేలంచుఁ దలఁచు కొనిరొ!
మా తుకారా మహాత్మ్మపతికే పత్ని యింకఁ గాంచు టేలంచు నెంచికొనిరొ!
ఆవడ్ల తో నట్లె యాతట్ల యెందుచే యంచితం బంచు భావించుకొనిరొ!
తమబిడ్డ పతికిదూరమయి కాఱడవులం దిడుమలఁ బడుచుంట నెఱిఁగికొనరొ!

ఎందుకో! యిన్ని యేండ్లైన నింతవఱకు
నీమెఁ గనిన యా తలిదండ్రు లీమెఁ గనరు!
మమత లుడిగెనో! కన్నదే మఱచి నారొ!
అంతు పడదు వారల యంత రార్ద్ర ప్రేమొ! 97

బాల్యముననుండి వలగొన్న ప్రాణసఖులు
నిలుగులఁబడి నలుగుచుంటఁ దెలిసితెలిసి
చేత నైనంత సాయంబుఁ జేయ కట్టె
యూర కుందురే యెంతటి కాౢరులైన? 98

నీవు నా తుకారాను మన్నించు కొఱకు
చెంచులను గూర్చుకొని నేనుఁ జెంచెత నయి
వేట నెపమున మిమ్మునీ విపినములకుఁ
దెచ్చినాను ! స్నేహమునుఁ సాధించి నాను ! 99

అనుచు నెల్లర కద్భుత మావటిలఁగ
ఆ నృపాల దంపతుల కైక్యమును గూర్పఁ
జిత్ర తాఁ బడ్డ యాతనఁ జెప్పు చుండి
"ఇంత జాగేల?" యనుచు నున్నంత లోన 100

అప్పటి కప్పు డా పరిణయంబున కన్నియుఁ గామధేనువుల్
చొప్పడి చేసినట్లు కడు సొంపగు మంగళ వాద్యముల్ జగా
చప్పరముల్ పురోహితులు సారెలు బూరెలు నయ్యె, ద్రవ్యపుం
గుప్పలు గల్గు వార లనుకొన్నవి యెయ్యవి కావు వెంటనే ? 101

క్షణము లోపల దేవేంద్ర సభను మించు
పెద్ద సభ యేరు పడియెను, పెండ్లి మంత్ర
ములు పురోహితులు పఠింప నులిసెను శుభ
వాద్యములు నల్ దెసలు ప్రతిస్వనములీన. 102

అంగ రంగాతి విభవ ప్రహర్షములుగ
రాయ రాజేంద్రునకు తుకారాకుఁ బెండ్లిఁ
జరిపినది చిత్ర; విబుధు లక్షతలు చల్ల
విశ్వనాథుఁ డాశీః పుష్ప వృష్టిఁ గురియ ! 103

కనన్నైన పెండ్లినే కంటి నింకఁ దడయు టెందుల కనిన యట్లినుఁడు గ్రుంకె
రాగిల్లి యపరాంబర వధూటి యిడిన యగరు ధూపము లనిన ట్లిరు లెసంగె
రాజ శబ్దం బిర్వురకొకటే యనినట్లు నెలరాజు పండు వెన్నెలలు గాసె
తెలినింగి సోర్నగండులనుండి సురకోట్లు కనుచున్న యట్లు చుక్కలు రహించె

అలఁతుఁడనె యన్నటుల జగద్వ్యాపకుండు
సుమ రజంబుల మంద మందముగ వీఁచె
నవల విషయంబు రేపులే! యనిన యట్లు
క్ష్మా స్థలి సమస్తమును సద్దు మణఁగిపోయె. 104